## Bibliographic Record Target

యోగానందయ్య, చిల్లరిగె.

జ్ఞానవతి / చిల్లరిగె యోగానందకవిచే రచియింపంబడి ప్రకటింపఁబడియె. - మచిలీపట్టణము : చిల్లరిగె యోగానందకవి, 1914.

v, v, iii, 220, 4, 1p. :port. ;19 cm.

Record no. 464

Yōgānandayya, Cillarige.

Jñānavati / Cillarige Yōgānandakavicē raciyimpambaḍi prakaṭimpam̐baḍiye. - Macilīpaṭṭaṇamu : Cillarige Yōgānandakavi, 1914.

v, v, iii, 220, 4, 1p. :port. ;19 cm.

Record no. 464



గ్రంథకర్త.

ఆంధ్రవాణీరత్నమాలా ప్రచురములు:-2

# జ్ఞానవతి.



గుడివాడ తాలూకా అంగలూరు గ్రామ వాస్తవ్యుఁడగు

చిల్లరిగె యోగానందకవిచే

రచియింపంబడి ప్రకటింపఁబడియె.

నందగిరి శేషగిరిరావు పంతులుగారి

ధన సహాయము వలన

సేతు ముద్రాక్షరశాలలో, ముద్రింపఁబడెను.

మచిలీపట్టణము.

1914.



వెల { చందాదారులకు రు 0-9-0
ఇతరులకు 0-14-0

# కవిజీవితము.

ఇది "జ్ఞానవతి" యనుకేవలపద్యమయ మైననవల. నాలుగు ఆశ్వాసములును రమారమి ౧౨౦౦ పద్దెములునుగలిగి విరాజిల్లుచున్నది. ఏతద్గ్రంథకర్త చిల్లరిగె యోగానందయ్యపంతులు. మధ్వబ్రాహ్మణులు. ఈయనతల్లి శేషగిరమ్మ; తండ్రి నరసింహారావుపంతులు. ఈకవి తనమాతామహస్థాన మైన "అంగలూ" రనుగ్రామమందు 1883 సం॥ న జన్మించెను; గనుకవయస్సిప్పటికి ముప్పదిసంవత్సరములు. వీనికి "వేంకటసుబ్బమ్మ, లక్ష్మీబాయమ్మ" అనునిద్దఱుపుత్రికలు. పెద్దపిల్లకుఁ బదునొకండవయేఁడు: చిన్నపిల్లకెన్మిదవయేఁడు. వీనిపితృస్థానము మొదట భీమవరముతాలూకాలోని "సీసలి" అనుగ్రామము.

ఇక్కవిశేఖరుండు తన కిరువదిసంవత్సరాలు వచ్చునందాఁక విద్యావ్యాసంగ మేమియుఁ లేక పిత్రార్జితభూములు వ్యవసాయము సేయించుచుండెను. రానురాను భూము లన్నియు ఋణాలపాలై జీవనోపాధి కిబ్బంది కలుగు నేమో యనుతలంపున సగ్రజుం డగువేంకటరమణయ్యపంతులచేఁ బ్రేరితుండై యితఁడు 1903 సం॥ లో రెండునెలలు ప్రయత్నము సల్పి ప్రయిమరీపరీక్ష గెల్చెను, మఱువత్సరమునఁ గొంతకాలము కొండంగిబోర్డుస్కూలుటీచరుగా నుండి 1895 సం॥ మునందు గుంటూరిగ॥ ట్రయినింగుస్కూలులోఁ బ్రవేశించి స్పెషల్ఫిఫ్తుస్టాండర్డుపరీక్షను, టీచరుమెథడ్సుపరీక్షను, నాసెంటరందు మొదటివాఁడుగా జయ మొందె. ఆసంవత్సరము దీనికిఁ దెలుఁగుటెక్స్టుబుక్కు కందుకూరి వీరేశలింగముపంతులుగారి హరిశ్చంద్రనాటకము. దానిని బోధించెడివారు సుబోధకు లయిన వేమూరి భానుమూర్తిగారు. కాఁబట్టి యీకవివరునకుఁ దెనుఁగున మంచియిష్టము గలిగె. అందులో నూటికిఁ దొంబదిగుణములు సంపాదించె. అదియే భాషాభివృద్ధికాదికారణము. ఆయేఁడే లోకజ్ఞానార్జనంబునకుఁ బ్రారంభము. పరదేశవాసప్రయాసంబున కాకాలమే మొదలు. నూత్న విద్యాభ్యాసము పరదేశవాసమున నేకవిధముల మనస్సంతాప మొనరించినను విద్యాసక్తుండై పట్టుదలగలవాఁడై యుంటచే నీకవివరేణ్యుండు సంపూర్ణవిజయం బొందెను.

అటుపైని రెండుసంవత్సరములు భీమవరముతాలూకా పెదపుల్లేరు, మహాదేవపట్టణము మొదలగుగ్రామములం దుపాధ్యాయుఁడుగా నుండి యిప్పటికి నిల్లువాకిళ్లు పొలము లన్నియు నప్పులపాలై పోయినందున 1907 సం॥ నవంబరునెలలోఁ దనయన్నగారు ప్రధానోపాధ్యాయుఁడుగా నున్న మాయంగలూరిబోర్డుస్కూలునందలి సహాయోపాధ్యాయపదవియందుఁ బ్రవేశించెను. ఈకాలములో వృక్షశాస్త్రము, వ్యవసాయశాస్త్రము చదివి గ. కె. ఎ. ప్రగేడ్పరీక్షకు వెళ్లి గెలుపొందెను. "కవితానిలయ" మ్మను బిరుదొంది దైనందినకళాభివృద్ధిం గాంచుచున్నమాయంగలూరు వీనియాంధ్రభాషాభిలాషాంకురమునకు దోహదం బీయ నయ్యె, ఒక కాలమందీ కవిభూషణుండు నన్నుఁ గోరి గణయతిప్రాసలక్షణంబులు దెలిసికొనెను. అంతటఁ గవిత్వసందర్భమున శబ్దజాలంబు దొరకుట కష్టముగా నుండె నని తోఁచినందున నమరకోశాభ్యాస మార్గంబు దెలిసికొని యుద్యోగధర్మముచే బవలు తీఱిక లేక పోయినను రాత్రులందుఁ గొంతనిద్రాభంగమున కోర్చి కొని యభ్యసింపఁ దొరకొనియె. క్రమక్రమముగా భాషాభివృద్ధిమూలకంబైనకవితాంకురము మానసక్షేత్రంబునఁ గరము పెరుఁగఁ దొడంగె.

ఇట్లుండఁగా 1909 సం॥ డిశంబరునెలలో నవాంతరముగా నీకవి పామర్రు బదిలీ కాఁబడెను. ఈతఁడు నా కొకవరుసను (నాతల్లికిఁ బినతండ్రికొమారుఁడు) మామయు నింకొకవరుసను (నాతండ్రికిఁ బినతండ్రి కూఁతుబిడ్డ) బావయు నగుచున్నాఁడు. ఈయన కన్నగారగు వేంకటరమణయ్యపంతులును నాకదేవిధముగా బంధు వగుటయే గాక పరమ మిత్రుండుఁగూడనై యున్నాఁడు. తద్ద్వారా యీ యోగానందయ్యపంతులును మిత్రుఁ డయ్యె. అట్టిస్థితిలో మాముగ్గురిలో నొకఁడు దూరస్థుఁడై నందులకు మిగుల విచారపడితి మని వేఱుగాఁ జెప్ప వలసినపనిలేదు. ఇతఁడు పామర్రులో నున్నకాలమందు నమరకోశాంధ్రనామసంగ్రహంబులు సంపూర్తిగాఁ జదివి జ్ఞానము గడించెను. మఱియు ఛందోలక్షణభాషాశాస్త్రముల కాధార మైనమహాభారతము కొంతవఱకు శ్రద్ధాళువై చూచెను, ఈజ్ఞానవతీగ్రంథ మచ్చటనే రచియించుటకు నారంభించెను.

అట్లుకొంతకాలము జరిగినతరువాత తనభార్యకు జబ్బు చేసినందున 1911 సం॥ లో నొకయేఁడాది సెలవు తీసికొని అంగలూరు వచ్చి కొందఱ



బాలురకు భారతము పాఠముగాఁ జెప్ప సాగెను. అప్పుడు వ్యాకరణగ్రంథంబులం గూడఁ బరిశీలించెను. జీవనాధారమునకుఁ గొన్ని వృత్తులును గల్పించుకొనెను. మధ్యమధ్య తీఱుబడి యైనప్పు డెల్ల నీగ్రంథము వ్రాయుచుండెను. ఈగ్రంథము కేవలము బుద్ధివైభవంబుచేఁ గల్పించి రచించెను; గాని యొకదాని ననుసరించి వ్రాయ లేదు. పిమ్మటఁ దనయుద్యోగమునకు వెళ్లి ప్రవేశించెను. కొన్నిమాసములు కడచినతరువాత ననేకహేతువులను బట్టి నౌకరీ వదలుకొని 1912 సం॥ లో మరల మాయంగలూరు వచ్చి నాపసుపుతోఁటకృషికిఁ దోడ్పడుచుండెను. అందులో నష్టము వచ్చినందున వ్యవసాయము కట్టిపెట్టితి. 1913 సం॥ లో నీకవిమిత్రుండు బందరు సేతు ముద్రాక్షరశాలలో రైటరుగాఁ బ్రవేశించెను.

ఇప్పటి కీగ్రంథంబు పూర్తిగావించుటయే గాక బాలశతకము ప్రైమరీవిద్యార్థులకు మిక్కిలి యుపయుక్తముగా నుండునట్లు రచియించుటచే సంవత్సరములో రెండుకూర్పులు (వెయ్యిప్రతులవంతున) పడి ఖర్చయ్యెను. "కనకవల్లి" అనునొక గద్యమయమగు నవలను "దేవయానావివాహ" మను నాటకమును వ్రాసెను. అనేకపర్యాయము లష్టావధాన మొనరించెను. గంటకు నూఱుపద్దెములచొప్పున నొకప్పు డాశుధారాకవిత్వముం జెప్పెను. సంగీతధోరణి కొంతగలదు; గానఁ బురాణముచక్కఁగాఁ జెప్పి మెచ్చించుకొనును. మనోహర మైనశైలితో నుపన్యాసం బీయఁ గలఁడు. చిత్రలేఖనమునందుఁ గొంతపరిచయ ముండుటవలనను బోధనాశక్తియు వినయవిధేయతలును బాగుగా నుండుటవలనను విద్యాశాఖాధికారులచేతను నదితరులచేతను యోగ్యతాపత్రికలు పెక్కు వడసి యుండెను.

ఈకవివతంసునివయ స్సిప్పటికి ముప్పదివత్సరములు గదా. అందు రెండువంతులకాల మూరకయే కడచి పోయె. శేషించినపదేండ్లలో నితండు కవిత్వభాషాభివృద్ధులకై కష్టించినకాలము రమారమి నాలుగువత్సరము లైన లేక పోయినను గురుకులవాసము చేయక పోయినను నన్నివిధముల వన్నెకెక్కి సర్వజనాదరణార్హం బయినయిట్టిసత్ప్రబంధమునకుం గర్తృత్వము వహించుటయే వీనిమనీషావిశేషంబునకును నిరంతరశ్రద్ధకును మాతృభాషాభిమానంబునకును సాక్ష్యముగా నుండె నని చదువరు లూహింపక పోరు.

అంగలూర నొనర్చిన ప్రారంభాష్టావధాన సమయమ్మున (ది 7-4-1911) మత్స్యపురాణాద్యనేకగ్రంథకర్త లగు బ్రహ్మశ్రీ అడవి సాంబశివకవిగా రిచ్చినయభిప్రాయము:—

తే॥ అంగలూరను నమరేశ్వరాలయమున
నవ్విరోధికృదబ్దచైత్రామలనవ
మిని బుధు లెచ్చ నవధానమును రచించె;
నష్టవిధములఁ బండితుల్ హర్ష మొంద॥

మ॥ ఘనధీమంతుఁడు నేఁడు చిల్లరిగె యోగానందనామంబునన్
బెనుపుం జెందుకవీశ్వరుండు బుధసామీప్యంబున న్వారిమ
న్ననకుం బాత్రత గాంచి గైకొనియె నెన్న న్మేటియష్టావధా
నినిరూఢాహ్వయ మీశ్వరుండు కరుణోత్సేకంబునం బ్రోచుతన్॥

పామఱ్ఱష్టావధానము (ది 13-6-12) బ్రహ్మశ్రీ లక్కావఝ్ఝుల; కృష్ణశాస్త్రిగారు:—

శ్లో॥ పశ్యైతాం సవయ స్సభా మసదృశీం పాంచాలికానా మహో
నైషాభ్రాంతసువిస్మృతం న భవతా సంసత్కృతాం ఖల్విదం
యోగానందకవే ర్వచోమృత మిదం విద్యాలసద్ధీమతః
గానానందరసం నిపీయ బహుని శ్చేష్టా తథా భాసతే॥

అప్పుడే బ్రహ్మశ్రీ జొన్నలగడ్డ; శ్రీరామచంద్రయ్య బి, ఏ, గారు:-

ఉ॥ శ్రీవెలయంగవిత్వ మది చెప్పుట దుష్కర మంతకన్న స
ద్భావ మెలర్పఁగా విబుధతండము మెచ్చెడు నాశుధారలో
వావిరిమై వధానము నెఱా సనఁ జేయుట దుస్తరంబు కా
దో! విబుధేంద్రులార! యది తోస మొసంగదె! యెల్లవారికిన్॥



ఉ॥ ఆరయ నీవిధంబున మహాద్భుతలీల వధానకార్యముల్
భార మటంచు నెంచక ప్రభావధురీణుఁడు యోగనందవి
స్ఫారసమాహ్వయుం డిటఁ బ్రామఱ్ఱుగ్రామమునందుఁ జేసె; నా
భారతి వీనినాల్కపయి వాసము చేయుచుఁ గోర్కు లిచ్చుతన్॥

పైస్థలంబులం దింకను గొంద ఱిచ్చినయభిప్రాయములును రాజమండ్రియందు ది 26-5-12 తేదీ నొనరించిన యవధానముం గూర్చి సభ్యు లొసంగిన యభిప్రాయములును దెల్పుటకు గ్రంథవిస్తరభీతిచే వెనుదీసి యింతటితో విరమించు చున్నాను.

అంగలూరు,
ది 20-5-13.

ఇట్లు సంపాదకుఁడు,
నందగిరి; శేషగిరిరావు.



# పీఠిక.

—:o:—

పూర్వకాలమున మహాద్దశ ననుభవించిన మన యాంధ్రదేశమునం దలి మాతృభాషామతల్లిక నడుమఁ గొంతకాలము నిద్రావస్థలో మునింగి యున్నను బ్రస్తుతము కొందఱుమహనీయులచేఁ బ్రబోధింపఁబడి దినదినాభివృద్ధి వికాసమునొందుచున్నది. భాషాభివృద్ధికిఁ గవిత్వబీజము మూలాధారంబని నాయనుభవోద్దేశము. బాల్యమందు వ్యాకరణకావ్యాదులు వల్లెవేయనివారు గ్రంథావలోకనంబువలనఁ గొంతలోకజ్ఞానము భాషాజ్ఞానము గడించి కవితాలత నాశ్రయించి నిరంతరప్రయత్న మొనర్చుచు ననేకపదమ్ములను బ్రయోగంబులను మనోనిలయంబునం బ్రవేశపెట్టుచు సర్వవిధముల జనస్తుత్యులు గావచ్చును. అందులకు దృష్టాంతముగా నేనే యున్నవాఁడనని తెలుపుట కెంతయు సంతోషపడుచుంటిని.

నాకు మొదటినుండి యాశుధారాకవితయందు మిక్కిలియిష్టము. వచన గ్రంథరచనకంటెఁ బద్యప్రబంధనిర్మాణమునం దాశమిక్కుటము. ఏగ్రంథమైననితరులు రచించి యున్నగాథంబట్టివ్రాయుట పునర్వివాహపద్ధతి వలెఁ గొందఱ కనిష్టమయి యుండునని నామిత్రుల యభిప్రాయము; గనుక నీజ్ఞానవతిని నిర్గద్యముగాఁ గల్పించి రచించితి. ఇందనేకవిషయములు గూర్పవలెనని తలంచితిఁ గాని గ్రంథవిస్తరభీతివలన సాగలేదు. గురుశిక్షితుండనుగాక స్వయంకృషివలన భాషాజ్ఞానసంపన్నుఁడ నవుటచేఁ బొరపాటభిప్రాయములుపడి తప్పులు వ్రాసి యుందును. సహృదయులైనదోషజ్ఞు లరసి తెల్పిన విధేయుఁడనై పునర్ముద్రణంబున సవరించుకొనెద నని వందనపూర్వకంబుగా విన్నవించుకొనుచున్నాను.

ఇట్లు విద్వద్విధేయుఁడు,

చిల్లరిగె యోగానందయ్య.

అష్టావధాని.

బందరు.
ది 25-2-14

# కథాసంగ్రహము.

పూర్వకాలమున మనహిందూదేశమందు సాత్పురావింధ్యపర్వతముల మధ్యప్రదేశములోఁ "గాంచనపుర" మనుపట్టణ ముండెను. ధర్మపాలుం డనురాజేంద్రుండు దాని నేలుచుండె. ఆయనకు సంతు లేదు. భార్యలు మాత్ర మెనమంద్రు గలరు. పెద్దభార్యపేరు వినుతశీల. రాజొకనాఁడు సభలో "సంతానముం బొందునుపాయము సెలవిం" డని కోరెను. "పుణ్యతీర్థమ్ములను సేవించినచో వాంఛితమ్ము లీడేఱు" నని పురోహితుండు నొక్కి వక్కాణించె. రాజు విశ్వసించి కుటుంబపరివార సమేతుఁడై చనెను. అనేకదివ్యక్షేత్రములు గాంచె. కొంతకాలమునకు మరలి స్వస్థానముం జేరె. వినుతశీల గర్భవతియై కుమారికం గనెను. ఆబాలకు "జ్ఞానవతి" యని పేరు పెట్టిరి. బాల బాలచంద్రునివలెఁ బెఱిగి పెద్దయై శుభదినంబునఁ బ్రథమరజస్వల యయ్యె. తండ్రి వివాహప్రయత్నము సేయ నెంచి మంత్రులతోఁ జెప్పెను. మంత్రులామెరూపపటములు విప్రుల కిచ్చి దేశదేశములకుఁ బంపిరి. విప్రులు సకలరాజధానులు తిరిగి రాకొమరులపటములం గొని తెచ్చిరి. అందయోధ్యాదేశరాజకుమారుఁడైన నైజమార్గుని జ్ఞానవతి వరించెను. ధర్మపాలుఁడు తద్విషయము దెల్ప నయోధ్యారాజు తర్లి వచ్చె. శుభముహూర్తముల వివాహము జరగెను. అయిదవనాఁ డాచారప్రకారముగా వధూవరులకు శోభనకార్యము జరపిరి. పిమ్మటఁ బెండ్లివారు వరుని దిగవిడిచి వెళ్లిరి.

శోభనమైననాఁడు రాత్రి వధువును వరుఁ డొకకోరిక కోరెను. అమహానుభావుఁ డాప్రబుద్ధుఁ డట్లు కోరనిపక్షమున నీకథ కాధారమే లేక పోయెడిది. అట్టికోరిక భూతభవిష్య ద్వర్తమానంబుల నెవ్వరును గోరలేరు. చదువరులారా! చెప్పుమందురా! నవ్వెరు గదా! ఏమయినను సరే. తెలిపెద వినుండు.

నాటినిశయందు వరుఁడు తాంబూలాదిసౌఖ్యముల నొల్లలేదు. మూతి ముడుచుకొని బట్ట ముసుఁగు పెట్టుకొని గోడకేసి తిరిగి పండుకొనెను.

"కారణ మే" మని జ్ఞానవతి వేఁడఁగాఁ "జేసెద నన్నుఁ జెప్పెద" నని
కొంతసేపటికి జవాబు చెప్పెను. ఆమెయు "శక్తివంచన లేకుండ నొనర్చె
ద" నని యొప్పుకొనెను. అంతట నైజమార్గుండు సమ్మతిపడి "సతీ!
నీతో భోగింపను, నీచెంత నుండను. నీవు పతివ్రతాధర్మము విడువక కొడు
కును గన వలయు. ఇదే నాకోరిక" అనెను. అది యసాధ్యకార్య మని
యామె పెన్మిటి కనేకవిధముల బోధించెను. ఆమూర్ఖుఁడు పట్టినపట్టు వీడఁ
డయ్యెను. తుదకు నింటికిఁ బోయెద నని మిష పెట్టి వేదపురికిం బోయె.
ఆపురనాథుం డీతనికి స్నేహితుండు.

అనంతరము జ్ఞానవతి యనంతచింతాక్రాంతస్వాంత యై యుండె.
"నీచింతకు మూల మే" మని చెలికత్తె యైనశారద యడిగెను. చెల్మిని
బట్టి జ్ఞానవతి మర్మము విడిచి చెప్పెను. శారద యనఁగా నసాధ్యకార్యని
ర్వాహణవిశారద కావున "సఖీ! నీచింతాసాగరమ్మునకు నన్నోడఁగాఁ
జేసికొమ్ము. పరమదయాళుం డగుభగవంతుండే నీకుఁ గర్ణధారుం డగు"
నని ధైర్యము నెలకొల్పి వెంటనే మారువేసమును ధరించి యయోధ్యకు వెళ్లె
ను. ఆరాజు "కొమరుండింకను నింటికిరాలే"దని విచారపడుచు మంత్రులం
గని "దూతనుబంపినాసుతునిరప్పింపుఁ"డనియాజ్ఞాపించె. నైజమార్గుండెచ్చ
టికేగెనో శారద తెలియఁ జాలక చింతాకులచిత్త యై యిలు సేర మరలి
వచ్చుచుండఁగా దారిలోఁ గొందఱు బాటసారులు "అయోధ్యారాజుగారి
కొడుకఁట. ఎవ్వరికిం జెప్ప కిచ్చటికో యేతెంచె నంట. వేదపురీశ్వరు
నింట మొన్న మనము చూచితిమి. అతఁడే యీరాజుగారి కొమరుం డని
తెలిసికొంటిమి గదా. పాపము! వీరికిఁ దెలియ లేదు కాఁబోలు" నని చెప్పు
కొనుట విని సంతసించి వెళ్లి చెలికిఁ దెలిపెను. వార లిద్దఱు ప్రచ్ఛన్నవేష
ములు ధరియించి బయలుదేఱ నిశ్చయించుకొనిరి. తాము వెళ్లుసంగతి జ్ఞాన
వతి తనతల్లికి మాత్రము తెల్పెను.

ఆరాత్రి వా రొకముత్తికడఁ గలసికొనున ట్లేర్పఱచుకొనిరి. ముం
దచ్చటికి శారద పూరుషవేషముతో గుఱ్ఱ మెక్కి వచ్చెను. పిదప జ్ఞానవతి
నిజరూపముతో బాణబాణాసనకృపాణాద్యాయుధధారిణి యై యుత్తమ
తురంగమారూఢ యై చేరెను. ఒరులు గుఱుతుపట్టకుండ నొడలినిండ ము
సుంగు వేసికొనెను. అది నిర్జనప్రదేశము. నిశీథినీమధ్యసమయం బవుటం



జేసి గుఱ్ఱము డిగ్గి ముసుంగు తొలంగి చెలితో నేమో ముచ్చటింప దొరఁకొ
ననామెమాటకు శారదయడ్డమై "సఖీ! వేసము మార్పవే దేమి? మోసము
వాటిల్లదే!" యన జ్ఞానవతియుఁ బురుషవేషము దాల్చెను. ఆ దంతయు
నాచెట్టుపయి నున్నదొంగలు గని వారిబాటకు నడ్డము వెళ్లి భయంకరస్వ
రముతో నఱచి బీతు కలిగింపఁ జూచిరి; గాని జ్ఞానవతి వాండ్రను శరవర్ష
ముతో ముంచి నొంచెను. వారలు పాఱిపోయి దొరదగ్గఱ మొఱ పెట్టుకొ
నిరి. మరల దొంగలదొర పురికొల్పఁగా నాచోరులు బాటసారులవేసములు
దాలిచి వారిప్రక్కనే నడచి పోవుచు నాకస్మికముగా శారదాశ్వపాదం
బులు నఱికిరి. తత్క్షణమే శారదను దనగుఱ్ఱముపై నెక్కించుకొని జ్ఞానవతి
మహాకోపవతి యై దొంగలను వెంబడించి నలుగురిని జంపెను. హతశేషులు
పాఱిపోయి దొరకుఁ దెల్ప నాయాఁడువాండ్రసాహసధైర్యంబుల కచ్చెరు
వంది దొంగలగురువు మునివేసము వైచికొని శిష్యులం గొందఱను వెంటబె
ట్టుకొని చని వారిదారిలోఁ గూరుచుండెను. అప్పటికిఁ దూరుపు తెల్లవాఱు
చుండెను.

జ్ఞానవతీశారదలు దారి తెలియక యానిరాశారిం జేరి మార్గ మడిగిరి
"ఈనాఁడు నాయాశ్రమంబున నుండుఁ" డని ముని కోరెను. రాత్రి నిద్ర
లేక డస్సి యున్నందున వారలు నొడంబడిరి. మానిశిష్యుం డొకఁడు తమ
చోటికి వారలను గొంపోయె. అక్కడ పాతాళగృహం బొం డుండె.
అందలివా రెల్లరు బైరాగివేసములతో నొప్పుచుండిరి. ఆకన్నియలతో
దొంగలమేటి "చీఁకటిపడెను; గనుక మేము దోపిడికిఁ బోయెదము. నిద్దుర
పో నిచ్చి వీరి నిద్దఱను జంపి నగ లొలుచుకొనుఁ డని చెప్పి వెళ్లెను. తత్క
న్యకలును వీరును గష్టసుఖములు ముచ్చటించుకొని చెలికత్తె లై దొంగలసొ
మ్మంతయుఁ గొల్లకొని నడురేయి లేచి పోయిరి.

అట్లుగుచుండ నరుణోదయం బయ్యె. ఆ త్తతి శ్వేతు దిన్నవరా
హం బొకటి పరువెత్తుకొని వచ్చి జ్ఞానవతిముందఱఁబడెను. దానిని గళింగదే
శపరిభువు తఱుముకొని వచ్చెను. జ్ఞానవతి దానిని రక్షింపఁ బూనెను. ఆరా
జలిగి యుద్ధము చేసి మూర్ఛబడఁ గొట్టి యామెను భటులవలన నెత్తించు
కొని పోయెను. శారదాదులును దెబ్బల కోడి పాఱిపోయి తుద కాపట్టణ
మే చేరిరి, ఎఱుకతలవలె సంచరించి గుట్టంతయు నెఱింగి కడకు జ్ఞానవతిని

విడిపించుకొని దాఁటి పోయిరి. జ్ఞానవతి పడిపోయినపుడు కళింగరాజభటులెత్తుకొని పోవుసందర్భమున నామె యోఁడ దని యేలికతోఁ జెప్పిరి. ఆఱాజున కామెను బెండ్లాడ మనస్సు పుట్టెను. జ్ఞానవతి కపటోపాయముచే గడువు కోరి కాలము పుచ్చెను.

తరువాత నల్వురు వేదపురిం జొచ్చిరి. వేశ్యావేషంబులతో నారాజసభ కేగిరి. ఆటపాటలచే మెప్పించి ధనబహుమాన మక్కఱ లేదని రోగ్యతాపత్రికను వ్రాయించి పుచ్చుకొనిరి. ఆపురిలోనే గుడారము వైచికొని కాపుర ముండిరి. ఆటసమయమం దొకభోగముదానిపై నైజమార్గునకుఁ గోర్కి పుట్టెను. పరస్త్రీగమనము నరకహేతు వని సఖుఁ డెంత సెప్పినను వినక పోయెను. చెలికానిమనసు నొప్పింప రా దని కడకు వేదపురాధిపుం డొప్పుకొని తగినసాయము చేసెను. నైజమార్గుం డెంత ధన మిచ్చెద నన్న నాభోగముది వల దని తనయిష్టప్రకారము కోరినపుడెల్ల నుత్తరంబులు వ్రాసి యి మ్మనెను. అతఁడు నందుల కియ్యకొని స్వేచ్ఛగా భోగించు చుండెను. అతఁడు వరించినవారకాంత జ్ఞానవతియే. కొన్నాళ్లకు గర్భోత్పత్తి యై కొడుకు గల్గెను. వానివీపున నైజమార్గుఁడు తనముద్దుటుంగ్రమ్ముతో రక్ష వేసెను. ఆమె యిష్టప్రకార మెన్నియో గుర్తు లిచ్చెను.

అయోధ్యనుండి మంత్రిప్రేషితుం డైనదూత హేమపురికిఁ జేరి పెండ్లికొడుకును బంపుఁ డని ధర్మపాలుని నడిగె. నాఁడే వెళ్లెనని ధర్మపాలుండు బదులు చెప్పె. ఆబంటాకబురునే యయోధ్యానాథునకు వచ్చి చెప్పెను. అతఁడు మఱింత చింతింప సాగె. అప్పుడు పూర్వవిరోధి యొకఁడు మాఱువేసముతో వచ్చి "అయోధ్యాదేశచక్రవర్తీ! ఆగ్రహమూర్తీ! మీనామము వియ్యంకునియెడల సార్థకము చేయవలెను. మీబిడ్డను ఖైదులో వేసినాఁ డఁట. నాకాయూర బందుగు లుంటవలన మెన్న వెళ్లి వింటి. మీకుఁ దెల్ప వచ్చితి" నని పలికి యలుక వొడమించి వెళ్లె. అయోధ్యారాజు మండిపడి దాడి వెడల సమకట్టె. మంత్రి నివారించి ద్వితీయసందేశ మంపె. ఆసందేశహరున కాపూర్వవైరి లంచ మిచ్చి యాఁపి తానే పోయి ధర్మపాలుని లేనిపోనిమాట లని కలఁత పెట్టె.



కట్టకడ కిద్దఱకుఁ గలహము పెంచె. అయోధ్యారాజు దండెత్తి పోయెను. లోఁగడనే వినుతశీల కొమార్తసంగతి భర్తకుఁ జెప్పె. వెల్లడించిన మోస మని ధర్మపాలుఁడు కప్పి పుచ్చె. ఆసమయములో వగ పొందెడివినుతశీలకడకు శారద యెఱుకతగా వచ్చి ధైర్యము చెప్పె. మఱియు యుద్ధము పొసంగుట గని నైజమార్గుండు తనయొద్ద నుండె నని వేదపురీశుండు వ్రాసినట్టు సృష్టించి దూతవేషముతో నయోధ్యారాజునకును, జ్ఞానవతివిషయమై కూడ నట్లే ధర్మపాలునకును జాబులందఁ జేసెను. ధర్మపాలునియుత్తరములో సభ చేయ వలసినయేర్పాటులు గూడ వ్రాయఁబడి యుండుటవలనఁ దద్విధముగా సమరము మాని సభ చేసెను. ధర్మపాలుఁడు తత్సభ కాహ్వానము చేసినట్లు లేఖ యొకటి వేదపురీశునకుం జేరెను. వేదపురీశుఁడే గాక నిజముగా ధర్మపాలునిచే నాహ్వానపత్రికలనందిన కళింగదేశాధిపతి యవనదేశాధిపతి మొదలగు పెక్కురు రాజులును గొప్పగొప్ప పండితులు మున్నగువారును హేమపురము నిండిరి. ఆసభకు మునుపటిచోరులును వచ్చియుండిరి. కావున శారద తమపడినయాపత్కష్టములును జెప్పి లేకలు లోనగువానిని దృష్టాంతపఱచి జ్ఞానవతి పాతివ్రత్యధర్మము తప్పక యౌరసపుత్రునిఁ గనియె నని మనోహరశైలితో గొప్ప యుపన్యాస మిచ్చెను. సభ్యు లెల్లరు మిగుల నచ్చెరువందిరి. వియ్యంకులు పరస్పర క్షమాపణలు గోరికొనిరి. జ్ఞానవతి కుశపతిసహిత యై యత్తవారింటికి వెళ్లి బహుకాలము సమస్తభోగము లనుభవించెను.



# విషయసూచిక.

## ప్రథమాశ్వాసము.


| | పుట |
|---|---|
| దేవతాప్రార్థన ... ... | 1 |
| పూర్వకవిస్తుతి ... ... | 2 |
| ఇష్టబాంధవస్తుతి ... ... | 4 |
| కృతిప్రస్తావన ... ... | 9 |
| కవివంశవర్ణనము ... ... | 11 |
| షష్ఠ్యంతములు ... ... | 17 |
| కాంచనపురవర్ణనము ... ... | 19 |
| సంశయాళుం డను విప్రబాలకుండు హేమపురిం జొచ్చుట ... | 20 |
| అన్నదాన సంభావణము ... ... | 22 |
| సంశయాళుని వృత్తాంతము ... ... | 25 |
| కాంచనపురీనాథుని వర్ణనము ... ... | 26 |
| ధర్మపాలునిచింత ... ... | 27 |
| వినుతశీలా సంతాపము ... ... | 29 |
| ధర్మపాలుండు నిజచింతను సభాపండితులకుం దెల్పుట ... | 33 |
| ఆస్థాన కవీంద్రుఁడు పూర్వభాగ్యముం గూర్చి చెప్పుట ... | 35 |
| రాజపురోహితుని సంభావణము ... ... | 37 |
| పుత్రసంతాన ఫలము ... ... | 41 |
| సంశయాళుఁడు చదువు మానుట ... ... | 44 |
| బాలకులకు విద్య నేర్పించు పద్ధతి ... ... | 46 |
| ఉపాధ్యాయుల లోపములు ... ... | 49 |
| ఎల్లరకు విద్యముఖ్యము ... ... | 51 |
| బాలబోధక విధి ... ... | 54 |
| బోధకోద్యోగ గౌరవము ... ... | 57 |
| పౌరుషేయంబె ముఖ్యము ... ... | ,, |


## ద్వితీయాశ్వాసము.


| | |
|---|---|
| సంశయాళుండు తన తప్పొప్పుకొనుట ... ... | 60 |
| ధర్మపాలుండు తీర్థయాత్రలకు వెళ్లుట ... ... | 61 |
| సూర్యాస్తమాన వర్ణనము ... ... | 63 |
| ధర్మపాలుండు మంత్రులతో మాటలాడుట ... ... | 67 |





| | పుట |
|---|---|
| ధర్మపాలుఁడు రాజ్యపాలనము నరకహేతు వనుట ... | 68 |
| సచివాగ్రణి పరిశ్రమ లాభంబు సెప్పుట ... ... | 70 |
| ప్రభుత్వఫలము ... ... | 71 |
| సచివాగ్రణిని రాజు మెచ్చుకొనుట ... ... | 76 |
| కాశీగోపుర వర్ణనము ... ... | 78 |
| ధర్మపాలుండు కాశీపురంబు చేరుట ... ... | 80 |
| గంగానదీ వర్ణనము ... ... | 82 |
| హిమవచ్ఛివ సంవాదము ... ... | 85 |
| కాశీవిశ్వేశ్వర దర్శనము ... ... | 88 |
| నుతశీల విశ్వేశ్వరునిఁ గొల్చుట ... ... | 92 |
| రాజు కాశీదివ్యస్థలంబుల నెల్ల సేవించుట ... ... | 94 |
| ధర్మపాలుఁడు నిజపురంబు సేరుట ... ... | 96 |
| ధర్మపాలుండు గృహప్రవేశం బవుట ... ... | 101 |
| వినుతశీలను స్త్రీలు చూడవచ్చుట ... ... | 103 |
| గర్భిణీస్త్రీ వర్ణనము ... ... | 106 |
| వినుతశీల నీళ్లాడుట ... ... | 109 |
| సంతృప్తి ... ... | 111 |


## తృతీయాశ్వాసము.


| | |
|---|---|
| జ్ఞానవతి బాల్యక్రీడ ... ... | 114 |
| జ్ఞానవతీ వివాహ ప్రయత్నము ... ... | 117 |
| జ్ఞానవతీ స్వయంవరము ... ... | 120 |
| జ్ఞానవతీ పరిణయ మహోత్సవము ... ... | 122 |
| వధూవర సంవాదము ... ... | 125 |
| నైజమార్గుండు వేదపురికిం జనుట ... ... | 128 |
| జ్ఞానవతీ వనక్రీడ ... ... | 130 |
| జ్ఞానవతిని శారద విమర్శించుట ... ... | 132 |
| శారద వెరవుసెప్పుట ... ... | 133 |
| జ్ఞానవతీ శారదలు దేశాటనకుఁ బోవుట ... ... | 135 |
| చోరు లాండ్రొరులు సంభాషించుకొనుట ... ... | 137 |
| జ్ఞానవతీ శారదలకు దొంగ లడ్డమగుట ... ... | 138 |

| | | | పుట |
|---|---|---|---|
| దంభమాని వృత్తాంతంబు బయలుపడుట | ... | ... | 142 |
| యవనభూపసుతలు చెఱఁబాయుట | ... | ... | 147 |
| వనవర్ణనము | ... | ... | 149 |
| జ్ఞానవతి కళింగరాజుచేఁ బట్టుపడుట | ... | ... | 150 |
| జ్ఞానవతి చెఱఁ బాయుట | ... | ... | 156 |
| వేదపురీశునకు నైజమార్గుండు తనకథం జెప్పుట | ... | ... | 159 |
| వేదపురాధిపుండు నైజమార్గునకు హితోపదేశము సేయుట | | ... | 162 |
| కూఁతుసంగతి వినుతశీల తనపతికిం దెలుపుట | ... | ... | 163 |
| వినుతశీలను రాజూరార్చుట | ... | ... | 165 |
| ధర్మపాలుఁడు పురవార్త లెఱుంగుట | ... | ... | 166 |
| అయోధ్యాధీశుని ప్రథమ సందేశము | ... | ... | 167 |
| ఒక వేశ్యాంగన వేదపురీశుని సభకేగుట | ... | ... | 170 |
| వేశ్యాసంగీతము | ... | ... | 171 |
| వేశ్యామణిని నైజమార్గుండు మోహించుట | ... | ... | 173 |
| వేశ్యాసంభోగనష్టములు | ... | ... | 175 |
| వేశ్యామణితో నైజమార్గుండు భోగించుట | ... | ... | 178 |
| **చతుర్థాశ్వాసము.** | | | |
| ధర్మపాలుని ప్రత్యుత్తరముం గూర్చి యయోధ్యారాజు చర్చించుట | | | 182 |
| అయోధ్యాధీశుని ద్వితీయసందేశము | ... | ... | 185 |
| కపటదూత వృత్తాంతము | ... | ... | 186 |
| కపటదూత ధర్మపాలునితోఁ బ్రిసంగించుట | ... | | 187 |
| అయోధ్యాధీశుఁడు ధర్మపాలుని పైకిదాడివెడలుట | | ... | 189 |
| వినుతశీల శోకించుట | ... | ... | 192 |
| ఉగ్రదంష్ట్రితీవ్రదృష్టుల యుద్ధము | ... | ... | 194 |
| ఉభయసేనాసంకులసమరము | ... | ... | 196 |
| సంధిజాబులు ... | ... | ... | 198 |
| పూరుషవేషముతో శారదపలుకుట | ... | ... | 201 |
| శారదనిజవేషముచూపిపలుకుట ... | ... | ... | 202 |
| సభవారి యభిప్రాయములు ... | ... | ... | 211 |
| కథాసమాప్తిశ్రమము ... | ... | ... | 214 |




శ్రీమత్పరాత్పరాయనమః.

# జ్ఞానవతి

## ప్రథమాశ్వాసము

దేవతాప్రార్థన.

శా॥ శ్రీవేదాదిసమస్తశాస్త్రతతులున్ • జెప్పంగ లేవెవ్వనిన్
భావింపంగ నశక్య మౌనెవనిరూ•పప్రాభవస్థానముల్
జీవుల్ సర్వపదార్థముల్ గలుగ నే•నేవ్యాప్తుఁడాధారమౌ
దేవున్నిత్యునన౦తునాద్యునెపుడున్ • దీక్షామతింగొల్చెదన్॥

చం॥ పనులనడంచువిఘ్నములఁ•భర్తయనేకపతుండమండితుం
డనుపమదివ్యమూర్తి యహి•హారుఁడు తుందిలుఁ డంచు [గోగజా
శ్వనికరముల్ భయంపడుచుఁ • బాయుటఁజేసి మహోద్భ [తాఖువా
హనుఁడయిసంచరించెడిగ•ణాధిపుఁ గొల్చెదఁగార్యసిద్ధికిన్॥

ఉ॥ సృష్టికిఁ బూర్వమందు నిజ•చిత్తమునం దలపోయనంత నే
దృష్టికిఁ దోఁచువాగ్రమణి•దృష్టివిలాసవశాత్ముఁ డౌచు సం

తుష్టి వరించి విష్టపచతుర్దశసృష్టిని జేయువేడ్కను
తత్క్లృప్తచతుర్ముఖంబులసతింధరియించినధాతఁగొల్చెదన్॥

సీ॥ వందారుబృందారకేందిందిరాళికిఁ
దుందముల్ నిండ మరంద మొసఁగు
నఖిలాండకోటిపూర్ణాజాండవేదాది
మూలంబు లై యొప్పి ముద మొసంగు
మందాకిని జనన మందిరశృంగార
మందిరంబు లటంచు మంతుకెక్కు
భక్తమానసేంద్రియాహృద్వ్యక్తంబు లై సర్వ
వస్తుగర్భంబుల వఱలు చుండు

తే॥ గీ॥ నట్టిపదములశౌరి దైత్యకులవైరి
భూరికరుణాలవాలుఁ బ్రమోదశీలు
భావుకాకారు గిరిధీరు మావిహారు
మామకాభీష్ట మీడేర్ప మదిని గొల్తు॥ ౪

మ॥ పరమానందహృదంతరాళుఁడు శివావామార్ధభాగాం
[గుఁడై
పరమామ్నాయతురంగమవ్రజుఁడునై ఫాలాగ్ని నేత్రుండునై
భరితాకాశతరంగిణీజటుఁడు నై బాలేందుసన్మౌళి యై
వరకైలాసమహీధ్రధాముఁ డగుశర్వాణీశునర్చించెదన్॥

శా॥ శ్రీమద్విష్ణుపదారవిందనివసచ్చిత్తద్విరేఫంబు దా
వేమారున్మకరందపానము గనన్ విచ్ఛిన్నచింతన్ బరం
ధామాంశోద్భవ రామసంస్మరణసంధానప్రభావోన్నతిన్
నేమం బొప్పఁగ నుండునస్ఖలితవర్ణి న్మారుతిం గొల్చెదన్॥



ఉ॥ “గానమొకండు సాహితి యొకండ”నుగుబ్బలఁదాల్చివల్లకీ
ధ్వానముతోడఁ గంకణవితానరవంబులు మేళవింపఁగా
నానన మెత్తి పాడుచుఁ బదాభినయం బొకకంటమీటుచే
మానినిభర్తృకింపునిడుమానుగ! నావిధిరాణిఁ గొల్చెదన్॥

ఉ॥ గంగను నెత్తిఁబెట్టుకొను కాంతుఁగనుంగొని కిన్క “సాజమా
నెంగిలిబుద్ధి మాన్ప నగునే! కడు పారఁగ మేసిపోయి గో
వెంగిలివిస్తరిం గొఱుకనెంచదె! యం”చనవ్విశంభుఁ డ
ర్ధాంగమునందుఁ దాల్చినహిమాద్రిసుతన్ భజియింతు
[నెమ్మదిన్॥ ౫

శా॥ శ్రీవైకుంఠపురీశుతోఁ జనువుతోఁ “జెల్లించు నాకోర్కెనో
దేవా! మేన ధరించునన్ను, భవుఁ డద్దేవిన్ మెయిందాల్చెన
ట్లేవీక్షించితి” నాఁగఁ జక్రికని “నీయిష్టంబు కాని”మ్మనన్
దా వక్షస్స్థలమెక్కినిల్చినరమాతన్విన్ మదిం గొల్చెదన్॥

పూర్వకవిస్తుతి.

ఉ॥ భారతవంశకారకుని భవ్యయశోవిభవాభిరామునిన్
ఘోరభవాబ్ధితారకు నకుంఠితతీవ్రతపోవిశిష్టునిన్
ధీరత నాల్గువేదములు దీరిచి తృప్తుఁడు గాక భారతం
బారసి చేసినట్టిఘను వ్యాసుని సద్గుణవాసుఁ గొల్చెదన్॥

ఉ॥ పుట్టినవెంటనే పరతపోధనసంగ్రహనిశ్చితాత్ముఁడై
దిట్టతనంబునం బయలుదేఱి పరాశరుపట్టిపిల్వఁగన్
నెట్టినలబ్ధవర్ణుని వినిర్మలచిత్తుఁ గ్రుధాదిజిత్తునిన్
దిట్ట శుకాహ్వయున్ గొలుతు నెమ్మదినెప్పుడు భక్తిసక్తతన్॥

ఉ॥ తిక్కనసోమయాజిముకుతిమ్మననన్నయభట్టు లంచుఁ జే
రెక్కినధీరపుంగవుల నింకను భాస్కరపోతనాదులన్

జిక్కఁగ నెంచి వ్రాయుటకుఁ జాలదు కాలము నాకుఁ గావునన్
మక్కువతోడ నిత్యమును మానసమందు స్మరించుచుండెదన్

ఉ॥ ఇవ్వడులలోకమానితకవీశ్వరకోటిగుణాదు లన్నిటిన్
జెప్పి లిఖింప యత్నములు సేయుట; యోగిసటాకచాళి నా
యుప్పరవీధితారకల నోలి గణింపఁ దలంచుటంచు నే
విప్పక దాఁచితిన్ హృదయపేటి నవీనకవీంద్రభూషలన్॥

చం॥ ప్రకటకవీంద్రుఁ డప్పసము వజ్రములందినుహంసమాడ్కి వే
ఱొకకవికావ్యసింధువున నొప్పులనే గ్రహియించుచుండ నీ
చకుకవి తప్పులే గను; విసారములం గొనుకొంగ చాడ్పునన్
బకగణ మెన్నికం గనునె! ప్రస్తుతహంసలరీతి ధాత్రిలోన్॥

ఇష్టబాంధవస్తుతి.

సీ॥ తంబుఱా మీటుచు సంబరంబున నాడుఁ
దుంబురుండో నారదుండో యనఁగ
భక్తిమైఁ గూర్చుండి భజియించు; రామదా
సుండో కబీరుదాసుండో యనఁగ
రామాయణాదిపురాణాలఁ దెల్పు; సూ
తుండో శుకుండో వ్యాసుండో యనఁగ
సత్యవ్రతముఁ బూను నిత్యదీక్షగ హరి
శ్చంద్రుండో నలరాజచంద్రుఁడో యన

తే॥ గీ॥ నట్లు భక్తగణంబుల నధికఘనత
నొంది వర్తించువాని ధీరోత్తముండు
నైనవాని నాకు జనకుం డైనవాని
నృహరినాముని బూజింతు నెడఁద నెపుడు॥ ౧౫

చం॥ పరమపతివ్రతామణులఁ బ్రస్తుతిఁ బొందినభూమిజాత శం
కరునిఁ దపస్సుచేఁ దనిపి ఖ్యాతి వహించినయద్రిజాత పం



కరుహనివాస మొంది త్రిజగంబుల నేలెడిలోకమాతనన్
బరఁగెడునాదుమాత పదపద్మములం భజియింతు నెంతయున్

సీ॥ పతిశాసనం బిడఁ బ్రీతి సెప్పకయు బత్తి
నొనరించు వెనువెంట ననవరతము
పతికినక్కతోఁ బల్క నతిభీతిఁ దద్రోష
శిఖి నార్చు వాగ్వృష్టిచేత నపుడె
పతికార్యమునకుఁ దోడ్పడి చేత నైనంత
దాఁక సాయము సేయు వీఁకతోడఁ
బతిసేవ కెచ్చుసువ్రతము లేదని యెంచి
పరిచర్యలం జేయుఁ బరమనియతి

తే॥ గీ॥ నిహపరసుఖంబు సద్గుణా లిడు నటంచు
నమ్మ పెంపుసొమ్ము బిడ్డలే సొమ్ము లంచు
నమ్మి వర్తించుచుం గౌరవమ్ము గాంచు
నట్టిమాయమ్మ శేషగిరమ్మఁ దలఁతు॥

తే॥ గీ॥ ఇరుగుపొరుగమ్మలకు నెల్ల నిష్టముండి
గ్రామజను లెల్లర న్మేటిగారవమ్ముఁ
బొందుచున్నట్టిమామాతఁ బుణ్యచరిత
మమ్మ నేలెడి శేషగిరమ్మఁ దలఁతు॥ ౧౬

ఉ॥ బీదలకష్టపాటు గని వెంటనె శక్తికొలంది సాయమున్
మోదముతోడఁ జేయు వెస మూఢులకూటమిఁ బాయు [హేయదు
ర్వాదము లాడనోడు భగవంతుని పాటలఁ బాడు నట్టియా
సాదరవాణిఁ గొల్చెదఁ గృపాంబుధిధారిణి బుద్ధిశాలినిన్॥

సీ॥ నామేనమామ యానందగిరికులాబ్ధి
శశి వేంకటప్పయ్యశర్మ పూర్వ
మంగలూరునఁ గవితాంకురంబును నాటి
సంతానవృద్ధిగా సాఁకినాఁడు
అష్టావధానం బనాయాసముగఁ జేసి
ప్రాజ్ఞసమితి మెప్పఁ బడసినాఁడు
పరఁగఁ బదాఱేటఁ బరదేశముల కేగి
బహుమానముల నంది వచ్చినాఁడు
తే॥ గీ॥ కోరి బుద్ధిప్రదాయినిం గొల్చినాఁడు
బాలికాపాఠశాల యేర్పఱచినాఁడు
అద్భుతముగ రామాయణ మల్లినాఁడు
వాని కొనరింతు ననిశంబు వందనములు॥ ౧౦

సీ॥ చిన్నప్డు మొదలు నాయన్నతో స్నేహించి
కృష్ణార్జునుల మంచు నెంచువాఁడు
నన్నును జెల్మి నాయన్నతో పాలెంచి
కనుఁగవఁ దాల్చితి ననెడువాఁడు
మూర్తులు వేఱైన మూర్తిత్రయం బట్టు
లైక్యభావుల మంచు నలరువాఁడు
మమ్ములం గననిది నమ్మ దుర్దిన మంచు
నుదయమ్మునను లేచి గదియువాఁడు
తే॥ గీ॥ నేనె మీ రంచు జ్ఞానంబు నేర్పువాఁడు
మీరె నే నంచు వెన్నంటి మెలఁగువాఁడు
నిస్తులప్రేమ గలవాఁడు నేస్తకాఁడు
నైన శేషగిరికవి నాయాత్మఁ దలఁతు॥ ౧౧



సీ॥ ధనధాన్యవృద్ధిచే దర్పంబు నొందక
తగ బీదలకు నిడుదానపరుఁడు
మెండుగాఁ బాండిత్య ముండె నం చెగురక
నతివిధేయతఁ జూపునార్యవరుఁడు
కవనధోరణి చాలఁ గల్గె నం చడరక
క్రొత్త ప్రబంధంబు గూర్చుఘనుఁడు,
లౌకికవృత్తిలో రాకలే గోరక
జనులసన్మానంబు గనెడిబుధుఁడు
తే॥ గీ॥ నందగిరిరామచంద్రార్యనందనుండు
వరగుణేంద్రుండు స్నిగ్ధుండు ప్రాణసఖుఁడు
నొకవరుస మాతులేయుఁ డింకొక్కవరుస
భాగినేయుఁ డౌ వానిపై భావ ముంతు॥ ౧౨

సీ॥ ఎవనిమైత్రి గడించి స్తవనీయ మైనట్టి
కవనధోరణి నేను గాంచినాఁడ
నెవనిమైత్రిం జేసి యిద్ధసంస్కృతభాషఁ
గొంతవఱకు నేర్చుకొన్నవాఁడ
నెవనిమైత్రినిబట్టి కవిజనేడితశుభా
ష్టవధానము నేర్చి సల్పినాఁడ
నెవనిమైత్రివలన నెపుడు సద్యశ మిచ్చు
గ్రంథరచన కేను గడఁగినాఁడ
తే॥ గీ॥ నెవనిధనసహాయముచేత నిది వెలువడు
ముద్రితం బయి నా కెంతొ ముద మొసంగ
నట్టిసన్మఖ్యు నుతసఖ్యు నాప్తముఖ్యు
సంచితాభిఖ్యు శేషగిర్యాఖ్యుఁ దలఁతు॥ ౧౩

చం॥ ఒడయుని కార్యకష్టముల • కోర్చి చరింప జయప్రదంబటం
చెడఁదను నిశ్చయించి తన • కేర్పడు నాదిమబోధకస్థితిన్
దడయక చేతియొజ్జల సం•దాదయఁ జూచుచు నంగలూరునన్
బడిఁగడుఁ బెంపొనర్చి నను•వర్తను సగ్రజు సంస్తుతించెదన్॥

సీ॥ తారశూన్యఖ్యాత•జలధిగంభీరుండు
భీరుండు హింసల • ధీరవరుఁడు
జనులఁ బీడింపని•సరసగాధేయుండు
ధ్యేయుండు నిర్మల•ధీయుతుండు
వనవాస మొందని•పాండవేయాగ్రజుం
డగ్రజాతుఁడు నా కు•దగ్రగుణుఁడు
కలిబాధ నొందని•నలభూపచంద్రుండు
చంద్రుండు మత్కుల•సాంద్రయశుఁడు
తే॥ గీ॥ తల్లిదండ్రుల భక్తి సోదరులఁ బేర్మిఁ
బ్రోది సేసెడునట్టి యా•బుధవరేణ్యు
సకలజనపుణ్యు గుణధన్యు • సరసగణ్యు
వేంకటరమణాహ్వయు బుధ•వినుతుఁ గొల్తు॥ ౨౭

చం॥ గరువము దీర్ఘవైరమును • గ్రౌర్య మసత్యముఁ బాప [చింతయున్
బరుఁగని యోర్వలేమియును•బౌరుషహీనత నీచవృత్తియే
స్థిరపరమాత్మవీక్షణుని•చిత్తమునం దిసుమంత లేవో! యా
వరగుణధుర్యుఁ బూర్వజునిఁ • బ్రస్తుతిఁ జేసెద నాత్మలోపలన్॥

సీ॥ వృత్తు లన్నిటఁ గృషి•వృత్తియే మేలంచుఁ
జేయించె నేద్య మే•శిష్టవరుఁడు



గ్రామముగా నందుచే • రాదు లాభం బంచు
మది నెంచి మాన్పె నే•మానధనుఁడు
విద్దె నేర్వనిమూర్ఖుఁ • డెద్దుతో సమ మంచు
బోధించె విద్య నే•బోధకుండు
జీవనోపాయంబుఁ • జేకూర్ప భావించి
యుద్యోగిఁ జేసె నే•యుత్తముండు
గీ॥ సకలవిధముల నన్నట్టు • సాఁకినట్టి
నాసుఖాసుఖంబుల నెల్ల • మోసినట్టి
గురువు బంధుండు సఖుఁడు నాఁ • బరఁగునట్టి
నాదుపూర్వజుఁ గొల్తు న•నారతంబు॥ ౨౮

కృతిప్రస్తావన.

కం॥ చదువరులారా! వినుఁ డొ
క్కదినమున మదీయసఖులఁ • గలసి ప్రమోదా
స్పద మగు విద్యాలయమున
ముదముండఁగ నన్నుఁ గూర్చి • పూర్వజుఁ డనియెన్॥

ఉ॥ "ఏలొకో; పుస్త మొండు రచి•యింపవు పండితపామరాళికిం
జాల ముదంబుగొల్పఁ దగు•శక్తి గలట్టిఁడ వయ్యుఁ జూడ ని
క్కాలమునందు మెప్పుగను•గ్రంథములా నవలల్గదా యికం
జాలము సేయు టేలని లఘు•శైలిని వ్రాయు మొదేనిఁ [దమ్ముఁడా!"॥ ౨౯

తే॥ గీ॥ అన సఖుండు శేషగిరిరా • వచటనుండి
నిండుమనమున దాని సె•కండు చేసె
నంతరంగంబునందు నా • కంతకు మును
గోర్కె నెలకొనెఁ గావునఁ • గూడె నన్ని॥ ౩౦

ఆ॥ వె॥ చేయువాఁడ నంచుఁ • జెప్పితినే గాని
దీనిఁ జేసెద నని • దెలుప నయితి
నట్లుకొంతకాల • మరుగఁగా నరుగఁగా
నొక్కనాఁటిరేయి • పక్క నుండి॥ ౩౦

ఉ॥ "ధీనిధు లెల్ల మెచ్చ మన • దేశసతీమణిసచ్చరిత్రముం
బూనిరచింతునొక్కొ!యది•పూర్వపురాణములట్లుగా కిటన్
మానవులెల్ల నమ్మఁదగు•మైవిరచింపఁగలాఁడ నొక్కొ!య
ద్దాని నొకండు లోకవిది•తంబుగనింతకుఁ జేయ కుండునే?॥

ఆ॥ వె॥ ఎద్దియేని గ్రంథ•దృష్టాంత మాదాని
నిదివఱకె రచింతు • రెవ్వరైనఁ
గాన నాదుమాన•సానూనయత్నంబుఁ
జేసి నూత్నకథ రచించు వాఁడ॥ ౩౩

ఆ॥ వె॥ దానిలోను సాధ్య • మైనంతదనుక వ
ర్ణనముల నలంతిగ నొ•నర్చు వాఁడ
నవియు నాధునికజ•నానుకూలంబుగా
నుండునటులఁ జూచు • చుండువాఁడ"॥ ౩౪

కం॥ అని చింతించుచు మఱియొక్కఁ
డనుకొంటి ని టింతదాఁక • నన్నినవలలుం
గన గద్యకృతములే గా
వున దీనిం బద్యతతులఁ • బూరింతు నలిన్'॥ ౩౫

కం॥ అని ప్లాటు వేసికొని నా
మనమున నీగాథ నెల్ల • మఱునాఁ డుదయం
బున సఖులతోడఁ దెలుపఁగ
విని వా రటు సేయు మంచుఁ • బ్రేరేపింపన్॥ ౩౬



కం॥ వ్రాసితి శక్తికొలందిని
దోసము లిం దెన్నియున్నఁ • దొలఁగుచు నీతిం
దీసికొన వేఁడినాఁడను
వాసిగ సద్గ్రంథపఠన•పరగుణులారా!॥ ౩౭

కం॥ నవలాశబ్దము నావెల్
భవ మదియుం గాక జనుల•వాడుక లోఁ దా
నువిదకు నౌఁ గావున "జ్ఞా
నవతి" యనుచు దీనిఁ బిలువ • న్యాయము గాదే?॥ ౩౮

కవివంశవర్ణనము.

కం॥ తమకులవర్ణనమును గ్రం
థమునన్ లిఖియించి యుంపఁ • దత్పఠనమునన్
గ్రమముగ నెఱుఁగుదు రెల్లరుఁ
బ్రియదంబుగఁ గాన దీన • వ్రాసెద దానిన్॥ ౩౯

కం॥ కొలములఁ దలకట్టై యిల
ఖలకృత్యాచరణవిముఖ•గౌరవనిధులై
పలుకులపడఁతికి నిల్లై
విలసిల్లెడియట్టిభవ్య•విప్రకులమునన్॥ ౪౦

కం॥ లోకులమైత్రిం గోరుచుఁ
బ్రాకటసద్యశము గాంచు•వంశం బెఱియా
లోకంబునఁ నావంశమె
శ్రీకరమధ్వాన్వయంబు • శిష్టాకరమున్॥ ౪౧

సీ॥ అందుఁ బ్రఖ్యాతధ•రాధిపమాన్యులై
పరఁగువా రెవరన? చిల్లరిగెవారె

నిరుపమసద్దాన•నిరతులై యెక్కుడు
వఱలువా రెవరు? చిల్లరిగెవారె
అధికారగర్వులై • యదరిపడక నిల్చి
మెఱయువా రెవరు? చిల్లరిగెవారె
శత్రునైనను నిజ•మిత్రునిగాఁ జూచి
కొఱలువా రెవరు? చిల్లరిగె వారె

గీ॥ ఒరుల సడి పడ రెవరు? చిల్లరిగెవారె
శ్లాఘ్యవర్తను లెవరు? చిల్లరిగెవారె
నరనశాస్త్రజ్ఞ లెవరు? చిల్లరిగెవారె
స్థిరయశోధను లెవరు? చిల్లరిగెవారె॥ ౪౨

సీ॥ వారిపూరాధార•భూరితటాకంబు
భక్తసద్బృందంబు • భాగ్యదంబు
హరిహరస్థానంబు • వరగుణస్తోమంబు
శృంగారవీధీసు•సేవితంబు
ధనవదావాసంబు • ఘనవిప్రనికరంబు
పరజనభీమంబు • పురనుతంబు
బహువిధారామంబు • ప్రఖ్యాతకూపంబు
సౌధహర్మ్యవితాన•సంస్తుతంబు

తే॥గీ॥ పూర్వసామంతరాజాది•పూజితంబు
ధీకృతాతిసుదారస•తీయుతంబు
నొచు నొప్పారు "బొండాడ" • యనెడిగ్రామ
మారయంగ వారినివాస • మౌను జుండి॥ ౪౩

ఆ॥ వె॥ వింత నందఱ కట • చింత లుండును గాని
చింత లుండఁ బోవు • చెంత జేరి



ముందు వెనుక గాక • నెం దెందుఁ గాంచిన
వింతవారి కెల్ల • వింత గొలుపు॥ ౪౪

ఆ॥ వె॥ వారిలో మదన్వ•వాయుఁడు కోదండ
రామనాముఁడు మును • రాజమండ్రి
"సబ్ శిరస్త" యనెడి•సత్పదంబును గాంచి
మంతు కెక్కె న్యాయ•మార్గుఁ డంచు॥ ౪౫

కం॥ వానికి నేడ్వురుకొమరులు
మానితగుణు లొచుఁ బుట్టె • మరి సుక మీాయం
గానైరి యందుఁ గడపటి
సూనుఁడు వేంకటరమణుఁడు • శుభ్రాంశుగతిన్॥ ౪౬

చం॥ దినదినవర్ధమానుఁ డయి • ధీరత గాంచని కాళిదాసుగాఁ
దనరి, తదగ్రజానుమతిఁ • దద్దయుశ్రద్ధగఁ గర్షకాళిజీ
వనుఁ డయి, కొన్నినా ళ్లరుగ • స్వాంతమునం దిటు
చింతఁ జేసె "నా
జనకుఁడు నన్న లెల్లరు య•శంబు గడించిరిసత్పదాప్తులై ॥౪౭

ఉ॥ కావున నేనుఁ గూడగమ•కంబునఁబొందెద నాధికృత్యమున్
దేవునినమ్మిపోదుఁ బర•దేశభయంబును జెంద కే నవాబ్
తావున కం"చు నెంచి తన•వారికి నేరికిఁ జెప్ప కేగె;భీ
తావహావన్యమార్గమున • నానిసియందునగోలుకొండకున్॥

తే॥ గీ॥ చేరి పారసీభారతి•చేతగాని
నందు గురు వైనవానిని • నాశ్రయించి
నేర్పుతోఁ గొన్నియబ్దముల్ • నేర్చి యచ్చ
టందఱ న్మించి పండితుం • డాయె నంత॥ ౪౮

తే॥ గీ॥ మొదటనుండియు వానిపై • భూరికరుణ

నన్నవస్త్రాదు లిచ్చునా • యయ్యవారు
దీసికొని పోయి వానిని • దేవరకడ
కెల్లవృత్తాంతముం జెప్ప • నెంతొ మెచ్చి॥ ౫౦

గీ॥ “కొండవీటి దుర్గంబున • కు వెసఁ బొమ్ము!
పవుజుదారి యనెడిఘన • పదము గొమ్ము!”
యని యను జ్ఞ నవా బీయ • నతఁడు సమ్మ
దమ్ముతో నేగె నాడకు • ధన్యుఁడ నని॥ ౫౧

సీ॥ ఏగి పౌజుల కెల్ల • నెకిమీఁడు గా నుండి
యేలె ఖ్యాతిగఁ బదు • నెన్మిదేండ్లు
శోణితవా డాదులఁ • గొలమువారి కొసంగె
నన్ననత్రింబు లెం • న్నెన్నొ గూర్చె
వేఁడికొనినబీద • విప్రుల కగ్రహా
రమ్ము లిమ్ములు ననే • కమ్ము లొసఁగె
స్త్రీమణి యైనల • క్ష్మీబాయిఁ బెండ్లాడి
యత్యంతభోగంబు • లనుభవించెఁ

గీ॥ “దనకుమాలినధర్మంబు • ధరణిఁ గలదె?”
యంచువచియించు నిజసతి • కతఁ డనె నట
“భూములును ద్రవ్య మున్నచో • సోమరు లయి
చదువు కొనరు మదన్వయ • జను” లంచు॥ ౫౨

కం॥ ఆతని కగ్రజుఁడును వి
ఖ్యాతగుణుండు నగుశీన • యాఖ్యుండు గుణ
శ్రీతిమ్మాబాయిని సం
ప్రీతిగఁ జేపట్టె వడసె • వెంకటాద్రిన్॥ ౫౩

కం॥ ఆకులపావనుఁడు బహు



శ్రీకర్మగుకాకినాడఁ • జేరి గడించెన్
వీఁకన్ బెద్దశిరస్తాన్
బ్రాకట సత్కీర్తి గాంచె • వైభవయుతుఁ డై॥ ౫౪

కం॥ వానికి నచ్చన శీనయ
నా నిరుపురుసూనులు జన • నం బయి రందున్
మానధనుం డగునచ్చన
పూనిక నమలాపురంబు • పోయి సుబుద్ధిన్॥ ౫౫

కం॥ పొరసెం దహాశీల్దారిని
బరమపతివ్రతను శేషు • బాయమ్మ సతిన్
వరుసఁగ వెంకటాద్రిను
నరసింగం బనెడిధీర • నందనుల నటన్॥ ౫౬

సీ॥ అందు వెంకటాద్రి • వందనీయగుణుండు
పీఠికాపురి కేగి • ప్రీతితోడ
సాయేరు వనిగాంచి • సల్పవిధ్యుక్తంబు
గా సర్వలోకంబు • గారవింపఁ
బిదప బొండాడకుఁ • బిత్రార్జితమునకు
వచ్చి చేరెను వెంకు • బాయియనెడి
యర్ధాంగితో నల్వు • రౌకుమారకులతో
నొక్క కొమార్తెతో • నొప్పు మీఱ

గీ॥ సర్వసంపత్తుతో నిర్వి • చారమతిని
బంధుహితవర్గసహితుఁ డై • భాగవతపు
రాణగోష్ఠి కథ్యక్షుఁ డై • ప్రమదముగను
గాలముం బుచ్చె భక్తాగ్ర • గణ్యుఁ డనఁగ॥ ౫౭

కం॥ ఆతండె మత్పితామహుఁ

డాతనికిఁ బ్రథమకుమారుఁ • డౌ యోగానం
దాతతకీర్త్యభిధానుఁ డు
ఖ్యాతి సముద్ధారి చేసె • నఁట కోసూరన్॥ ౫౮

తే॥ గీ॥ పిదప మనరసారావు• పేటలోన
తాలుకా హెడ్డుమాస్తాగఁ • దనరియుండి
తల్లిదండ్రుల బంధుసో•దరుల నెల్లఁ
బ్రేమఁ జూచుచుఁ జలమమ్మఁ • బెండ్లి యాడి॥ ౫౯

కం॥ వేంకట్రావను పుత్రశ
శాంకుని నాబుధుఁడు క్షీర•సాగరుఁడు గనెన్
పంకరుహాక్షుని దయచే
సంకోచముఁ బాపుసుతులు • జననము గారే!॥ ౬౦

కం॥ ఆ వెంకట్రావును న
త్తావునఁ దనతండ్రిపనికిఁ • దగ నర్హుం డై
ప్రావీణ్యోపేతుం డై
యావల నుత్కృష్టపదము • నంది గతించెన్॥ ౬౧

కం॥ మా రెండవ పెదతండ్రి సు
ధీరుఁడు కోనయ్యనామ•ధేయుఁడు గుణవ
న్నారిని లక్ష్మిబాయిని
బేరిమి నుద్వాహ మాడి • వినుకొండపురిన్॥ ౬౨

తే॥ గీ॥ చేరి తాలుకా హెడ్క్లర్కు•గా రహించి
వృద్ధుఁ డౌదాఁకఁ జేసి ప్ర•సిద్ధి గాంచి
సంతతియు బాగుగానుంట • సంతసించి
సకలసుఖము లనుభవించి • చనియెఁ దివికి॥ ౬౩



కం॥ మామూఁడవ పెదజనకుఁడు
ధీమంతుం డచ్చునాఖ్య• తేజోనిధి యు
ద్దాముఁడు డిప్టీసర్వేర్
గా మనబళ్లారిసీమ • ఘనతం జొచ్చెన్॥ ౬౪

కం॥ చని వేలకొలఁది ధనమును
ఘనముగ నార్జించి యింటి•కడ కంపుచుఁ ద
జ్జననీజనకాదులు వగ
మునుఁగ స్మరణంబు నొందె • భూరిజ్వరుఁడై॥ ౬౫

కం॥ అస్మజ్జనకుఁడు పరమా
త్మస్మరణుఁడు నృహరినామ•ధరుఁడు సదయుఁడున్
భస్మీకృతషడ్వర్గుఁడు
విస్మృతపరదుష్టకార్య•వృత్తాంతుండున్॥ ౬౬

కం॥ నే యోగానందాఖ్యుఁడ
నాయన్నయ వెంకటరమ•ణాహ్వయుఁ డగు నా
రాయణరామారావులు
నాయనుజులు గానఁ దెల్పి•నాఁడ నలువురన్॥ ౬౭

తే॥ గీ॥ అట్టినేను పూర్వకృతభా•గ్యంబువలన
శ్రితజనావనభారతీ• సేవవలన
మధురకవితామతల్లికా•మైత్రి గాంచి
ప్రకటవిభవసంతుష్టాంత•రంగుడ నయి॥ ౬౮

షష్ఠ్యంతములు.

కం॥ శ్రీయుతునకు సత్ఫలసం
ధాయకునకు యోగిగణహృ•దబ్జస్థునకున్
మాయావిదూరగుణున క

జేయపరాక్రమునకు దివి • జేశనుతునకున్ ॥ ౧౯

కం॥ సారవిచారమతికిఁ గం
సారికి మాషితనప్రౌఢ్య • తాహారికి దు
ర్వారసుదీప్తకృపాణికి
దారితదైతేయనికర • దర్పోష్ణతికిన్ ॥ ౨౦

కం॥ ఆతతనిర్మలకీర్తికి
భూతదయామతికి మేరు • భూధరధృతికిన్
వాతాశనారిసప్తికి
మాతాపితార్తిమూల • మారణకృతికిన్ ॥ ౨౧

కం॥ వ్యాత్యామాయనశకటాసుర
నామోన్మథునకుఁ బూత • నానాశునకున్
కామజయభర్గహితునకు
ధీమహితున కమితశాంత • తేజోనిధికిన్ ॥ ౨౨

కం॥ దుర్జయరిపుసందోహజ
యార్జునసారథికి యాద • వాన్వయమణికిన్
నిర్జితరథశ్రేణికి
వర్జితభయభక్తతతికిఁ • బరకరిసృణికిన్ ॥ ౨౩

కం॥ శ్రీమంతునకుం గోపీ
భామాషోడశసహస్ర • పరిపాలునకున్
దామరసాక్షునకున్ శ్రీ
ప్రామరునుతవేణుగోప • బాలాఖ్యునకున్ ॥ ౨౪

తే॥ గీ॥ అంకితంబును గావించి • యధికభక్తిఁ
జెప్పుచున్నాఁడ సొంపును • జెవుల కింపు
విన్నఁగ నొసంగుజ్ఞానవ • తీచరిత్ర



హృద్యమగుతత్కథాక్రమం • బెట్టి దనిన ॥ ౨౫

కాంచనపురవర్ణనము.

కం॥ మును హిందూదేశంబున
ఘనసాత్పురవింధ్యనగయు • గళమధ్యమునన్
దనరుచు భూజనమెల్లను
వినుతింపఁగఁ దగినయట్టి • విద్ధి భాసిలుచున్ ॥ ౨౬

మ॥ పరసేనాతతిదుర్గమంబు విమలాం • భస్స్ఫూర్తికాసారతా
మరసామోదహితానిలంబుసుఖద • క్ష్మాభృత్ప్రభుత్వంబుగో
పురదేవాలయశోభితంబు పరిఖాం • భోరాశివృత్తంబునై
పరఁగున్ గాంచనపత్తనంబు సకలై • శ్వర్యాలవాలంబునై ॥

శా॥ శ్రీరంజిల్లెడిదివ్యవజ్రమణులన్ • శ్వేతప్రభల్ గ్రక్కుచున్
దారామండలినంటుపంతమున న • త్యంతోన్నతిం జెంది త
త్ప్రారంభంబులుసల్పుచున్న పెయనన్ • భాసిల్లుసౌధాళిచే
సూరాస్తోదయకాలభేదముల న • చ్చోటం గనంగష్ట మా ॥

కం॥ వనశృంగారలతాంతము
లనిశముఁ బుష్పించు చుండు • నాహేతువునన్
గని భ్రాంతిని మధుమాసం
బని దలఁచెద రెల్లప్రొద్దు • లామార్గస్థుల్ ॥ ౨౯

కం॥ ప్రమదావనబంభరగీ
తములున్ బోషితశుకవివి • ధశకుంతనినా
దము లంత • పురనంగీ
తముల నసంధించి హర్ష • దాయకము లగున్ ॥ ౩౦

తే॥ గీ॥ విశ్రుతకళాప్రపూర్ణులై • విధిని దూఱి
శాంతశమదమాదుల రమా • కాంతుఁ గేరి

దేవతారాధనల్ నిత్యదీక్షతోడ
మూఁడువేళల నొనరింతురు ప్రోడలు లట॥ ౮౧

కం॥ బిచ్చపువృత్తియె మే లని
యచ్చటిభూదేవు లెంచ రాచార మటం
చెచ్చట నైనను దమ క
వ్వచ్చులు లభియించు నన్నఁ బాఱరు ప్రీతిన్॥ ౮౨

సీ॥ వేదవేదాంగవివిధశాస్త్రవేత్త లై
బ్రహ్మతేజము సూపు బ్రాహ్మణులును
సకలాస్త్రవిద్యావిశారదప్రథితు లై
బాహుదర్పము సూపు పార్థివులును
పశుపాలనాకృషివ్యాపారచతురు లై
వస్తుప్రతతి గూర్చు వైశ్యవరులు
స్వామికార్యార్థు లై స్వప్రాణముల నైన
వర్జింపఁ గలయట్టి పాదజులును

తే॥ గీ॥ భర్తృపూజాధికప్రభావతులు సతులు
సతుల సంప్రీతి నేలెడి సరసపతులు
పితృవచనములఁ బాలించు ప్రియసుతులును
నాకనకపురి నుండ్రు ప్రఖ్యాతి వడసి॥ ౮౩

ఆ॥ వె॥ నిజధనంబు నైన నిరసించుఁ గాని ద
న్నిజధనంబు విడదు నిజముగాను
పరధనంబు నాసఁ బడయ నెంచదు గాని
పరధనము గొను నల పౌరగణము॥ ౮౪

సంశయాళుం డనువిప్రబాలకుండు హేమపురిం జొచ్చుట.

చం॥ ఒకదిన మాపురంబునకు నొక్కఁడు ధరామరుఁ డేగుదెంచి నే



నిఁక నడువంగఁ జాలఁ క్షుధ హెచ్చెడుఁ దీవ్రమరీచిపంక్తులన్
నకనకలాడఁ జేసెఁ గరి నాత్మఁడు భానుఁడు పాంథసంతతిన్
జకచకకోలలేసి మృగజాతిని నొంచెడి వేఁటకాఁడునా॥

శా॥ ఈపట్నంబును గన్నులారఁ గననా కెంతేముదం బయ్యెడున్
బాపంబు ల్పొనరించువారలకు నీపట్నంబు చేకూరునే!
యేపుణ్యాత్ముఁడు భోజనంబు నిడి నన్నీవేళ రక్షించునో
యేపుణ్యాత్మునిఁ బృచ్ఛ సేసిన మదీయేచ్ఛన్ దగం
గూర్చునో!"॥ ౮౬

మ॥ అని చిత్తంబున నెంచుకొంచు జనికల్హారాంబుజవ్రాతకో
కనదాలంకృతపూర్ణనీరము నసంఖ్యస్నాతబాడవ్యమున్
వనజేందిందిరనృత్యగీతమును సర్వప్రాణిపానీయజీ
వనతామరసాకరంబు గనియెన్ బట్నంబునం దొక్కెడన్॥

సీ॥ ఆతటాకపురేవు నందు గుంపులు గూడి
యౌర! యెంతటియాఁడు దనెడువారి
దాని సాహసచర్య తరుణుల కేరికిఁ
బడయ శక్యమె! యంచుఁ బల్కువారి
నాపె సెందినకష్ట మామె సెందినఫల
మత్యద్భుతం బంచు నలరువారిఁ
దనదు పాతివ్రత్య ఘనమహత్త్వముచేత
మెప్పించెఁ బతి నంచుఁ జెప్పువారి

తే॥ గీ॥ మామతండ్రులయుద్ధంబు మాన్పి వైచె
మగని మఱపించి యుక్తిఁ గుమారుఁ గాంచెఁ
బతుల వంచించె ధీరత వనములం ద
టంచు వచియించువారలఁ గాంచె నతఁడు॥ ౮౮

తే॥ గీ॥ అట్టివిపరీతవృత్తాంత • మడుగఁ దలఁచి
విస్మృతిం జెంది గొప్పతుఁ•ద్పడచేతఁ
బరవిదుం డనువృద్ధభూ•సురునిఁ జేరి
భోజనం బని వేఁడ నా•భూమిసురుఁడు॥ ౮౯

ఆ॥ వె॥ „అతిథిపూజకన్న • నధికధర్మం బేది!
ధరణి నరుల కంచుఁ • దలఁచి వేగ
వాని గౌరవించి • పంచభక్ష్యాన్నంబు
లారగింపఁ జేసె • నధికభక్తి॥ ౯౦

కం॥ సాపడి తృప్తిగ విప్రుఁడు
తాపం బెడఁబాపికొంచు • జ్ఞానపరునకున్
గాపాడినపరవిదునకు
„నాపాలిటిదేవుఁడ" వని • నతు లొనరించెన్॥ ౯౧

అన్నదానసంభాషణము.

చం॥ మరియును దత్కులీనగుణ•మాన్యునమంచితశాంత
భావమున్
సిరి సుతవర్గసంపదల•చెల్వు బిడౌజగృహోపమాన మం
దిరవిభవంబు గాంచిమదిఁ•దృప్తినిబొంది „విహాపితంబులం
దఱచుగ నన్నదానమెను•దానమటందుర దేమిహేతువో!॥

కం॥ అన్నము వెట్టుట యే గడుఁ
బున్నెం బని యెంతు రేని • భూజను లెల్లం
దిన్నఁగ నాకమునకె ప్రా
మన్నా రని చెప్ప రాదె! • యుర్వీదేవా!॥ ౯౩

ఉ॥ ఏమన? ధాత్రిలోఁ బ్రజ• లెల్లరుమిత్రులబంధు వారమున్
బ్రేమగ భృత్యవర్గము న•భీష్టముతో నధికారిముఖ్యులన్



వేమరు విందులం దనిపి • ప్రీతమనస్కులఁ జేయుచుండరే!
ధీమహిమాఢ్య! సంశయము • దీర్పు మనంగ బుధేంద్రుఁ
డిట్లనెన్॥ ౯౪

తే॥ గీ॥ „అన్నదానఫలమ్మున • న్నడుగ నేల!
తెలియ లేదె! నీ కీనాఁడు • తెల్లముగను
క్షుత్పిపాసాతురుండవై • క్షోభపడుచు
నన్నదన్నదానమున ము•దాప్తిఁ గనవె!॥ ౯౫

ఆ॥ వె॥ అయిన నీదుసంది•యంబును వారింతుఁ
దెలిసినంతవఱకుఁ • దేటపఱిచి
నీకు నాకుఁ గాక • లోకసమ్మత మేదొ
యదియె ధర్మమార్గ • మరయ ధరణి॥ ౯౬

తే॥ గీ॥ దాన మన విం దనఁగ రెంటి•తారతమ్య
మెఱుఁగఁ జెప్పెద విన్ము నీ• కెఱుకలేమి
దాన మన నిహమందునఁ • దత్ఫలంబు
గోరరింతేయు దాత లు•దారమతులు॥ ౯౭

కం॥ హిత మతిపెం పయి తమ కుప
కృతి సల్పెద రంచు జనులు • దృఢనిశ్చయులై
హితులకు బంధుగులకు నధి
పతులకు నొనరించువిందు • పరమార్థమొకో!॥ ౯౮

ఆ॥ వె॥ లాభ మడ్గువిందు • లంచంబె యగుఁ గాని
దాన మౌనె! దాన • దాత యౌనె!
దాన మన నకామ•దానంబె దానంబు
తక్కుదానసమితి • తెక్కయేల!॥ ౯౯

శా॥ భూదానంబును రూప్యదానములసంద్భూరిప్రదానంబు గ
న్యాదానంబును జేయువారలకు నాయాసత్ఫలప్రాప్తి నే
లేదంచు న్నిరసింపఁగాని వెనత్తుత్ల్లోకంబు వారించి ప్రా
ణాధారంబగునన్నదానఫలమాహాత్మ్యంబుతోఁ బోలునే!॥

ఉ॥ ఊరులునూళ్లొసంగినమహోజ్జ్వలభూషలు వేలొసంగినన్
క్షీరము లిచ్చుగోవులు సుచేలము లాదిగ లక్ష లిచ్చినన్
దీఱనియాశ యర్థులకుఁ దీఱుఁగదా; కడుపార భోజనం
బారసి పెట్టఁ గావున మహాఫలదాయకమన్నదానమా॥"

ఉ॥ ఆనుడు నాలకించియతఁ డత్తఱిఁ భూసురులర్థులన్నము
ర్దానముపుచ్చికొంటకనితద్దయుఁ బల్కెడు వేదశాస్త్రముల్
దానియథార్థభావ మఖిలప్రజలన్నము పెట్టుపద్ధతిన్
మానుగఁ దెల్పవే!" యనుచు మన్నన వేడఁగ వృద్ధుఁ
డిట్లనెన్॥ ౧౦౨

చం॥ "జననమునందె గాక శ్రుతిశాస్త్రవిచారవివేకమందు మేల్
గొనములయందునోర్పునను ఘోరతపశ్చరణంబునందు భూ
జనముల నగ్రగణ్యులయి శాపవరప్రదదక్షులౌచు ని
ర్ధనులుగ నుంట మున్ను వసుధాసురులే నుతికెక్కి రవ్విధిన్

ఉ॥ ఈకలికాలమం దరయ నింగువ గట్టినగుడ్డచాడ్పునన్;
లోకయనిల్చెనల్పముగఁ బూర్వపుభూసురకీర్తివాసనల్
లోకమునందు; స్వీయధనలోభులు వైదికధర్మబాహ్యులా
శాకలితాత్ములన్యధనసంగ్రహులైనపురోహితాళికిన్॥ ౧౦౪

కం॥ ఉత్కోచంబులు బ్రాహ్మణ
సత్కారము లంచు మరలఁ జదువఁగ వలెనా!



తత్కులజులు పౌరులయా
వత్కార్యములం బురోధపదముంగనరే!॥ ౧౦౫

ఉ॥ కావున నన్నిధర్మములకన్నను మేలగు నన్నదానమున్
భావమునందు నిల్పుకొని ప్రత్యుపకారము సేయ లేనిభం
గావయవార్తసంతతికిఁ గల్గినమాత్ర మొసంగువార లీ
భూవలయంబునందుఁ గడుఁ బుణ్యులు వారె యథార్థ
దాతలున్॥ ౧౦౬

కం॥ అతిథిజనంబుల కభ్యా
గతులకు నన్నంబు పెట్టుకరుణామతులన్
వితరణగుణగణమణు లని
సతతంబును బొగడు చుండు జగములు మూఁడున్"॥

సంశయాళునివృత్తాంతము.

ఉ॥ అంతట సంతసించి యశనాయితుఁడై మఱిపొందినట్టివృ
త్తాంతము సంస్మరించివసుధాసురబాలకుఁడామహాత్మునిన్
స్వాంతమునందు మెచ్చుకొని వందనముల్పచరించియాకథన్
సాంతముగా వచించుటకు సాంత్వవచోరచనాళి వేడఁగాన్॥

కం॥ ఆమాటల కావృద్ధుం
డామోదము నొంది పిదప నది వచియింతున్
నీమునికి పేరు వివరము
ధీమంతుఁడ! దెల్పు మ"న నతిథిసంప్రీతిన్॥ ౧౦౯

తే॥ గీ॥ "అదు గడుగునకు సందేహ మందు చుండు
నాకతముచేత ననుసంశయాళుఁ డండ్రు
'పామరాకర' మనునట్టిగ్రామమందు
వాస మొనరించు చున్నాఁడ వందనీయ!॥ ౧౧౦

తే॥ గీ॥ తండ్రి లేఁడయ్యె! నాకు సోదరులు లేరు
తల్లిమాత్రమె యుండె నా ♦ ధర్మచరిత
చదువుసంధ్యల నొల్లని ♦ సంశయాత్మ
సుతుని నన్నంపె దేశాలు ♦ చూచి రాఁగ॥ ౧౧౨

ఆ॥ వె॥ సంతతంబు మదిని ♦ సంశయసముదాయ
ఖరదవాగ్ని హెచ్చి ♦ గాల్పఁ దొడఁగెఁ
గరుణతోడ నన్నుఁ ♦ గాపాడు వాగమృ
తంబు ప్రోసి నీర ♦ దంబు పగిది"॥ ౧౧౩

కాంచనపురీనాథునివర్ణనము.

కం॥ అన విని తత్సంశయలత
దునుమఁగ నాతనికిఁ బరవిదుం డిటు లనియెన్
"విను మోయిసంశయాళుఁడ!
ఘన మగుతచ్చరితవిధము ♦ గడుఁ బుణ్యంబౌ॥ ౧౧౪

సీ॥ తనరాజ్యజనులను ♦ దగుధర్మముల నిల్పి
పుత్రవత్సలతచేఁ ♦ బ్రోదిసేయుఁ
దను వేఁడుదీనుల ♦ తారతమ్యం బెంచి
ధనసంపదల నిచ్చి ♦ దనియఁజేయుఁ
దను శరణని కోరు ♦ దండనార్హుని నైన
శిక్షించుటలు మాని ♦ రక్ష సేయుఁ
దనశాసనము మించి ♦ దంభవృత్తులఁ జేరు
దుష్టభావంబులఁ ♦ దొలఁగఁజేయు
తే॥ గీ॥ బాలబాలికోచితపాఠ ♦ శాల లుంచు
వైద్యశాలలు నిర్మించి ♦ వసతు లుంచు



దిక్కఱినవారిపై దయా ♦ దృష్టు లుంచు
ధర్మమార్గావలంబి యై ♦ ధరణి మించు॥ ౧౧౫

ఆ॥ వె॥ అతఁడె మాపురీశుఁ ♦ డభిధాన మే మన్న
ధర్మపాలుఁ డనఁగఁ ♦ దనరు చుండుఁ
దగినపేర టంచు ♦ దైవజ్ఞు లిడినారొ!
వర్తనంబుచేత ♦ వచ్చినదియొ!॥ ౧౧౬

మ॥ బలశౌర్యంబుల సద్గుణావళుల ధీ ♦ ప్రావీణ్యసింహంబు నాన్
విలువిద్యన్ గలిసవ్యసాచి యనఁగా ♦ నీమంతునా సీవిచేన్
గలిమిం బుణ్యజనేశ్వరుం డనఁగ స ♦ త్కారుణ్యవిష్ణుండు నాన్
వెలసెన్ ధాత్రిని ధర్మపాలుఁడు శుభా ♦ భిఖ్యుండు మమ్మేలఁగన్॥

ఆ॥ వె॥ వాని వరదుహితనె ♦ వనజాకరస్నాన
జనులు గూడి పొగడ ♦ సాగి రట్టు"
లనఁగ నధ్వనీనుఁ ♦ "డా జన్మవృత్తాంత
మామెఁ గూర్చి చెప్పుఁ" ♦ డన బుధుండు॥ ౧౧౭

తే॥ గీ॥ "తనకుఁ దెలిసినవార్త నే ♦ మనుజుఁ డైన
వినఁ గుతూహలచిత్తుఁ డై ♦ వేఁడికొన్న
నిజము సెప్పనివరుఁ డొందు ♦ నిరయ మంత్య
కాలమునఁ గాలుప్రోలునఁ ♦ గాన వినుము!॥ ౧౧౮

ధర్మపాలునిచింత.

సీ॥ ధరనరు లెల్ల బాం ♦ ధవులఁ జూచెడివేళ
నెద్దాని ముందు ప్ర ♦ శ్నించు చుందురు!
ఎడ నున్నహితులు సం ♦ ధించునాసమయాన
నెద్దాని ముందు ప్ర ♦ శ్నించు చుందురు!
ప్రీతితోఁ బెఱవారి ♦ వివరంబు నెఱుఁగంగ

నెద్దానిముందు ప్రశ్నించు చుందు!
దిక్కు లేనిముసళ్లు • పొక్కుచు నున్నచో
నెద్దాని ముందు ప్రశ్నించు చుందు!

తే॥ గీ॥ దేనిఁ గని సంతసము గందు • దీనులైన!
దేనిచే స్వకులమ్ము వర్ధిల్లు చుండు!
నట్టిసంతానసంపద • నంద కునికి
మునిఁగె దుఃఖాబ్ధిలో మావిభుండు మున్ను॥ ౧౧౯

కం॥ అల్లరి చేసిన నేడ్చిన
నుల్లంబున విసువు నింత • నొందక యె తితి
క్షోల్లాసపూర్ణులై జను
లెల్లరుఁ బోషింతు సంతు • నెఱుఁగవె విప్రా!॥ ౧౨౦

కం॥ ఆయన కెనమండ్రగు రా
జాయలలో వినుతశీల • చాలఁగ నొప్పున్
జాయాగ్రగణ్యయై సం
తాయమలకు లేమి దుఃఖ • మగ్గల మయ్యెన్॥ ౧౨౧

ఉ॥ మాపతి జేఁడు లేమి సువ,మన్ వెలుఁగొందని రాత్రులట్టులన్
దీపము లేమి గేహములు • దీప్తిని గాంచని యట్టు లన్వయో
ద్దీపక సంతతిం గనమిఁ • దేజము నొందక యుండె నప్డు మా
భూపుఁడెగాక తత్కులము • బోషిత సైన్యము రాజ్యలక్ష్మి
యున్॥

ఆ॥ వె॥ కాయ లున్నమావి • గారవంబునఁ గాంత్రు
కాన్పు లున్నసతిని • గౌరవింతు
రెల్లవా రటంచు • నిద్దర లోకోక్తి
వినవె విప్రబాల! • విబుధలోల!॥ ౧౨౩



వినుతశీలాసంతాపము.

ఆ॥ వె॥ అల్లి రాష్ట్రజనము • లారాచపడుచులు
'గొడ్డురాం' డ్రని యను • కొనుచు దూఱు
చుండి రంచుఁ దెలియ • నొకనాఁడు నుతశీల
చింత తోడ నిట్లు • స్వాంతమందు॥ ౧౨౪

ఉ॥ 'లోకము లేనివాండ్ర'నుచు • దూషణ చేసెడి దుష్టలోకముల్
వీఁకను భర్తతో నుడివి • పీఁచ మడంపఁగఁ జేసినప్పుడే
నాకసిదీఱునంచ నుట • న్యాయమె చిత్తమ! రోషమందుచున్
లోకుల నోరు మూయ ధర • లోఁ దరమా నొకొ! తేని కేనియున్॥

కం॥ పొరపాటుచేత నైనం
బరికింపక నైనఁ బరుల • పాపలఁ గొట్టన్
నరులెల్లరు 'గొడ్రా ల'ని
తెలివను దూషింత్రు గాదె • ధీమణి నైనన్॥ ౧౨౬

ఉ॥ పుత్రుఁడు పుట్ట స్వాన్వయవి • భూతికరుండని సంస్తుతించుటల్
పుత్రిక పుట్ట నన్యకుల • మున్వెలయించు నటంచు భూజనుల్
స్తోత్రము సేయుచుండుటలు • సూనృతమే గద; మర్త్యకోటికా
పుత్రులో లేక పుత్రికలొ • పుట్టనిదే నుతిఁ జెందశక్యమే!॥

ఆ॥ వె॥ బిడ్డ లందున మగ • బిడ్డయే ముఖ్యంబు
కులము వానిచేత • వెలయుఁ గాన
గ్రుడ్డులోని మెల్ల • బిడ్డ లుండనివారి
కాఁడుపిల్ల గల్గు • టారయంగ॥ ౧౨౮

తే॥ గీ॥ చెప్పుకొనినంత మాత్రానఁ • దప్పగునొకో!
రాజుభార్యలకీడు మే • ల్లీజగంబు

మంచి విన సజ్జనులు విచారించు చుండ్రు
కుటిలు లన్నఁ గాకులభంగిఁ • గూయుచుండ్రు ౧౨౯

తే॥ గీ॥ ఇందుఁ గలదె పౌరులదోష • మించుకైనఁ
బాపకర్మఁ డౌవిధి నన • వలయుఁ గాని
ఒక్కకంట సున్నంబు వే • యొక్కకంట
బెల్ల మనురీతి వ్రాయఁడే! • భేదలిపిని॥ ౧౩౦

తే॥ గీ॥ పెంపలేక వగచునిరు • పేదజనుల
కధికసంతానసంప్రాప్తి • నందఁ జేసి
విత్తవంతులు మరిమరి • వేఁడుకొన్నఁ
గడకుఁ ద్రోయఁడె! హతవిధి • కఠినమతిని॥ ౧౩౧

తే॥ గీ॥ కనుల కగపడుద్యుమణికిఁ • గరువలికిని
గన్నవారికి నగ్గికిఁ • గాశ్యపికిని
బక్షపాతంబు లాడాఁడఁ • బ్రబలియుండఁ
గంటి కగపడనివిధికిఁ • గలుగు టరుదె!॥ ౧౩౨

తే॥ గీ॥ ధాత నిర్దయుఁ డైన శ్రీ • మాత యైనఁ
గాతు నని నాదుబత్తికిఁ • బ్రీతి సెంది
వ్రాతఁ దప్పించి కరుణించి • వాంఛ దీర్చి
చేత మలరింప రాదొకో • చేత నైన!॥ ౧౩౩

చం॥ కొలిచినదీనమానవుల • కోర్కెలొసంగెడునాదిమాంబ నాఁ
దలఁచినయార్తులం గదిసి • తత్క్షణ మేలెడివిష్టపాంబ నాఁ
బిలిచినఁ బ్రేమతోడఁ దన • బిడ్డలుగాఁ గనుమంగళాంబ నాఁ
వెలసినకాళికాంబ నిట • వేఁడితినా మొయిఁ బ్రోవ దేలొకో!॥



తే॥ గీ॥ తులసికోటప్రదక్షిణం • బుల నొనర్చు
సతుల కీడేలు నేయభీ • ష్టంబు లయిన
నంచుఁ బెద్దలయాచార • మనుసరించి
చేసితిని గాదె నాయాస • చేకురంగ!॥ ౧౩౪

ఆ॥ వె॥ అఖిలసువ్రతాలు • నిఖిలోపవాసంబు
లాచరించితిని సు • తాభిలాషఁ
బాప మేమొ గాని • పడయంగ లేనైతి
నొట్టు పెట్టినట్టు • లొక్కపట్టి॥ ౧౩౫

తే॥ గీ॥ ముష్టి కేతెంచువారి నా • యిష్ట మడిగి
సంతులభియించు వెస నన్న • నంతసించి
విలువ గలిగినధనధాన్య ములు నొసంగి
మోసపోయితి నే నెంత • మూఢమతినొ!॥ ౧౩౬

సీ॥ కనులపండువ సేయు • కన్నబిడ్డలరూపు
గాంచునో! నాకండ్లు • గాంచ వొక్కొ!
చెవులకు విం దైన • శిశుభాషణంబుల
నందునో! నావీను • లంద వొక్కొ!
రసనామృతం బగు • పసికూనముద్దుల
నందునో! నాజిహ్వ • యంద దొక్కొ!
నెఱసంతసము గూర్చు • నిసువుమై లేఁదీఁగ
నానునో! నాదుమే • నాన దొక్కొ!

తే॥ గీ॥ పరమసంతోషదాయకా • పత్యవిభవ
మందఁ గల నొక్కొ! నిజభవ • సార్థకముగ
సద్యశస్విని యాదునే • జగతి! నంత
పాటిదాని నౌదు నొకొ! యేనాఁటి కైన!॥ ౧౩౭

ఆ॥ వె॥ డెందమ! యిటు లెంతొ • వందురు లేలనే!
సవతు లేడ్వు రుండ • జవ్వనమున
భవ్యనవ్యచూత • పల్లవాధర లబ్జ
ముఖులు సుగుణమణులు • పువ్వుఁబోండ్లు॥ ౧౩౯

ఉ॥ ఈడునఁజోడునాక గుచు • నెంతయు మైత్రిని బ్రేమఁజూపుచున్
బాడిని దప్పకుండుచు న • బద్ధములంగల నైనమానుచున్
జేడెలమిన్న లంచును బ్రసిద్ధిని గాంచుచుఁబుత్రకాంతు నా
తోడను నోము లన్నిటిని • దోరపుబత్తిని నోఁచుచుండరే!॥

ఆ॥ వె॥ మందభాగ్యురాల • నందుచే నాకడు
పందుఁ గలుగఁ డాయెఁ • గందొకండు
గాని చెలుల కైనఁ • గలుగ కుండునె ముందుఁ!
గొలము నిలుపు మొలక • కొడు కొకండు॥ ౧౪౧

తే॥ గీ॥ అష్టశాఖాంచితోర్వీరు • హం బనంగఁ
బరఁగు; నెనమండ్రసతుల నా • ప్రాణవిభుడు
కొమ్మ లందొక కొమ్మ ఫ • లమ్ము గనినఁ
బాయదే! యనపత్యాప • వాద మంత॥ ౧౪౨

కం॥ మనమా! సవతికిఁ బుట్టిన
మన కేమిఫల మ్మని యను • మానించెద వా!
విను మొరులశుభము కోరిన
జనులకె సమకూర్చు శుభము • సర్వేశుఁ డిలన్॥ ౧౪౩

ఆ॥ వె॥ అట్లు గానియప్పు • డశాంతి దేవత
వనముఁ జెఱుచునట్టి • వహ్ని వోలె
గారణంబు లేక • మారణం బొనరించు
జనచయంబు నెల్ల • జగతియందు॥ ౧౪౪



మ॥ అని యిట్లానుతశీల సంతతము దా • నంతఃపురంబందునన్
మనమందుం దలపోసి కొంచును దదు • న్మాదంబుతో నుండుచున్
వనసత్క్రీడలు స్వాపభోజనములు • న్వర్జించి యాత్మీయమా
తనువు న్మాత్రము నిల్పి భర్తృచరణ • ధ్యానంబు నందాశతోన్॥ ౧౪౫

ధర్మపాలుండు నిజచింతను సభాపండితులకుం దెల్పుట.

సీ॥ అంతట నొక్కనాఁ • డాగమాద్యర్థముల్
చర్చించు చుండువి • చక్షణులును
భావికాలగతిశు • భాశుభంబుల నెల్లఁ
బరికించు చుండుదై • వజ్ఞమణులు
రాష్ట్రజనాళిసం • త్రాసాదివార్తల
నరయు చుండెడిసచి • వాగ్రణులును
దేశవృత్తాంతముల్ • దెలుప నేతెంచిన
ప్రచ్ఛన్నవేషు లౌ • భటజనులును
తే॥ గీ॥ గలుగ శోభిల్లుపేరోల • గంబునందుఁ
బ్రౌఢగాయకబృందము • ల్పాడు చుండఁ
బుడమిజేజేలు దీవించి • పొగడు చుండ
భద్రపీఠంబుపై ధర్మ • పాలుఁ డుండి॥ ౧౪౬

తే॥ గీ॥ 'అనఘవరులార! భూరిద • యాత్ములార!
ప్రథితబుధులార! తర్కశా • స్త్రజ్ఞులార!
విదితయశులార! వేదాంత • వేత్తలార!
వసుమతీదేవులార! దై • వజ్ఞులార!॥ ౧౪౭

సీ॥ సందేహతిమిరంబు సమయునట్టులఁ జేయు
భాస్వత్ప్రమానవిద్వాంసులార!
చింతాంబుదంబులఁ జెదరునట్టులఁ జేయు
స్పర్శనరూపదోషజ్ఞులార!
సంకోచభావాబ్ధి నింకునట్టులఁ జేయు
బడబాగ్నిసన్నిభప్రాజ్ఞులార!
దావరారణ్యంబు ధ్వంస మానటు సేయు
వీతిహోత్రోపమవిబుధులార!
తే॥ గీ॥ హృద్విచారాద్రిభేద దేవేంద్రులార!
సంశయానలనాశవర్షనిభులార!
చిత్తవిభ్రమహరవిపశ్చిత్తులార!
మనవి చేసెద నాచింత మాన్పరయ్య!॥ ౧౪౮

కం॥ గోత్రాభివృద్ధిమూలము
పిత్రార్జితరాజ్యభారభృతిమూలంబుక్
ధాత్రీశప్రముఖులకుం
బుత్రాపత్యంబు గాదె! భూలోకమునన్॥ ౧౪౯

తే॥ గీ॥ అట్టిసంతానసంపద నందను గద
భార్యలెనమండ్రుగురను నేఁ బడసి యున్న
వైభవోపేత మాప్రభుత్వం బిఁ కేల!
భాగ్యభోగ్యంబు లేల! నాబ్రతుకిఁ కేల!'॥ ౧౫౦

ఆ॥ వె॥ అనుచుఁ దోఁప నొక్క కపవాదు లోలోన
నాధిఁ జెందు చుండు నధికముగను
మఱియు నింకొ కప్డు మానసంబున నెంతుఁ
దొంద రేల! కల్గు ముం దటంచు॥ ౧౫౧



శా॥ సప్తాశ్వప్రతివిక్రమక్రమజగత్సౌఖ్యప్రదోద్యోగులై
సప్తాంభోధిపరీతభూవలయమున్ సంగతిం జేయుచున్
లుప్తాపత్యవిశేషదుఃఖవశహృల్లోలత్వముం బొందరే!
సప్తర్షిప్రభులైన యాజనకభూజాన్యాదులున్నావలెన్॥

కం॥ కావున నాజాతకమును
దైవజ్ఞులు మీర లరసి తత్ఫలబోధం
గావింపుఁడు! సంతానా
భావుండనొ కానొ యెట్లు వడయం గలనో!'॥ ౧౫౩

ఆస్థానకవీంద్రుండు పూర్వభాగ్యముం గూర్చి చెప్పుట.

కం॥ దీనత నృపుఁ డట్లన నా
స్థానకవీంద్రుండు వల్కె ధరణీజానీ!
జ్ఞానంబుకంటె జనులకు
మానసరోగము నడంచుమందు దొరుకునే!॥ ౧౫౪

కం॥ ధనసంతానములఁ గనుట
గన కుండుట హెచ్చు తగ్గు గాఁ గనుటయుఁ ద
జ్జనములు పూర్వభవంబున
నొనరించినకర్మఫలమె యూహించినచోన్॥ ౧౫౫

తే॥ గీ॥ అప్రకారము కాదన్న నఖిలజనులు
నొక్కరీతి సంతును సిరి నొందవలయు!
నొక్కసరణిని జీవించు చుండవలయు!
నొక్కవిధి సావుపుట్టుక లొందవలయు!॥ ౧౫౬

తే॥ గీ॥ కాన సుఖదుఃఖభేదము లలుగు చుండు
సర్వజీవులకును బూర్వసంచితమునఁ
బుటుచుండును వెవ్వేఱుభూతములుగ

విష్టపత్రియమున జంతు • పితుతు లధిప!॥ ౧౫౭

తే॥ గీ॥ బుద్ధి కర్మ ననుసరించి • పోవు చుండుఁ
బోయినప్పుడు సుజ్ఞాని • బోధ నెంచి
మంచిచెడ్డలభేదంబు • లెంచవలయు
నెంచి మంచికి నరు లుద్య • మింపవలయు॥ ౧౫౮

తే॥ గీ॥ జనము లొరులకు నొకపని • సల్పునప్పు
డితరులును దమ కటు సేయ • నిష్ట మంచుఁ
జిత్తమునఁ దోఁచినప్పుడే • యుత్తమమని
చేయ నెంచినయద్దానిఁ • జేయవలయు॥ ౧౫౯

కం॥ అరయక మదిఁ దోఁచినగతిఁ
జరియించినవారి కఘము • సంప్రాప్త మగున్
జరికింపఁగఁ దద్దోషము
మఱుమేనునఁ గుడువ కుండ • మానదు లవమున్॥

కం॥ వెనుకటిజన్మం బెక్కడ
యనుభవ మది యెక్కడంచు • ననఁ జూచెదవే!
వినవే! కష్టసమయముల
మునుపటికర్మఫల మంద్రు • మూఢులు గూడన్॥ ౧౬౧

కం॥ అప్పటి దన నేలొకో మన
కిప్పటికర్మంబె ఫలము • నిచ్చు నటంచున్
జెప్పు నవునె! వేసినపై
రిప్పటి కిప్పుడె ఫలంబు • నిచ్చునె? సెపుమా!॥ ౧౬౨

ఆ॥ వె॥ వీడ కుద్యమించి • విద్యాధనాదులు
భాగ్యహీను లెపుడుఁ • బడయ లేరు
పూర్వపుణ్య మున్నఁ • బొందెద రల్పవ్రి



యత్నముననె మర్త్యు • లంచు వినవె!॥ ౧౬౩

తే॥ గీ॥ గేస్తున కపత్యసంప్రాప్తి • కేవలంబు
దైవవశ మాట వ్యర్థయ • త్నములు సూవె!
జోస్యులను జాతకంబును • జూపఁ దనుట
ప్రశ్న చేయుట వేఁడుట • పార్థివేంద్ర!॥ ౧౬౪

ఉ॥ జాతకసూచితాంశము ని • జమ్ముగ విశ్వసనీయ మేనిఁ ద
ద్రీతి నిదర్శనం బని ప్ర • తిజ్ఞ నొనర్చెడునొక్క జోస్యునిన్
ఖ్యాతిగఁ జూపు మిచ్చటిస • భాంతరమందున నెట్టివందెమున్
బ్రీతిగ వేసి గెల్తు ధృతి • వీడక నిల్తు ధరాధిపాగ్రణీ!॥

ఉ॥ కావున ధర్మపాల! శుభ • కాంచనపట్టణపౌరలోల! దీ
నావనపుణ్యశీల! సుజ • నాంచితభూరికృపాలవాల! నీ
భావమునందు నిమ్మెయి న • పత్యవిహీనవిచార మొంది సౌ
ఖ్యావహధైర్యము న్విడుట • న్యాయమె! ధీరజనస్వభావమే!॥

రాజపురోహితునిసంభాషణము.

తే॥ గీ॥ అనిన రాజపురోహితుం • డగ్గిలోన
నాజ్యమును బోసినట్లు హృ • దంతరాళ
కోపశిఖికీల లడరఁ ద • ద్గోష్ఠి బెదర
మండిపడి పల్కె నాసుధీ • మణిని గాంచి॥ ౧౬౬

కం॥ పోలు వగునీపాండిత్యము
గొలువునఁ గూర్చున్నజనులు • గోరిరె! వినఁగన్
బిలువని పేరంటమునకుఁ
గలిపించుకొనంగఁ దగునె • కర్మవిదూరా!॥ ౧౬౭

కం॥ సంతానాసక్తిని రా
జెంతో ముద మంది యున్న • పృచ్ఛింప నీన్న

వింతయు శాస్త్రం బెఱుఁగక
సంతతివిభవంబు పూర్వ♦సంచిత మనదే!॥ ౧౧౯

కం॥ మెచ్చెను బండితబృందము
మెచ్చెను వసుధాధవుండు ♦ మెప్పుగ నీ కే
మిచ్చిన నీ నగు బహుమతు
లచ్చపుఁగోవిదుఁడ వయ్య! ♦ యద్వైతోక్తి!॥ ౧౨౦

ఉ॥ ఇందఱిలోన రాజున క♦భీష్ట మొసంగెడివానిఁబోలె మున్
ముందుగ లేచి సభ్యులు ప్ర♦మోదము నొందఁగ నాట్య
మాడుచున్
గ్రిందును మీఁదెఱుంగకటు♦ప్రేలెదవే! మము గేలికొట్టుదే!
సందియమున్ దర్ప న్విడిచి ♦ సద్వరు భంగి నుపన్యసిం
చుచున్॥ ౧౨౧

ఆ॥ వె॥ మొండిబండమాటు♦మొద్దులతో నైన
వాద మాడి గెలువ ♦ వచ్చుఁ గాని
సకలకర్మదూర♦సాహసాద్వైతితోఁ
బోరి గెలువఁ గలరె! ♦ పూజ్యమతులు॥ ౧౨౨

కం॥ కానఁ ద్వదీయోక్తుల నే
నౌ నని కా దని వచింప ♦ నైతిని సభలోఁ;
మానాభిమానహీనుల
మానధనులు కదియ కుంట ♦ మర్యాదగదా!'॥ ౧౨౩

మ॥ అని భూపుం గని పల్కె నిట్లు భవదీ♦యాజ్ఞానుసారంబుగా
ఘనులౌ జోస్యులు నేను జాతకము దీ♦క్షాబుద్ధిమైఁ జూడగాఁ
గననయ్యెన్ దమకింక ముందుసుతతో♦కంబేర్పురత్యుత్తముల్



దనయుల్ మువ్వురు నుద్భవింతురని ♦ చింతం దక్కుమా!
భూవరా!॥ ౧౨౪

ఆ॥ వె॥ ఇంత దనుక నెదుట ♦ గొం తెత్తి యార్చిన
యమ్మొఱకుని మాట ♦ నమ్మఁ బోక
నెమ్మనమ్మునఁ గల♦యుమ్మలికను మాని
నడువు మయ్య! నేను ♦ నుడువు నట్లు॥ ౧౨౫

కం॥ గ్రహనవక నికృష్టశని
గ్రహ మిప్పుడు సరిగ లేదు ♦ గావున జాయా
సహితుఁడ వౌచుఁ బదినెల
లహరహముం బూజ సల్పుఁ ♦ డావారములన్॥ ౧౨౬

ఆ॥ వె॥ వటుసంగఁ బ్రతిమంద♦వారంబునందున
విప్రజనులఁ బిలిచి ♦ విహితమతిని
దధిఘృతాదిజగ్ధి♦దక్షిణతాంబూల
ములను దృప్తిపఱుప ♦ వలయు నంత॥ ౧౨౭

ఆ॥ వె॥ వ్రతము పూర్తి కాఁగ ♦ గ్రహశాంతికై రూప్య
భూరిగోధనాది♦పుణ్యదాన
సమితి నీయ వలయు ♦ భూసురాళికి భక్తి
ద్రవ్యలోభత మెయిఁ ♦ దగ్గకుండ॥ ౧౨౮

తే॥ గీ॥ పిదపఁ దీర్థయాత్రలను సే♦వింప వలయు
సకలపరివారములతోడ ♦ సతులతోడ
శాస్త్రవిధ్యుక్తపద్ధతి ♦ జరుప వలయు
నేను పేర్కొనుచోట్ల న ♦ వెవ్వి యనిన॥ ౧౨౯

కం॥ గంగానదీతటస్థిత
బంగాళస్థానపుణ్య♦వైభవరాశిన్

గంగాధరలింగాలయ
శృంగారం బై లసించు • శ్రీమత్కాశీ॥ ౧౮౦

కం॥ రాగతిమిరేనదీద్ధతి
భోగప్రదదివ్యభూతి • భూజనవినుతిన్
ద్యాగపరాయణసమితిన్
యాగార్చితవిప్రవితతి • ఖ్యాతావంతిన్॥ ౧౮౧

కం॥ తక్కక నానుడిగతి నుతి
కెక్కినయాత్మేత్రయుగము • నేజనుఁడైనన్
మక్కువ సేవించినచో
దక్కుట నిక్కము నిజేప్సి • తంబులు ధరలోన్॥ ౧౮౨

ఆ॥ వె॥ ధాత్రి సర్వజనులు • దక్షిణకాశియు
గం బటంచు వేనిఁ • గడు నుతింతు
రట్టి కీర్తిగాంచు • నంతర వేది రా
మేశ్వరంబుఁ జూడ • నేగవలయు॥ ౧౮౩

ఆ॥ వె॥ వానికోస మేగు • వార లింకను గొన్ని
పుణ్యతీర్థములకుఁ • బోవ వచ్చుఁ
జిత్రచిత్రములను • జేతోముదంబుగాఁ
గాంచ వచ్చుఁ గోర్కెఁ • గాంచ వచ్చు॥ ౧౮౪

ఆ॥ వె॥ అట్టు లాచరించి యైన • సంతానంబు
నంద నేమొ యంచు • సందియమొకో
పూర్ణయత్నమునను • బుత్రకామేష్టి సే
యించి యైన నది ల • భింపఁ జూతు॥ ౧౮౫



చం॥ ఇనకులచంద్రుఁ డౌ దశర • థేశుఁడు మున్ను సతీత్రయంబునన్
దనయుఁ డొకండుఁగల్గమికిఁ • దద్దయుఁగుందవశిష్ఠుఁ డొజ్జమే
ల్గొనముల మేటిసంతతిని • గూర్ప మదింబరికించి పుత్రదా
ననిపుణమైనజన్నమునొ • నర్పఁగఁ జేసిహితంబుగూర్పఁడే!॥

కం॥ ఎవ్విధి నైనం దమవగ
బుత్రవ్వంగ నొనర్తుఁ బ్రిజ్ఞ • బూటకముల వా
కుత్రివ్వం గావున దైన్యము
దవ్వులకుం బాఱఁ దోలు • ధరణీనాథా!॥ ౧౮౬

పుత్రసంతానఫలము.

చం॥ పరిపరిభంగు లాగతి స • భాస్థలమందుఁబురోధసుం డుదా
హరణలతోడ యాత్రలవి • హారఫలాదులు బోధసేయఁ ద
న్నరపతి దీనచిత్తవద • నాంబుజముల్ వికసించె” నంచు నా
పరవిదుఁ డధ్వనీనుఁ గని • పల్కనతండిటుప్రచ్ఛఁ జేసెడున్॥

ఆ॥ వె॥ “సంతు లేక మిపులఁ • జింతించు ధనవంతు
లైనఁ గాని బీద • లైనఁ గాని
ముఖ్యముగను ముందుఁ • బుత్రసంతానముం
గోరుచుం ద్రదేమి? • ధీరతిలక!॥ ౧౮౭

తే॥ గీ॥ బాలికాపత్యజననంబు • పాపకరమె?
పుత్రసంతానమే యంత • పుణ్యదంబె?
ప్రీతితో లోకు లట్లను • హేతు వేమొ!
విశదముగ బోధసేయుమీ! • విబుధవర్య!”॥ ౧౮౮

ఉ॥ నావుడుఁబల్కు వృద్ధుఁడెల ♦ నవ్వున నీయది సార్థకాఖ్యయౌఁ
గావున విన్నదాని నవ ♦ గాహనఁ జేసికొనంగ లేవు; నీ
భావము సందియంబులకుఁ ♦ బాదవుటం దగఁజర్చ చేసి, యే
ధీవిభవుండొ లోకులకుఁ ♦ దెల్పెడి పేరిడె సంశయాత్మకా!॥

ఆ॥ వె॥ ఉరక వడ్లగింజ ♦ నొలిచిన నేగింజ
బయటఁ బడు నటంచుఁ ♦ బలుకు టేల!
పొలఁతి పుట్టి పెరిఁగి ♦ పోవు నత్తింటికిఁ
దనయుఁ డేఁగఁ డంచు ♦ వినవె! కనవె!॥ ౧౯౨

ఆ॥ వె॥ తమకు నొద్దనుండు ♦ కొమరునిచే లాభ
మే మటంచు మరల ♦ నెంతు వేమొ
వృద్ధదశను బత్తి ♦ శ్రద్ధతో నుపచార
మాచరించు ననెడి ♦ యాస కాదె!॥ ౧౯౩

కం॥ తనయుఁడు జననం బందిన
జనునకుఁ బరమందు స్వర్గ ♦ సౌఖ్యం బగు నం
చనుకింవదంతి సత్యం
బని నమ్మితి వేమొ! విను; త ♦ దర్థనిజమ్మున్॥ ౧౯౪

ఆ॥ వె॥ సుతులు పుట్టఁ బరమ ♦ గతి కేగ నగు నన్న
సుతుల నొందికూడ ♦ సుగతిఁ గోరి
క్రతువు లాచరించు ♦ కత మేమి? వెఱ్ఱులే?
శాస్త్రవిదులు పరమ ♦ ఛాందసులును॥ ౧౯౫

తే॥ గీ॥ ఆత్మజుం డొనరించుపు ♦ ణ్యాధికమునఁ
బితరు లఘనాశులై స్వర్గ ♦ వేశ్మ లయిన;
వృజినవర్తను తాతదా ♦ త్మజులచేత
వారు దివి నున్న నరకానఁ ♦ బడుదురు గద!॥ ౧౯౬



ఆ॥ వె॥ అందుచేత నెల్ల ♦ రనుభవింపఁగ లేరు
స్వకృతపుణ్యపాప ♦ సమితి నెల్ల
నట్టినుడుల నమ్మ ♦ బెట్టు? లొక్కఁడు దిన్న
నొకనికడుపు నిండు ♦ నొక్కొ చూడ!॥ ౧౯౭

తే॥ గీ॥ కాన సుతులను గోరెడి ♦ కారణంబు
దేహజాడ్యంబు లేచి బా ♦ ధించువేళ
వారు సద్భక్తితో నుప ♦ చారములను
జేయఁ గల రనునిశ్చయ ♦ చిత్తమె సుమి॥ ౧౯౮

ఉ॥ ఎందఱుభృత్యులుండినను ♦ రెందఱుప్రేమడిచుట్టలున్న నిం
కెందఱుసాన్వయస్థులును ♦ నిష్టులు బాగుగఁ గల్గియుండినన్
డెందమునందుఁ గొందలము ♦ డెప్పర మాటఁ గృశించుం
డుప్రదా
రందఱుభూజనుల్ కడుపు ♦ నందుననందనుడొండుపుట్టమిన్॥

తే॥ గీ॥ తక్కు జను లెల్ల నున్నంత ♦ మెక్కుచుండ్రు
రొక్క మెక్కుడుగా నున్నఁ ♦ జిక్కు నుండి
మిక్కుటం బగుప్రేమతో ♦ మెలఁగుచుండి
ద్రొక్కిచూడఁడు ధనము పో ♦ నొక్కఁ డైన॥ ౨౦౦

తే॥ గీ॥ పెఱలబిడ్డను బ్రియముతోఁ ♦ బెంచుకొన్న
నండఁ జేర్చినగోడగా ♦ నుండు నంచు
నాత్మభీతిల్లి చింతింతు ♦ రట్టివార
లాత్మరక్షకై గా కింక ♦ నన్య మగునె!॥ ౨౦౧

ఆ॥ వె॥ అయిన నిన్నుఁ బోలు ♦ నాత్మజులం గన్నఁ
గన్నవారి కెల్లఁ ♦ గడుపు నిండు

బుద్ధిమాలి తిరుగు • పుత్రులు మర్త్యుల
కున్న నేమి! లేక • యున్న నేమి!॥ ౨౦౨

తే॥ గీ॥ పుట్టినది యొక్కరుఁడ వయ్య • నెట్టు తల్లి
విడచి దేశాటనము సేయ • వేడ్క నేగు
దెంచితివొ యంచు నామదిఁ • గించ పాఁడవొ"
ననఁగ బాలకుఁ డతని కి • ట్లనియెఁ గలఁగి॥ ౨౦౩

సంశయాళుఁడు చదువు మానుట.

తే॥ గీ॥ "అక్షరాభ్యాస మైనయా • యదనునుండి
చదువు నేర్చుటలు బహుక • ష్టం బటంచు
నాత్మఁ దలపోసికొంచు నొ • క్కపుడు వింటి
దైవకృతమునఁ బొందు వి • ద్యాదు లంచు॥ ౨౦౪

తే॥ గీ॥ అట్లె మీరాజుతోడ సం • భాషణమున
నిల్పి పల్కెఁడె! యద్వైతి • నిశ్చలమతి
గానఁ గృతభాగ్య మున్న రాఁ • గలదటంచుఁ
జదువు మానితి నయ్య! త • త్సమయ మాది॥ ౨౦౫

చం॥ నను సహపాఠకుల్ పిలిచి • నం బడి కేఁగఁగ రమ్మటంచు మీ
వెనుకనె వత్తుఁ బొం డనియు • వెళ్లుటమానుచుఁ గొన్ని నాళ్లు మ
జ్జననిహితానుసారముగ • నల్పవలెం బను లున్నవంచు నే
దినములు గొన్నిటిం జరిపి • తిం గపటాత్ముఁడనౌచు వెండి యున్॥

చం॥ శిరముకరంబునొచ్చెడుభు • జింపవిషంబుగనుండుఁదిండిలో
జ్వరమలయించుచుండెనవ • శావయవాత్ముఁడనైతిఁగానని



త్తఱి బరి కేఁగలేననుచుఁ • దల్లియు నొజ్జయు నమ్మునట్లు నే
నెరవునబొంకిపుచ్చితిని • విద్దెను నేర్చుదినాలఁగొన్నిటిన్॥

ఉ॥ మాయ లటం చెఱుంగుచున • మర్షయుతుం డయి వేత్రియై యుపా
ధ్యాయుఁడు పండ్లు గీఁటుచు మ • దాలయమం దొకనాఁడు సొచ్చి రూ
క్షాయతదృష్టిఁ బట్టినను • ఘాతశతాళిఁ గడింది నొంపఁగా
నాయమ తీవ్రదుఃఖవచ • నంబుల నిట్లను నయ్యవారితోన్॥

కం॥ "పిల్లలపిడ్గా! నీ వ్గన
జల్లుమనుం గుండె లెల్ల • ఛాత్రులకును నా
యుల్లం బెరియఁగ నందను
నొళ్లంతయు రక్తధార • లొలుక నొనర్తే?॥ ౨౦౯

ఆ॥ వె॥ బ్రతికి యున్నఁ జాలు • బలుసాకుఁ దిని యైన
బ్రతుకఁ గలఁడు నాదు • పట్టి యింకఁ
జదువుకొనఁడు పొమ్ము! • చదువుబాలురఁ జావ
శమనరూప మొంది • జనన మైతె?॥ ౨౧౦

ఆ॥ వె॥ విద్య నేర్పి కొమరుఁ • డుద్యోగి యై మమ్ము
రక్ష సేయ కున్న • భిక్ష మెత్తి
ముదముతోడ ముందు • పోషింప లేఁడొకో!
వేదహితము గాదె • విప్రుల కది!॥ ౨౧౧

తే॥ గీ॥ కంటఁ బంటను బెదరింపు • మంటిఁ గాని
యనుఁగుపట్టిని నిటు కొట్టు • మంటి నొక్క
గోలుగోలున బాలుండు • గోలపెట్టఁ
గఠినురా లైన నైఁచునే • కన్నతల్లి!'॥ ౨౧౨

తే॥ గీ॥ అని యిటుల నాదుమాత నో • నాడు చుండఁ
బంతు లెంతొ పశ్చాత్తాప•వంతుఁ డవుచు
వినతుఁ డై తప్పు మన్నింప • వేఁడికొనియె
మరియు నతఁ డెత్తుకొని పోయె • బరికి నన్ను॥ ౨౧౩

తే॥ గీ॥ దానఁ జేసి సం దాయె నే • నూనుకొన్న
పంత మీడేర్చు కొనఁగ నా•పంతు లింత
కోపపడినను దల్లితోఁ • గొట్లకొలఁదిఁ
గొండెముల్ నేర్పుతోఁ బల్కు • చుండువాఁడ॥ ౨౧౪

తే॥ గీ॥ అంచుఁ గొంచె మో డైనచోఁ • గంచ మంత
నల్లె యనునట్లు మాపంతు • లసలు కొంత
బద్ధకుఁడు దురాగ్రహుఁడు కాఁ • బట్టి నాదు
పడినుడుల నమ్మి దూఱె మ • జ్జనని యతని॥ ౨౧౫

ఆ॥ వె॥ అంత కంత కెచ్చెఁ • బంతులిపై నయి
ష్టంబు గానఁ బాఠ•శాల కరుప
మాన్పె నన్ను నాదు•మాత, యవ్విధిఁ గొంత
కాల మేగ నొక్క•వేళయందు॥ ౨౧౬

తే॥ గీ॥ కారణం బేమొ గాని నన్ • గాంచి యామె
దేశ మీక్షించి రాఁగ నా•దేశ మిచ్చె
నందుచేతనె నే వచ్చి•నాఁడ నిటకు
దోష మేది నావలన మ•నీషివర్య!"॥ ౨౧౭

బాలకులకు విద్య నేర్పించు పద్ధతి.

చం॥ అనవుడువృద్ధుఁడిట్టులవ•హాస్యముగాననె "సంశయాత్మ!నీ
జననికుమారపాలనవ•చస్సులు నీగురుధర్మవర్తనం



బును భవదీయసూక్ష్మతర•బుద్ధిని వర్ణన సేయఁ జాలకా
వసజదళాక్షువేఁడికొని•పా ప్పయి శేషుఁడుదాఁగెసిగ్గునన్॥

ఆ॥ వె॥ చదువువారి కెల్లఁ • జక్కఁగా నీకథ
బోధ సేయు మంచి•బుద్ధు లెల్ల
మొండిచేతికి నిలఁ • దిండి నేర్పెడునట్లు
గుణము లెఱుఁగ కున్నఁ • గూర్చు గాదె!॥ ౨౧౯

ఆ॥ వె॥ అట్టిచరిత మెట్టు • లారసిదోసముల్
నుడువు వాఁడన"న నతఁడు గ్రహించి
"యుచితమార్గ మేదొ • వచియింపు మ"ని వేఁడఁ
గరుణతోడఁ బల్కెఁ • బరవిదుండు॥ ౨౨౦

కం॥ నీజనయిత్రి యచట నీ
వ్యాజోక్తు లెఱుఁగక పక్ష•పాతపుబుద్ధిన్
బూజాబహుమానార్పణ
భాజను నీగురువు నట్లు • పలుకం దగునా!॥ ౨౨౧

ఆ॥ వె॥ బాలకులకునెదుటఁ • బంతులుగారిని
'గొట్టఁబోకుఁ' డంచుఁ • గోపపడుట;
జనని యైనఁ దక్కు•సంరక్షకులు నైనఁ
బ్రేమతోడ విషముఁ • బెట్టుకొనుటె॥ ౨౨౨

ఆ॥ వె॥ చదువుతఱిని దెబ్బ • సాము నేర్పెడుతఱిఁ
బోటుఁ దగుల కున్నె! • భూమిదేవ!
సైఁప కున్న ముందు • సంరక్షకులు బాలు
ర నెటు విద్దె నేర్పఁ • జూనుపఁ గలరు?॥ ౨౨౩

ఆ॥ వె॥ మొలకసమయముననె • వలనుపడని దెట్టు
చెట్టుగట్ట వంచఁ • జేత నౌను!
పిన్నతనమునందె • విద్య నేర్పింప న
శక్య మైనఁ బిదప • శక్య మవునె!॥ ౨౨౪

కం॥ పిల్లలనైజంబులె గద
కల్లలు వల్కుటలు, విద్య • గఱచెడికాలం
బెల్లయు నాటలఁ బుచ్చఁగ
నుల్లాసముతోడ జనని • నొప్పించుటలున్॥ ౨౨౫

తే॥ గీ॥ గోతిలోన సులభముగాఁ • గూలునట్లు
పనికిమాలినపని కేగ • బాలకులకుఁ
గరము సుకరంబుగాఁ దోఁచుఁ • గాన నపుడు
పోషకులె త్రిప్పవలయును • బుణ్యపథికి॥ ౨౨౬

తే॥ గీ॥ మందు మ్రింగింప శర్కర • మాటు వెట్టు
పగిది విద్దెలలవడ నర్భకుల కెపుడుఁ
దల్లిదండ్రులు ప్రోత్సాహ • దంబు లైన
మాట లిడుచుంట దగుఁ గాని • మాన్ప నవునె!॥

ఉ॥ ముద్దుగ బాలకాళిచెడు • పోకల నాదిని సమ్మతించినన్
వద్దని ముందుమూఁగ దెటు • నివారణఁ జేసినమాన నేర్చునే!
పెద్దయినప్పు డాపనులు • పీడనొనర్చునటంచు వారికిం
బెద్దలు నాకవాసు లగు • పెద్దలుగూడను జేరి సెప్పినన్॥

తే॥ గీ॥ ప్రీతి యొక్కని కుండదే • బిడ్డలందు!
ప్రియధనము లెక్కు డున్నచోఁ • బెరుఁగు పోసి



పెంచెదరు గాని దుష్పథ • విహరణమున
కోర్తు రొకొ! తాఁచుతో నాడ • నోర్తురొక్కొ!॥

తే॥ గీ॥ కాన నీకొండెముల్ నమ్మి • కసలి గురుని
దూఱె నీమాత నీదుచ • దువును మాన్పె
సెంతయుం దప్పు మఱియు మీ • పంతులందుఁ
గొంతలోపంబు గలదు క • థింతు వినుము!॥ ౨౩౦

ఉపాధ్యాయులలోపములు.

తే॥ గీ॥ ఎదుటివారియభిప్రాయ • మెఱుఁగకుండ
నింటఁ జొరఁబడి శిష్యుని • గంటుతోడ
మేను కందంగ బాఁదిన • మెత్తురె! యటఁ
గన్నవా రున్నవా రట్లు • విన్నవారు॥ ౨౩౧

ఆ॥ వె॥ చదువుసెప్పువారు • స్వస్థానము న్వీడి
పిల్లవాండ్రి బడికిఁ • బిల్చుపనికిఁ
గొంద ఱనుదినంబుఁ • గొంపకొంపకుఁ బోవు
చుందు రేదొ లాభ • మొందుకతన॥ ౨౩౨

కం॥ పురజనగృహిణులఁ గని పలు
వరుసలు గల్పించి 'యుప్ప! • వదెనా!' యనుచుం
బరమహితంబుగఁ బిల్చెడి
గురువులు నిజగౌరవంబు • గోల్పడకుందే!॥ ౨౩౩

తే॥ గీ॥ తిరుగుకాలును దిట్టునో • రరయ రెండు
నూఱకుండ వనునటు లా • యొజ్జలెల్ల
రొక్కటుణ మైనఁ గూర్చుందు • రొక్కొ బడిని!
బాలకుల కక్కరపుముక్క • వచ్చు నొక్కొ!॥

సీ॥ అందుచే నాగ్రహ ♦ మంది మావాని కీ
వేమి సెప్పితి వంచు ♦ నెంచువారుఁ
బంతులా! మావాని ♦ బడికిఁ గొంపో వేమ
టంచుఁ జుల్కనమాట ♦ లాడువారు
నెట్టిపంతుల వయ్య ♦ యింటిలో మావాని
యల్లరి మాన్పింప ♦ వనెడివారుఁ
గూరమజ్జిగలాది ♦ గోరునంతటి శ్రద్ధ
చదువులో లే దంచు ♦ సణుగువారు
తే॥ గీ॥ బయలు దేఱుదు రచ్చటి ♦ పౌరులందు
మొదట జన్మంబె మహిమంబు ♦ మదముపట్ట
దానివర్తన మెట్లుండు? ♦ తద్విధమున
మోటువాఁడ్రికుఁ బగపుట్ట ♦ మాట లనరె!॥ ౧౩౫

కం॥ మరికొంద ఱుపాధ్యాయులు
బరికాలమునందె వద్దు ♦ పత్రిము లెల్లన్
దఱచుగ వ్రాసెదరుగ! య
క్కఱణిం జరియించువారు ♦ కపటులు కారే!॥ ౧౩౬

కం॥ మనసార దైవముం గని
తనయుద్యోగము నెవండు ♦ దద్దయు శ్రద్ధన్
బొనరించునో యాజనుఁడే
ఘనయశముం బొంది జయము ♦ గాంచెడి ధరలోన్॥
తే॥ గీ॥ అయ్యవారలు దేశవి ♦ హార మేగ
అమ్మవా రూరిసంచార ♦ మరిగినట్లు
అయ్యవా రట్లు బడినుండి ♦ యరిగినప్డు
బాలురును స్వేచ్ఛ గంతులు ♦ వైతురు గద॥ ౧౩౭



తే॥ గీ॥ అందుచేఁ గాలుచేతులం ♦ దరయ నేవొ
భంగపడినను బడవచ్చు ♦ బడనియెడలఁ
బోరు నైనను బాలకుల్ ♦ పోరయ కుండ్రె!
గిల్లుకొనియొ కొట్టికొనియొ ♦ కినుకఁ దవిలి॥ ౧౩౮

తే॥ గీ॥ దానఁ జేసి పౌరుల కుపా ♦ ధ్యాయునందు
నెనరు మర్యాద తప్పుట ♦ నిజము గాదె!
ఇచ్చకపుమాట లెన్ని వ ♦ చించు చున్న
మనసులో న్యాయపథుఁ డను ♦ కొనుట సున్న॥ ౧౪౦

తే॥ గీ॥ అట్టిపంతుళ్లయందు శి ♦ ష్యాళి కేని
దథ్య మగుగురుభక్తి చి ♦ త్తంబునందు
హత్తుకొనునె! కేవలము భ ♦ యంబుచేత
నొదుఁగు చుండ్రి; పులికి మేక ♦ లొదుఁగునట్లు॥

ఎల్లరకు విద్య ముఖ్యము.

తే॥ గీ॥ ద్రవ్యబలహీనురాలు మా ♦ తల్లి గాన
నన్నుఁ జదువునుండి మాన్ప నం ♦ చనెద వేమొ
వినయవచనాళి గురువుల ♦ వేఁడికొన్న
నుచితముగ బోధసేయరే ♦ యోగ్యమతులు!॥ ౧౪౧

తే॥ గీ॥ విద్దె సుతులకు శాశ్వత ♦ విత్త మనుచు
బీదలును బిచ్చ మెత్తి నే ♦ ర్పింత్రి గాదె!
అట్టియనవద్యవిద్యార్థ ♦ నార్జనమున
కెట్టిపాట్లను బడిన జ ♦ నేడితంబ॥ ౧౪౩

కం॥ విద్యాహృదంతరనేత్రము
విద్యాధ్వాంతమును వేగ ♦ వీడఁగఁ జేయన్

ఖద్యోతబింబతుల్యము
సద్యఃఫలితంబె గాక • శాశ్వతసుఖమా॥ ౨౪౪

శా॥ ఉద్యోగంబులు సేయఁ బోవుదుమె! లే • కూళ్లేలఁగాఁ బోదుమే!
విద్యాభ్యాసన మేల మాకు! మును మా • వృద్ధుల్ యశం బందరే!
విద్యాగంధము లేకపోయినను మా • వృత్త్యాప్తి సం చంద్రిగా
విద్యాశూన్యులు పల్లెటూళ్ల సుతుల • న్విద్యార్థులం జేయ కే॥ ౨౪౫

సీ॥ అజ్ఞానమునఁ గాదె! • యల్లెంచుటలు వారు
చదువు లేకొకపని • చక్కఁబడునె!
చదువు నేర్వమిఁ గాదె! • సాహుకారులు గొంద
ఱన్యులచే మోస • మందుచుండ్రి
చదువు నేర్వమిఁ గాదె! • జాబులాదిగ వ్రాయ
నర్థింతురి కరణాల • కర్థ మిచ్చి
చదువు నేర్వమిఁ గాదె! • జనులు రాబడి ఖర్చు
గణుతింప లేక దు • ర్గతిని గందు

తే॥ గీ॥ ఇంకఁ బెక్కుమాటలను వ • చింప నేల!
వ్రాయుటయుఁ జదువుట లెక్క • వేయుటయును
సకలజనులకు ముఖ్యావ • సరము గాదె!
స్వంతకార్యాల జయ మొంద • జ్ఞాన మొంద!॥

తే॥ గీ॥ భృతకజనములు పురజను • లిచ్చుడబ్బు
వర్తకజనంబు నష్టలా • భములడబ్బు



రైతులు వ్యవసాయవ్యయా • ర్థ మిడుడబ్బు
నైన సరిగ నెఱుఁగుట ము • ఖ్యంబు గాదె!॥ ౨౪౬

కం॥ లోకజ్ఞానముకొఱకును
లేకలఁ జదువుటకు వాని • లిఖియించుటకున్
వీఁకను విద్దెం గఱచుట
ప్రాకటశుభ మంచు జనులు • భావింప నగున్॥ ౨౪౭

సీ॥ తలిదండ్రు లొసగూర్చు • ధనవస్తుతతి ఋణ
దాతచే నైన శా • త్రవుల నైనఁ
దలిదండ్రు లొసగూర్చు • ఫలవృక్షవనులు మృ
గాలిచే నైనఁ బె • న్గాలి నైనఁ
దలిదండ్రు లొసగూర్చు • నిలుమేడమిద్దెలు
ప్రాఁతగిల్లుట నైన • వహ్ని నైనఁ
దలిదండ్రు లొసగూర్చు • ధారుణీభాగముల్
వ్యయముచే నైన భూ • భర్త నైన

తే॥ గీ॥ నాశ మగుఁ గాక యొక్కింత • నాశ మవునె!
విద్య యనుద్రవ్య మిడిన నె • వ్విధిని నైనఁ
గానఁ గొమరుల కెల్లరుఁ • గడఁగి తనువు
తోడ మెఱయువిద్దెను గూర్పఁ • జూడ వలయు॥

సీ॥ కులగోత్రభేదముల్ • గోరంత యెంచక
పూజింతు రెద్దాని • పొందువలన?
చిన్నపెద్దలభేద • మెన్నక జను లెల్ల
గారవింతు రెద్దాని • కలనవలన?
స్త్రీపురుషులభేద • చింతనదూరులై
గారవింత్రెద్దాని • కలిమివలన?

కొత్తపాతలభేదగుణవిచారణ లేక
ప్రేమింతు రెద్దాని ప్రేమవలన?
తే॥ గీ॥ రూపు రేఖలు లేనికురూపి నైనఁ
బ్రస్తుతించెద రెద్దాని ప్రాప్తివలన?
అట్టిమహనీయసత్కళాభ్యాసవిధిని
విడుచుమానవు లెంతటివెఱ్ఱులో గద!॥

బాలబోధకవిధి.

మ॥ తమ రేదో పనిమీఁదఁ బోవుచు నుపాధ్యాయుల్ బడిం బ్రాఁతపా
ఠములం జక్కఁగ వల్లె వేయుఁ డని తీండ్రం బొప్పఁగాఁ జెప్పఁ బా
పము! విద్యార్థులు నైకకంఠ్యములతో వల్లించి యొక్కప్డు పా
ఠము సాంతంబుగ రామి దెబ్బలను వేండ్రం బొందుచుం దిందురిగా!॥ ౨౫౧

మ॥ ఇసుమంతం దయలేక బోధనకునొల్లింతేనియు న్వంగ కా
పసివాండ్రన్ బవలస్తమానమవునాపర్యంత మొజ్జల్ బడిన్
వసియింప న్నియమింతురి; దోషులఁ జెఱన్ బంధించున ట్లందుచే
వినువుం జెందురె; గాక నేర్చెదరె! యావిద్యన్ దదీయార్భకుల్॥ ౨౫౨

మ॥ దిన మంతం జదివింప బాలకులు విద్దెం బాగుగా నేర్తు రం
చనుకొం చుందురు పల్లెటూళ్ల మనుజుల్ హా! యట్టులే యైనచో



బోధకోద్యోగగౌరవము.

ఆ॥ వె॥ బ్రతుక లేనివారు బడి సెప్పుకొను చుండు
రంచు నజ్ఞు లందు రరయ లేక
యుర్విలోన బోధకోద్యోగమును బోలు
పదముగలదె! యశము ముదముఁ నిడఁగ॥ ౨౬౪

ఆ॥ వె॥ తక్కుపదము లెల్ల ద్రవ్యార్జనమునందు
నెక్కు డయినఁ గీర్తిఁ దక్కు వగును;
సత్యవాక్కులందు నిత్యధర్మువునందుఁ
గ్రాలు చుంట కింత వీలు లేమి॥ ౨౬౫

కం॥ తక్కినయుద్యోగస్థుల
కొక్కకపని సల్పునియమ ముండుటచేఁ బెం
పెక్కక వారలు నేర్చిన
తక్కినపాఠములమెఱుక తఱుఁగుట నిజమౌ॥ ౨౬౬

తే॥ గీ॥ దివ్వె కొకదివ్వె నంటింపఁ దేజరిల్లు
భాతి వెల్గొందెడిని గురువరులవిద్య;
శిష్యులకు సర్వపాఠముల్ సెప్పు చుండు
కతన నేర్చినదాని విస్మృతిని గనరు॥ ౨౬౭

పౌరుషేయంబె ముఖ్యము.

తే॥ గీ॥ పూర్వభవభాగ్య మున్నచోఁ బొందఁ గలను
విద్దె నని నమ్మునాఁడవే వెఱ్ఱివాఁడ!
సోమరితనంబుచేఁ గాక సూనృతంబె!
యట్లు తలపోయు చుండు టో యతిథిబాల!॥ ౨౬౮

తే॥ గీ॥ పూర్వపుణ్యాధికం బున్నఁ • బొరయఁ గలన
టంచు జతనంబు సేయకే • యందఁ గలవె!
ద్రవ్యధాన్యాదిసకలప • దార్థములను
స్వీయకార్యార్థి వై పొరు • పేయదూర!॥ ౨౧౯

తే॥ గీ॥ పంట; విత్తులు చల్లకే • పండునొక్కొ!
తిండి; వంటను జేయకే • తిండు వెక్కొ!
పోక; విడి పెట్టచోటికిఁ • బోదు వెక్కొ!
యత్న మొనరింపకయె ఫల • మందు దొక్కొ!॥ ౨౨౦

తే॥ గీ॥ చేఁత నైనంత యత్నంబు • సేయఁ బిదప
ఫలము నొందుటో! లేక ని•ష్ఫలము గనుటో!
పూర్వసంచితమును బట్టి • పొరయుఁ గాని
వడయునే! సుఖముగ నింటఁ • బండుకొన్న!"॥ ౨౨౧

ఆ॥ వె॥ అనుచుఁ బరవిదుఁడు • మనుజకులం బెల్ల
నెల్లపొద్దు లెట్లు • కృషి యొనర్చి
ఫలము పొంద వలెనొ • పొల్పుగా' ననుధర్మ
శాస్త్రబోధ సేయ • సరసముగను॥ ౨౨౨

కం॥ శ్రీవాగీశేశ్వరముని
దేవార్చితభవ్యరూప • దివ్యచ్ఛాపా
సేవకహృదయానందా
పావనపాదారవింద • పరమాత్మహరీ॥ ౨౨౩

వనమయూరవృత్తము.

నారదసురర్షిముఖ•నవ్యశుభగానో
దారసరసామృతస•దాముదితచిత్తా



భూరిభవదుఃఖహర • పూతజనహృన్మం
దార వరదాత్మ ఖల•దానవవిరోధీ॥ ౨౨౪

మాలినీవృత్తము.

దితిసుతతతినాశా • ధీరచిత్తప్రకాశా
శ్రితజనపరిపాలా • శ్రీసతీరమ్యలీలా
కృతశతమఖతోషా • గేయమాయావిశేషా
నతమృతరిపుజాలా • నందగోపాలబాలా॥ ౨౨౫

గద్యము:— ఇది శ్రీమత్సరస్వతీనిర్హేతుకజాయమాన
కటాక్షవీక్షణపవిత్ర మధ్వమతహారిత
సగోత్రచిల్లరిగెవంశపయఃపాథోధి
రాకాసుధాకరనరసింహారా
యార్యద్వితీయపుత్ర సకల
బుధజనమిత్ర యోగా
నందకవిప్రణీతం
బయిన జ్ఞానవతీ
ప్రబంధమందలి
ప్రథమాశ్వాసము.

---

శ్రీమత్పరాత్పరాయనమః

# జ్ఞానవతి

## ద్వితీయాశ్వాసము.

కం॥ ఖండితదానవనివహా
భండనశాత్రవతమిస్ర • భాస్కరవిశిఖా
మండితభూషణ మదవే
దండకరసమానబాహు • దండముకుందా॥ ౧

సంశయాళుండు తనతప్పొప్పుకొనుట.

ఆ॥ వె॥ అంతఁ బరవిద్యాఖ్యు • నాసంశయాత్మకుం
డరుణుఁ గాంచునట్టి • యంబుజముగఁ
గాంచి సంతసించి • కరములు ముకుళించి
స్వాంతమందు మొదటి • ప్రశ్న నెంచి॥ ౨

కం॥ "విస్తరయుష్మద్బోధఁ
గ్రస్తం బై నామనంబు • కడు సంభ్రమునన్
ప్రస్తుతకార్యము మఱచె జ
నస్తుత్యా! దాననిత్యా! • నయహితకృత్యా!॥ ౩

ఉ॥ నీతగుబోధనాసుధను • నిర్మలమయ్యెను గొంతదాఁక నా
చేతము భూరిసంశయపుఁ • జీఁకటిపాసెను గొంతదాఁక; నా
మాత మదీయబోధకుని • మత్కృతదోష మెఱుంగలేక త
ద్ఖ్యాతిని దూఱు టెంతయును • దప్పని దోఁచెడు నాకు
నిత్తఱిన్॥ ౪



కం॥ కృతనిశ్చయుండ నగుటన్
మతిమద్గురు నింద సేసి • మాతకు వైరం
బతిశయ మగునట్లుల నే
వితథోక్తుల నాడి విద్య • వీడితి వెఱ్ఱిన్॥ ౫

చం॥ గతజలసేతుబంధనము • కాదె! మదిం దురపిల్లుటిప్పుడో
నుతగుణ!మీధరిత్రిరమ • ణుండలనాఁడు పురోహితోక్తులన్
మతి నటు నమ్మి తీర్థముల • మజ్జన మాడఁగఁ బోయె
నొక్కొ! యా
కతమున సంతు గల్గెనొకో! • గ్రక్కునఁ దెల్పుమ! కోర్కి
దీర్పుమా!"॥ ౬

ఆ॥ వె॥ అంచు వేఁడినంత • మించినప్రేమతో
సంశయాళుఁ గాంచి • సంతసమునఁ
బల్కెఁ దొడఁగె నిట్లు • వరవిదుం డనఘుఁ డే
యోజ రాజు తీర్థ • రాజిఁ గనెనొ॥ ౭

ధర్మపాలుండు తీర్థయాత్రలకు వెళ్లుట.

కం॥ "వినుమీ! బాలక! మత్పుర
జనపతి సుధి ధర్మపాల • సన్నాముం డా
దినముననె కుటుంబముతోఁ
జనె జననుతపుణ్యతీర్థ • సంచారరతిన్॥ ౮

సీ॥ జీమూతసన్నిభ • సామజంబులు ముందు
కాఱుచీఁకటు లట్లు • క్రాలు చుండ
నుచ్చైశ్రవసమున్న • తోత్తమాశ్వమ్ములు
నొకప్రక్కఁ బోవుచు • నొప్పెసంగ
వందిమాగధభక్త • వారగీతంబులు

వినువారిచెవులకు ♦ విందుఁ గొల్ప
వేత్రహస్తులు దమ♦గాత్రంబు లెత్తి తొ
లంగు తొలఁగు మంచు ♦ లలి వచింప
తే॥ గీ॥ డోలికాదియానము లెల్ల ♦ హాళి నిడఁగ
నవ్యరత్నాద్యలంకృత♦భవ్యరథము
నెక్కి సేనాకలకలంబు ♦ దిక్కు లెల్లఁ
బిక్కటిల్లంగ మారాజు ♦ వెడలె నపుడు॥

కం॥ భటసంతతు లిరుప్రక్కలఁ
బటుతరవేగాశ్వమత్త♦వారణములు ముం
దటనటఁ బో నియమించిరి
నిటలాక్షునిఁ గేరి పోరు♦నెఱసేనానుల్॥

సీ॥ చటులచమూద్ధూత♦సాంద్రపరాగంబు
కరికరాసారవి♦ఘాతములను
చంద్రహారాదిభూ♦షణచంద్రికాంతులు
శూరవీరానన♦సూరరుచుల
గాయకలాసికా♦గాత్రనృత్యధ్వనుల్
భేరీమృదంగఘ♦నారవముల
సంభ్రమాయత్తస♦త్సైనికాహ్వానముల్
బృంహితహేషావి♦జృంభణముల
తే॥ గీ॥ నణఁగ నన్యోన్యభావనం♦జ్ఞాభిగతులఁ
దెలిసికొంచును సంతోష♦కలితహృదయ
మగుచు మారాజు నెను వెంట ♦ నరుగుచున్న
పౌజుఁగని పౌరజనము వి♦భ్రాంతి నొందె॥ ౧౧



ఆ॥ వె॥ ఇట్లు దారి నడువ ♦ నేర్పాటుగావించి
యేగు చున్నబలము ♦ నేకదృష్టిఁ
గావఁ జూచు చున్న♦ఘనసచివౌఘంబు
రథికగణము ప్రోయె ♦ రాజువెంట॥ ౧౨

సూర్యాస్తమానవర్ణనము.

కం॥ ఆనాఁటిపవలు సనెఁ దా
రేనాఁటికి నైన జీవు ♦ లెల్లను ధర స్వ
స్థానములు వీడి పోవుట
మానదు సు మ్మంచు నీతి ♦ మనుజులు నేర్వన్॥ ౧౩
తే॥ గీ॥ ఆఱిపోయెడునగ్ని తా ♦ నర్చివితతిఁ
గూర్మి పెంపారఁ దనలోన ♦ గుప్తపఱుచు
పగిది నత్తఱి భానుండు ♦ భానుసమితి
హితము మే లని లోనఁ దా ♦ నెంచి దాఁచె॥ ౧౪
తే॥ గీ॥ జగతి సంతాపపరుఁ డెంత♦సరసుఁ డైన
శూరుఁ డైనను నాజన్మ♦ధీరుఁ డైన
నాశ మొందక పోఁ డంచు ♦ నరులకెల్ల
బోధ చేసెడిచాడ్పునఁ ♦ గ్రొద్దు గ్రుంకె॥ ౧౫

కం॥ పుట్టుట గిట్టుటకే సుమి
కట్టడిపని చేయు టెల్ల ♦ గాసి పడుటకే
మిట్టిపడుట నష్టికె యను
నట్టుల శాంతించి మిహిరుఁ ♦ డపరాబ్ధిఁ బడెన్॥ ౧౬
కం॥ పెనిమిటి పోయిన బ్రదుకుట
వనితకు బహుకష్ట మంచు ♦ వన టొందె ననన్

దినపతి సొంపు న్వీడిచెను
ఘనపద మనునామెముఖను • కమలె న్మిపుల్॥ ౧౭

కం॥ అవనిత యూఅడిల్లఁగ
నావులు మొద లైనమృగము • లాదరణోక్తుల్
గావించెం గాకాదులు
భావంబులు దెలుపఁ దద్ద • వాపోయె వగన్॥ ౧౮

కం॥ నిండగుజవ్వన ముండిన
ముండన మెటు లాపఁ గల్గు! • ముగుదకు భావం
బుండిన రెండవపెండిలి
మెండగుసుఖమం చప్పుడు తఁమీసతి పల్కెన్॥ ౧౯

ఉ॥ గూబలు తొట్రులన్వడలెఁగూఁడులదూరె శకుంతసంతతుల్
క్లీబులఁ గూడ మన్మథశిలీముఖజాలము లేచి మీాతెఁ బ్ర
జ్ఞాబలదుష్టచేష్టితులు • జారులు సందులఁ దార సాగి రా
జాబిలి దోఁచునేనిదమ•జాడబయల్పడునంచు నెంచుచున్॥

సీ॥ చక్రవాకంబులు • సమ్మదంబును వీడఁ
గుంపుట ల్వీడెఁ జకోరకములు
వనజాతజాతముల్ • వదనముల్ ముడువంగఁ
దమముఖంబులు విప్పెఁగుముదవితతు
లిందిందిరాదులు • నందడుల్ సాలింప
నిలకోళ్ల రాగమ్ము • లెచ్చె మిపుల
ధీరు లానమయాన • భీరులై యుండంగఁ
జోరు లెల్లరుఁ జాల • ధీరు లైరి

తే॥ గీ॥ ఆకసంబునఁ గృధ్రాదు • లాడ నోక
వజినపత్రాదు లెమ్మెతో • నాడఁ దొడఁగె;



దిన మెల్లన్ భుజియించిన న్నమయని•ద్రేశంబు లేకుండ నా
జనముల్ పుష్టిని గాంత్రె! జీర్ణ మవునే! • సాదంబు
రవ్వంతయున్॥ ౨౫౩

కం॥ క్రోధము విసుగును లేకయె
బోధనలు నిదర్శనముగ • బోధితులకు నే
బోధకులు పాఠనమితిని
బోధింతురో! వారె నుమ్మి • బోధకవర్యుల్॥ ౨౫౪

కం॥ ఏయేవేళల శిష్యుల
కేయేపాఠములఁ జెప్ప • నింపవునో యుపా
ధ్యాయుండు తా నెఱుంగుచు
హాయిగ బోధించు నేని • నందు సుకీర్తిన్॥ ౨౫౫

కం॥ చెల్లెడియాజ్ఞల నిడుచు హృ
దుల్లాసకరప్రబోధ • నొగి మతివృద్ధిన్
బిల్లలకుఁ జేయుబోధక
తల్లజులం బొగడు చుండ్రు • ధరణీజనముల్॥ ౨౫౬

తే॥ గీ॥ కుమ్మరులు బంకమంటి నేఁకుండ నైనఁ
బరికరంబులచేత నేర్పఱుచునటులఁ
మృదుహృదర్భకుల సుగురుల్ • మేటిబోధ
నోపకరణాలఁ దీర్ప రే! • యోపిక మెయి॥ ౨౫౭

తే॥ గీ॥ ఒప్పరికమునఁ దా మొకఁద ప్పొనర్ప
నరసి దండించు నఁచు బాలురకుఁ దోపఁ
బాఠశాలాధిపతి ముఖభావకళలఁ
జూపుఁ జుమి; నేరుపరి వృథాఁకోపపడక॥ ౨౫౮

తే॥ గీ॥ స్వపదధర్మానుసారవ్ర•చారు లైన
యట్టిగురువులు బాలుర • కెట్టి శిక్షఁ
జేసినను గ్రోధ ముంచరు • చిత్తమందుఁ
బౌరజనులును జదివెడి•బాలకులును॥ ౨౫౯

తే॥ గీ॥ మూఢు లెవరైన నొకవేళఁ • బోర నేగు
దెంచినను 'బాలు నురక శి•క్షించితం'చు
జడుపులేక ప్రత్యుత్తరం • బిడును గాని
పిరికియొజ్జలవలె వారు • వేడఁ బోరు॥ ౨౬౦

తే॥ గీ॥ అట్టిశిష్యుల కల్లరి • కవధి సున్న
చదువునందలిఁదీపియు • శ్రద్ధ మిన్న;
కాలనిర్ణయముగ బడిఁ • గ్రాలు చున్న
వినుతవిద్యాగురులబోధ • వినుచు నున్న॥ ౨౬౧

ఉ॥ సైరణ గల్గిపాఠములు • ఛాత్రుల కెంతయువిప్పిచెప్పుచున్
వారి కదెంత నాటినదొ • ప్రశ్నల వేసి పరీక్ష సేయుచున్
ధారణశక్తి నెంచి సుఖ•దాయక మౌనటు మాటిమాటి కె
వ్వారలు బోధ సేయుదురొ • వారె సుమా! నిజధర్మ
వర్తనుల్॥ ౨౬౨

శా॥ ఆకర్షింతురు సుమ్మి బాలురు పొటో•యంత్రాళి వోలెన్
గురుం
డేకర్జం బొనరించుచుండునొ దినం • బేరీతి వర్తించునో
యాకృత్యంబుల నట్లెచేసెదరు వి•ద్యాశాలలోఁ;గావునన్
బేశాటన్ గలిసంపుమాటను వెన • స్వీడ న్వలెన్ బోధకుల్॥



మిత్రుఁ డటు పోవ; శాత్రవ•మిత్రగణము
లుండ కుండునె యెట్టిగు•ణోత్తరునకు!॥ ౨౧

కం॥ రంగత్సంధ్యాతాండవ
గంగాధరశీర్షపతిత•కంకణము లనన్
నింగిం దోఁచెం జుక్కలు
రంగుగ; నద్దెసల నంబ•రము రాజిల్లన్॥ ౨౨

కం॥ భేతాళభటులు నిద్రా
పేతు లగుచు దిక్కు లెల్ల • భేదిల జంతు
వ్రాతము భీతిల నడచిరి
ఘాతుకమృగజాతిభాతిఁ • గడుత్సుత్పీడన్॥ ౨౩

కం॥ కదుపులఁ గాసెడివారలు
ముదిసినగోవులను లేఁగ•మొద లగువానిన్
వదలి వెడల నవి జంబుక
విదళితము లగుచు శపించెఁ • బీడ నొడయులన్॥ ౨౪

కం॥ తము నేలెడునేలిక కిలఁ
దమ యోపినయటు కృతజ్ఞ•తం జూపుట న్యా
య మనుచు నీకిఁ గఱపున
ట్లు మిణుంగురుపుర్వులే వె•లుం గిడఁ దొడఁగెన్॥ ౨౫

కం॥ ఆసమయమ్మున సచివులు
శా సంతయు దారి తెలియ•క సు బలమెల్లన్
వేసరు టెంతయుఁ గని యొక
కాసారముచెంత విడియఁ•గా నియమింపన్॥ ౨౬

తే॥ గీ॥ శారదాంబుదపంక్తులఁ • గేరునట్టి
యర్జునాధిక్యశోభచే • నలరునట్టి

యంబరాలయపంక్తులు • డంబు మీఱ
భటులు నిర్మించి రెల్లెడ • భోజనముగ॥ ౨౭

ఉ॥ జీవుల నేలుటందుఁ దను•చిత్రగతి న్విహరించుటందు దు
ష్టావళిచేష్టల న్నిజభ•యంబున మాన్పుటయందు భక్తశి
ష్టావనమందు విక్రమబ•లాదులయందు స్వతుల్యుఁడంచు నా
భూవరుఁ జేరఁ బంపెను; న•భోమణి, దీపనుతాళిఁ గొల్వఁగన్॥

ఆ॥ వె॥ చిత్రభానుఁ డనఁగఁ • జిత్రభానుఁడె గాన
మిత్రభావ మెఱిఁగి • మిత్రతుల్య
భూకళత్రుఁ గొల్వఁ • బోయెనో యన్నట్లు
వాతపోతములును • వరుస వెడలె॥ ౨౯

కం॥ ఆవాతపోతనికరము
భూవిభుదేవ కేగుతఱిని • బూర్వోక్తవిధి
న్బోవఁగ రా దూరక యని
భావించుచుఁ దత్సరోజ•వారముఁ గోరన్॥ ౩౦

కం॥ «అవియు నతిథిసత్కారము
సవినయముగఁ జేయునట్టి•జాణలు గావన్
బ్రవిమలనిజసుమరజమును
రవితేజున కిం డటంచు • రమణత నొసఁగన్॥ ౩౧

ఉ॥ ఆసరసీవధూటి వసు•ధాధిపుపొం దెదఁ గోరి విందుకై
భాసురలీలఁ బిల్వఁ డని • పంచిన కైతవదూతలో యనన్
వేసము దాల్చి భూపుపట•వేశ్మము నేరిరి వాయుడింభకుల్
వేసరియెల్లసేనలను•వేగమెచూచుచుఁబాయుచొక్కెడన్॥

ఉత్సా॥ మందమారుతంబు లేగి • మార్గమందు శ్రమముచేఁ
గ్రిందుకొనినమేనిచెమట • క్రమముగా హరింప నా



సుందరంపుఁ గొలనులోనఁ • జొచ్చి స్నానపానముల్
పొందుగానుఁ జేసి హర్ష•పూర్ణులైరి తజ్జనుల్॥ ౩౩

ధర్మపాలుండు మంత్రులతో మాట లాడుట.

ఉ॥ అంతట వంటకంబులు మ•హానసరక్షకసంచయాజ్ఞలన్
శాంతిధురీణసూపజన•శౌండులు వడ్డనఁ జేసి రన్నిటిన్;
బంతులు దీర్చి యున్నఘన•బాడబబృందము ధర్మపాల భూ
కాంతుఁడు రాజబంధువులు•గాంతలునోలినిదుష్టిసాపడన్॥

తే॥ గీ॥ సకలపరివారమును గుల•సతులు హితులు
బంధువులు సుఖప్రదసర్వ•వస్తువులును
బ్రాకటంబుగఁ దనవెంట • రాఁగ భూత
లేశునకు విచారం బున్నె! • లేశమైన॥ ౩౫

తే॥ గీ॥ సకలసంపత్తు లుండిన•సమయమందు
దుర్గమాటవియందున్నఁ • దోఁచు సుఖము
నరున కందొక్కఁడేనియుఁ • గొఱఁత యున్న
సుఖము లే దన్న! మేడలోఁ • జొక్కియున్న॥ ౩౬

ఆ॥ వె॥ అలసి సొలసి నడక • నాయాసవంతులై
కాల్బలంబు లెల్లఁ • గటికనేల
నిద్దురింప భూమి•నేత కనుంగొని
సచివగణముతోఁ బ్రి•సంగమందు॥ ౩౭

ఉ॥ «కంటిరె! మంత్రులార! బహు•కర్కశశాతశిలాముఖంబులన్
మంటిని మున్నిమే నలర•మైకముతోఁబడితాఱుమాఱుగా
బంటులునిద్రవోవుటలు; •పాపము! వీరు ధనాఢ్యులైనచో
నింటనుబట్టుమంచముల•నెంతటిసౌఖ్యముగాంతురో గదా!॥

మ॥ అవురా! సుప్తిమహత్త్వ మెన్నఁ దరమే • యాగాఢపాన్నే
తకున్

గవితాజేతకు విజ్ఞధాతకు మహా•ద్రావేశజామాతకున్;
వివశత్వంబును బొందఁజేయును గదా•విశ్వంబులో మర్త్యులన్
నవభోగానుభవేష్టమానసలస•న్నానార్థులై యుంచినన్॥

చం॥ కటకట! పొట్టనింపుకొనఁ•గాఁగద! బీదలు పెక్కుపాట్లలోఁ
గుట యజమానికోపమున•కున్మదిసుక్కుచు నిద్రలోను వేఁ
గుట విధికార్యభారమునఁ•గుందుట పండఁగభోజనంబు సే
యుట కయిన న్విరామసుఖ•ముండక పోవుట దైన్య
మొందుటల్॥ ౪౦

ఉ॥ పండఁగఁ బాను పుండదు; ప్రి•వాసమొనర్చెడి సేవకాళికిన్
దిండియు వేళకుండదు సతీసుతులం గన బుద్ధిపుట్ట వీ
లుండదు కండ్లఁ గాంచుటకు;•నూరుపరస్థలమౌచు దవ్వులం
దుండుటచేతఁ గాన ముద•మొందు నుపాయ మొకప్పు
డుండునే!॥ ౪౧

తే॥ గీ॥ కఠిన మగుబీదతనము జ•గజ్జనముల
బ్రతికి నన్నాళ్లుఁ బీడించు•బహువిధముల
దానికంటెను మృత్యువే•తగినదౌను;
గడకు నొకసారె బాధించుఁ•గాన; ధరణి॥ ౪౨

ధర్మపాలుఁడు రాజ్యపాలనము నరకహేతు వనుట.

ఆ॥ వె॥ పరిజనంబు నిట్లు•బాధించు మంచును
దుష్టజనము నట్లు•దున్ము మంచు
ఫాలభాగమందు•బంతులు మూఁడింటి
వ్రాసి పంపె నన్ను•వసుధకు విధి॥ ౪౩



కం॥ హంత లగుభూపులకు రా
జ్యాంతే నరకంధ్రువ మ్మ•టంచును శ్రుతులున్
సంతతము వల్కఁగద దృ
ష్టాంతం బొందేల! మంత్రి•సత్తములారా!॥ ౪౪

ఆ॥ వె॥ దానఁ జేసి తుదకు•ధర్మపదం బెట్లు
దక్కఁ జెప్పుఁడి! నాకు•నిక్కవముగఁ;
బ్రభుసమూహములును•నిభవైరితతులును
మెత్తఁబడిన భువిని•మెలఁగ నౌనె!॥ ౪౫

కం॥ భూజను లెల్లరు నొక్కక
రోజం దమబొజ్జ పూడ•నుంకించునటుల్
భోజనమునకై రాజ్యము
రాజులు పాలింత్రి గాదె!•రవివిక్రములై॥ ౪౬

కం॥ పూడును గోఁతులు నూఁతులుఁ
బూడుం జెఱువులును నదులుఁ•బూర్ణాంబుధులున్
బూడఁగ నుద్యోగించినఁ
బూడదు మనకడుపుబిలము•పొలియుకదనుకన్॥ ౪౭

కం॥ పూజ్యశ్రీగౌరవసా
మ్రాజ్యాధికులైన రత్న•మణిభర్మాదుల్
భోజ్యములని తిందు రొకో!
భోజ్యాన్నము శాకపాక•ముం బలె నర్థిన్!॥ ౪౮

కం॥ నశ్వరభూతి నెఱుంగక
విశ్వంభర నెల్ల బాహు•వీర్యోన్నతిచేన్
శాశ్వతమం చేలినచో;
శశ్వత్పీడాప్తు లౌట•సత్యము గాదే!॥ ౪౯

ఆ॥ వె॥ జనులు శక్తికొలఁది • సాధించి నేర్చిన
కోటివిద్య లెల్లఁ • గూటికొఱకె
గాక తుదకుఁ బుచ్చు•పోక నొక్కటి నైన
వెంటఁ బెట్టుకొనుచు • వెళ్లఁ గలరె!॥ ౫౦

ఉ॥ కావున మంత్రులార! మమ•కారముదప్పియకారణంబుగా
భావమునందు రాజ్యపరి•పాలన సేయుట కిచ్చ లేక యి
ద్దేవనిలోనొ మౌనము వ•హించి తపశ్చరణం బొనర్పఁగాఁ
బోవుట మేలటంచు వెసఁ•బుట్టెవిరాగ మదేమి హేతువో’॥

సచివాగ్రణి పరిశ్రమలాభంబు సెప్పుట.

చం॥ అనవుడుఁ బల్కె నిట్లు సచి•వాగ్రణి నైజకళావిధేయుఁ డై
‘కనకపురీశ! విన్నపము • గైకొనుఁడీ సదయార్ద్రదృష్టులై
మనభటు లెల్ల దారిని శ్ర•మంపడి నేలఁబరుండ నిత్తఱిన్
గనుటయె పెద్దకారణము; • గాక మఱొక్కటి మూల
మున్నదే!॥ ౫౧

ఆ॥ వె॥ కష్టపడినజనులు • గాంచరే సుఖనిద్ర!
శిలల నైనఁ బూల•సెజ్జ నైనఁ
గాయదార్ఢ్యసుఖము • గాఢనిద్రాసుఖం
బొందుచుండ్రు వారె • యుర్విగోప!॥ ౫౨

ఆ॥ వె॥ గాలిసౌఖ్య మన్నఁ • గష్టజీవి కెఱుక
ముక్తిసౌఖ్య మన్నఁ • మునికె యెఱుక
దానసౌఖ్యమన్న • దాతకే యెఱుకగుఁ;
గాని యొరుల కెట్లు • గాంచ నౌను!॥ ౫౪

ఆ॥ వె॥ అందఱకిని జూడ • నారోగ్యభాగ్యంబె
మొదటిభాగ్య మౌను • ముద మొసంగ



నద్దిలేనిమర్త్యుఁ • డర్థవంతుం డైన
హాయిఁ జెంద లేక • నాధి నొందు॥ ౫౫

కం॥ ఆరోగ్యహీనధనికుఁడు
క్షీరాన్నము నైనఁ ద్రోయుఁ • జేఁ దని; భువిలో
నారోగ్యభాగ్యభృతకుఁడు
క్షీరాన్నం బంచు గంజిఁ • జేరల జుఱ్ఱున్॥ ౫౬

కం॥ రోగి సుఖదసౌధాంత
ర్భాగంబునఁ బూలసెజ్జ•పైఁ బండినఁ దా
లోఁ గుందుట వీడు నొకో!
రోగాపేతులె సుఖింతు•రుగ లోష్టములన్॥ ౫౭

తే॥ గీ॥ మఱియు బీదజనము లొడల్ • మఱచి నిద్ద
రింప నొందు కారణ ముండె • నిద్ధచరిత!
వమ్ము గా దంచుఁ గోపమ్ము • వడయ వేనిఁ
బలుకఁ గలవాఁడ నం’ చిటు • పల్కె నతఁడు॥ ౫౮

తే॥ గీ॥ ‘బ్రహ్మసృష్టింప నాఁడు ని•ద్రావధూటి
నిజవరుల్ బీద లని వారి•నెలవు సేరె;
దేవవరు లనాదరవరుల్ • భూవరులును
భూసురవరులు సోమరి•పోతు లంచు॥ ౫౯

ప్రభుత్వఫలము.

కం॥ ‘రాజ్యాంతే నరక మ్మను
రాజ్యవన మేల!’ యని వి•రాగు లయినచో
రాజ్యాధినాథు లెల్లరుఁ;
బూజ్యంబులు గావె! పూజ్య•పూరుషసుఖముల్॥ ౬౦

కం॥ కుక్కలఁ ద్రొక్కుడిగాఁ బ్రతి
పక్కణమునఁ బట్టణమునఁ ♦ బ్రజలందఱిలో
నుక్కరు లొక్కట నుక్కునఁ
దక్కిన జనధనము గొనఁగఁ ♦ దాడి వెడలరే!॥ ౬౧

కం॥ బలహీనుల ధనహీనులఁ
గులహీనుల భూమిపాల ♦ కులు గావనిచోన్
గలదాని ననుభవింపం
గలరే; కారుణ్యహీన ♦ ఖలదౌష్ట్యములన్!॥ ౬౨

ఆ॥ వె॥ రమణుఁడేల కున్న ♦ రమణిజీవన మేల!
రాజు గావ కున్న ♦ రాజ్యమేల!
సర్వపూజ్యశీల! ♦ సౌజన్యపరిపాల!
ధర్మకార్యలోల! ♦ ధర్మపాల!॥ ౬౩

ఉ॥ భూపతు లంతరంగమున ♦ భూరికృపాంబుధులై చుదుస్థితిన్
మాపఁగఁ బూని యంతకన ♦ మానవరాశ్రిము లొచు నిత్యమున్
రూపఱి సేయు చుండ్రు పర ♦ రూపములన్; బరలోకసౌఖ్యముల్
లోపము సెంద కుండ నిది ♦ లోపమె వారికి! లేక; కోపమే!॥

ఉ॥ తేలు జనాళి మీట నటఁ ♦ దీవులు మెండయి మాను మెల్లనన్
వ్యాలము కాటు వేయఁ దమ ♦ ప్రాణము వాయుదు రద్దినంబునన్
గూళ్ళ యొనర్చు ఘోరతర ♦ కుత్సితచేష్టల నందుచో మహా
త్కాలము బాధనొందుట యె; ♦ గాక తదీయకులంబు జేడ్పడున్



కం॥ దుష్టజనఖండనంబును
దుష్టమృగాచ్ఛేదనంబు ♦ గోష మవునె! భూ
విష్టపరక్షణవదన
చ్చేష్టాకరు లైనరాజ ♦ సింహుల కరయన్॥ ౬౬

కం॥ జాలిపడి సేవకాళికి
నేలిక పని సెప్ప కెల్ల ♦ కృత్యము లతఁడే
వేళం జేయుచు నుండినఁ
బోలుం జుమి! కుక్కబదులు ♦ మొఱిగిన రెడ్డిన్॥ ౬౭

కం॥ తనభావము దననెనరును
జనపతి మన సిచ్చి తెల్పు ♦ చనవరి యైనన్;
గనఁ జాలఁడు నిజగౌరవ
మును బరిచర్యలును; భటులు ♦ మూఢులు గానన్॥ ౬౮

కం॥ లోకమునకుఁ బీడ సలుపు
రాకాసులఁ దునుమ లేదె! ♦ రాముఁడు హరి; త
త్ప్రాకారుఁ డయ్యె; భూమిని
సాకారుండౌచుఁ బుట్టి ♦ జగతీనాథా!॥ ౬౯

కం॥ వినుటకుఁ జెవులే గా కిలఁ
గనుటకు నేత్రములు లేవు ♦ తప్పుల' కంచున్
జను లాడెడుపరుషోక్తుల
విని చింతం బొంది తేమొ! ♦ వినుమీ! రాజా!॥ ౭౦

కం॥ గుఱ్ఱెద్దు చేనిలోఁ బడి
యొడ్డుం గన నేరనట్టు ♦ లుండక రాజుల్

బిడ్డలవలెఁ దమప్రజల న
సడ్డం జూడకయ ప్రోది ♦ సల్పుచు నున్నన్॥ ౭౧

కం॥ న్యాయాన్యాయవిచక్షణ
శ్రేయస్సంధానబుద్ధిఁ ♦ జిరకీర్త్యర్థిన్
న్యాయైకదృష్టి జనహ్రా
ద్ధ్యేయుం డై రాజ్యభూమి ♦ నేలుచు నున్నన్॥ ౭౨

కం॥ తగువారల నారయుచుం
దగుపనుల న్వారిఁ జొన్పి ♦ తగుభృతి నిడుచున్
బొగరునఁ దమపై కడ రెడు
పగఱం బలశౌర్యయుక్తిఁ ♦ బరిమార్చినచోన్॥ ౭౩

కం॥ పరిపాలనమున జను లిడు
మొఱలను సాదరణబుద్ధి ♦ ముదముఁగ వినుచున్
గరుణాకలితుం డనఁగం
బరఁగి రహస్యమ్ము లెఱిఁగి ♦ పాలించినచోన్॥ ౭౪

కం॥ నేరము చేసినజనముల
నారసి నిజ మెఱిఁగి దండ♦నార్హు లు వీరల్
వార లనర్హు లటంచు వి
చారణబలకుశలమతిని ♦ శాసించినచోన్॥ ౭౫

కం॥ ఆతఁడె ప్రత్యక్షేశుం
డాతఁడె భూలోకదేవుఁ ♦ డాతఁడె శమనుం
డాతఁడె తల్లియుఁ దండ్రియు
నాతఁడెసూ! లోకపూజి♦తాధిపుఁ డనఘా!॥ ౭౬



తే॥ గీ॥ అట్టినీబోఁటివిభున క ♦ దెట్టు గల్గు
గిట్టుపిమ్మట నరకంబు! ♦ వట్టిమాట
కిట్టు లూరక చింతించి ♦ నెట్ట నేల!
దిట్టతనము రాచరికపుఁ♦గట్టుపాటు॥ ౭౭

ఉ॥ భూపతి రాజ్యముం దనదు♦పుత్త్రునకుం దగ నిచ్చి వృద్ధుఁడై
తాపసవృత్తి నేవనినొ ♦ తాల్మివసింపఁగ నిశ్చయించుటల్
పాపముగాదు; గాని యిది ♦ పాపముకాదెధరావరేంద్ర! నీ
పావఁడు పుట్టకుండఁ బరి♦పాలనభారము రోసి పోవుటల్!॥

ఉ॥ దారకు బంధుసంతతికిఁ ♦ దక్కు-జనాళికిఁ బట్టుకొమ్మవై
కోరిక లెల్ల సంతతము ♦ గూర్చుచు నీవుల మానువోలె న
మ్మారయుచుండి నేఁడిటుభ♦యప్రదవాక్ప్రదరంబు లేసిహ్రా
ద్దారణకృత్యము న్నెఱప♦ధర్మమె? నీ కిది పుణ్యకర్మమే?॥

మ॥ తనచే రక్షణ మొందు చుండుస్వజనుల్ ♦ దైన్యంబునం
బెగ్గిలన్
ఘనకార్యాచరణం బ టంచుఁ దనరొం♦క్కం బంతయుం
గోలుపో
యిన మూఢుండు, నఖర్వరాజ్యమును బా♦లింపన్ భయం
బంది కా
ననముం జేరఁగఁ జూచుభూపతియుఁ బు♦ణ్యాం బంద రిం
తేనియున్॥ ౮౦

తే॥ గీ॥ ఎంత సెప్పిన వినక నీ♦స్వాంతమందుఁ
బంత మొంది రాజ్యము సన్య♦సింతువేని;
సన్యసింతురు నీసతుల్ ♦ సాహసమున
సన్యసింతురు బందుగుల్ ♦ సైనికులును॥ ౮౧

తే॥ గీ॥ ఇట్టిదుర్వార్తలోకంబు • ముట్టడింప;
ముట్టడింతురు దేశముం • గట్టిఁడిన్నృపు
లట్టిచెట్టల కోర్వలే • కెట్టు లైన
గిట్టు జనము; తదఘము నిన్ • జుట్టుకొనఁగ॥ ౭౨

తే॥ గీ॥ స్వల్పకష్టంబు లోరులకు • సంభవింప
సైఁప లే నని మూర్ఛిల్లు•సదయమతివి
గుండె లాడక జను లెల్ల • గొల్లు మనఁగ
నెట్లు రాజ్యంబు విడనాడి • యేగు దోకొ!॥ ౭౩

తే॥ గీ॥ పాపలేశం బొనర్ప సాధ్వసము నొందు
వాఁడ వెటు చేసెదో యట్టి•పాతకమును!
పౌరజనదుర్దశయు మాయ•భాగ్య మిట్లు
నీకుఁ దోఁపించెఁ గాఁబోలు • నెనరు వాపి!'॥ ౭౪

సచివాగ్రిణిని రాజు మెచ్చుకొనుట.

చం॥ అనవుడు ధర్మపాలుఁడు; దయారసదృష్టులతో నమాత్యవ
ర్యునివదనంబుగాంచియను•నోసచివోత్తమ! నైజమేగదా
మనుజులకెందుడెందముల•మన్న్యవుసెందుట;కల్మషాకృతిఁ
గనునెడ, నిర్మలత్వమును • గాంచిన; సంతస మొందు
చుండుటల్॥ ౭౫

ఉ॥ ఉత్తమబోధనాక్రమసు•ధోక్తులచేఁ దొలఁగించి తీవు సు
మ్మిత్తఱి నాదుచిత్తమున • నేచినతత్తఱపాటునెల్ల నీ
బత్తికి బుద్ధిశుద్ధికిని • భవ్యచరిత్రకు దీ టెవండు! నీ
పొత్తుననున్నవాత్తదొకొ! •పుణ్యము! ధీసచివాగ్రిణీ! గుణీ!



కం॥ కరికిఁ గర మట్లు ధరణీ
వరునకు ధీసచివుఁ డంచుఁ • బ్రజ లాడెదునా
పరమోక్తులు సత్యము లని
సరిపోయెను నాదుమదికి • సచివవరేణ్యా!॥ ౭౬

ఆ॥ వె॥ సకలశాస్త్రసమితిఁ • జదివినవాఁ డైన
ధీరుఁ డైనఁ గర్మ•శూరుఁ డైనఁ
జిత్తవృత్తిరీతి • సత్తుగా దని విచా
రింపనిదె శుభము లఁ•భింపఁ గలదె!॥ ౭౭

తే॥ గీ॥ దూరభారప్రయాణవి•చారమునను
క్రొత్తనెత్తావు లొత్తంగ • మెత్తఁబడియు
చెందె నాడెంద మిం దెంతొ • కొందలంబు
సెప్ప లే నాకతంబు స•చివవరేణ్య!॥ ౭౮

ఆ॥ వె॥ అక్కటంబువలన • నాధునికారంభ
విస్మృతుండ నౌచు • వినెడిమీరు
విసువు నొంది కంద • వెడమాట లాడితి
మంత్రిలార! బుద్ధి•మంతులార!॥ ౮౦

కం॥ విసరు గలతలువులం బలె
వెస తెప్పలు వ్రాలు చుండె • వినుఁడి మన మిఁకన్
మసలక పరుండఁగాఁ దగు;
నిసి యయ్యె న్గాన నాదు•నెచ్చెలులారా!'॥ ౮౧

ఆ॥ వె॥ అంచుఁ బలికి మంత్రు • లందఱితో రాజు
పయనమునకు సులువు•బలువు లెల్ల

ముచ్చటింప వారు ♦ ముదముతో వాన్రిచ్చి
ముదల నంది ననిరి ♦ నిదుర నెంద''॥ ౯౨

తే॥ గీ॥ ఇట్లు వరవిద్యాఖ్యుండు వ♦చింప సంశ
యాళుఁ డగ్గె నెఱిఁగి ''యోద♦యామయేంద్రి!
పిదప మీరాజుగారెట్లు ♦ వెడలినారొ
వినఁగ వేఁడితి'' నన నతఁ ♦ డనియె నిట్లు॥ ౯౩

కాశీగోపురవర్ణనము.

కం॥ ''హాయిగ నెల్లరు నిద్దుర
పోయిరి సరసీతటమునఁ ♦ బూర్ణామోద
శ్రీయుతపద్మానిలసౌ
ఖ్యాయత్తమనస్కు లౌచు ♦ నారాతి రటన్॥ ౯౪

కం॥ తూరుపు తెలతెలవాఱఁగ
బోరన మేల్కాంచి ధర్మ♦భూపాలాజ్ఞా
సారధరం బై సేనా
వారము కదలెఁ బ్రయాణ♦వాంఛ చిగుర్పఁ॥ ౯౫

కం॥ చుక్కలఁ జుక్కలతేఁ డనఁ
జక్కనిరథ మెక్కి రాజు ♦ భూసురబృందం
బొక్కెడ దీవన లిడ నిరు
ప్రక్కల మంత్రులను గూడి ♦ పయనం బయ్యెన్॥ ౯౬

ఆ॥ వె॥ అటు కతిపయదినము ♦ లరుగుదెంచుచు శ్రీమ
క్రిందుకొనిన, విసువు ♦ నొంద కుండ
సాగి పోవు చంద్రు; ♦ సైనికు లుత్సాహ
వంతు లౌచు భూరి♦దాంతు లౌచు॥ ౯౭



తే॥ గీ॥ అంత నొకనాఁడు దృష్టికి ♦ వింత గొల్పు
ధవళకాంతులు దశహరి♦దంతములకుఁ
గాంతు లిడఁగఁ జాలినచంద్రి♦కాంతనూత్న
రత్నమణిమయ మగుగోపు♦రశిఖరంబు॥ ౯౮

తే॥ గీ॥ కానిపింప వా రట హర్ష♦కలితు లౌచు
నంచితాకారసౌందర్య ♦ మెంచి మించి
పూనుకొని రిట్లు నుతిసేయ ♦ మానసముల;
విస్మయం బొంది తెలి వొంది ♦ విజ్ఞమతులు॥ ౯౯

ఉ॥ ''పచ్చనివర్ణవర్ణముల ♦ భావిభవాఢ్యశుకాళిదంపతుల్
ముచ్చటలాడుచుండెఁదమ♦ముక్కలజెక్కలురాచుకొంచహా!
పొచ్చెము లేనిద్వంద్వజన♦పూర్వభవాధికపుణ్యభాగ్య మే
మెచ్చగు! వానికన్నముద ♦ మెచ్చెడు నెచ్చెలి చూడు
మాదెసఁ!॥ ౧౦౦

కం॥ సోపానావళి దివి కది
కాపుర మాఁ బావురముల♦గములకు వన్నెల్
చూపులకు వేడ్క నిడు నా
గోపురరాజంబు గంటె! ♦ గుణమణిభరణా!॥ ౧౦౧

కం॥ చూచినమాత్రన మర్త్య
ప్రాచీనాఘంబు లెల్లఁ ♦ బాయును శుభవ
ద్రోచిష్ణుగోపురాగ్రము
సూచితె! చెలికాఁడ! మేటి♦జోదులతేఁడా!॥ ౧౦౨

తే॥ గీ॥ శిల్పకారుల నేర్పు ప్ర♦సిద్ధిపఱుచుఁ
జిత్తవిభ్రాంతి గొల్పు నా♦చిత్తరువులు

కలితజీవప్రతిమ లనన్ • గ్రాలు చుండె
రకరకంబులుగా గోపు•రమునఁ గనుమ!॥ ౧౦౩

కం॥ కాపోతశాబకంబులు
బాపురె! శుకపోతములు స•పక్షంబులు గా
కేపగిదిఁ దల్లిదండ్రులు
మే పిడ నెదఁ గోరి సేరి • మెలఁగునొ గనుమా!॥ ౧౦౪

ఆ॥ వె॥ పావురా లెలమి గుఁబాళించుచుం బంతిఁ
గట్టఁబడినరీతి • గవనుమెట్ల
నోలిఁ దిరుగు మలఁగు • నోగిరం బగుగువ్వ
రాల మెక్కు సహజ•లీల నిక్క!॥ ౧౦౫

శా॥ గూఁడు ల్గట్టుకొనంగ లే వనుచునో • కూర్మి న్నివన్ హాయిగాఁ
బాడున్; గీ డొనరింప వేరి కనియో • పంచాస్త్రుఁ డొ పచ్చవి
ల్కాఁ డెక్కం దగువాజులం చనియొ స•త్కార్యంబటం చెంచియో
చూడ న్నింతగఁ గూర్చె శాకముల క•చ్చో; గోపురం బెవ్వఁడో!'॥ ౧౦౬

ధర్మపాలుండు, కాశీపురంబు చేరుట.

కం॥ అను చటు పరిపరివిధముల
ననుకొం చరుదెంచువార • లట నొకపాంథున్
గని, దాని నడుగ, నాతం
డనెఁ 'గాశీనగరగోపు•రాగ్రం బించున్'॥ ౧౦౭



కం॥ అంతట సైనికు లెల్లరు
సంతోషస్వాంతు లౌచు • సంరంభమునన్
గొం తెత్తి పాడఁ దొడఁగిరి;
'గాంతుము నేత్రోత్సవముగఁ • గాశి నిఁ'కంచున్॥ ౧౦౮

తే॥ గీ॥ వాహినీతతి వాహినీ•పతినిబలెనె
వాహినీతతి సంధించె • వారణాసి
సాంద్రభీమాటవుల నెల్ల • సంతరించి
శైలతటమార్గముల మించి • సంతసించి॥ ౧౦౯

కం॥ 'జనములు గమ్యస్థానము
గనుఁగొనునపు డొందుసుఖము•కంటె మ రెందున్
గనఁ జాల రధికమం'చని
జనపతి సంతోషపూర్ణ•జలధిన్ మునిఁగెన్॥ ౧౧౦

కం॥ అటు సని యట బహువిధపట
కుటీరములు దమకుఁ బ్రభున•కుం దగువీ లౌ
నటు లేర్పఱచిరి సవిటప
వటవృక్షాచ్ఛాదితోర్వి • వసియింప భటుల్॥ ౧౧౧

కం॥ బలుశాఖాలంకృత మై
పలుఁవులుగులు విడియ నాట•పట్టయి నలుది
క్కులకడలు ముట్టుచు వియ•
త్తలము న్ముద్దాడు చున్న•దా! యనునట్టుల్॥ ౧౧౨

చం॥ పెరిఁగినయట్టిగొప్పవట•వృక్షముక్రింది గుడారుబంతులన్
దెరువరు లెల్ల వెండిమల•దీధితులంచు భ్రమించి సూచి య
చ్చెరువు గరమ్ము సెందితమ•చేతములన్నుతిచేసికొంచు దా
రరుగుదు రెట్లొ కట్టకడ•క య్యెడచిత్రము లేమి సెప్పుదున్!॥

కలితజీవప్రతిమ లనన్ • గ్రాలు చుండె
రకరకంబులుగా గోపురమునఁ గనుమ!॥ ౧౦౩

కం॥ కాపోతశాబకంబులు
బాపురె! శుకపోతములు సంపతంబులు గా
కేపగిదిఁ దల్లిదండ్రులు
మే పిడ నెడఁ గోరి సేరి • మెలఁగునొ గనుమా!॥ ౧౦౪

ఆ॥ వె॥ పావురా తెలమి గుంబాళించుచుం బంతిఁ
గట్టఁబడినరీతి • గవనుమెట్ల
నోలిఁ దిరుగు మలఁగు • నోగిరం బగుగువ్వ
రాల మెక్కు సహజలీల నిక్కు!॥ ౧౦౫

శా॥ కూఁడు లట్టుకొనంగ లే వనుచునో • కూర్మి న్నివన్ హాయిగాఁ
బాడున్; గీ డొనరింప వేరి కనియో • పంచాస్త్రుఁ డౌ పచ్చవి
ల్కాఁ డెక్కం దగువాజులం చనియొ సంత్కార్యంబటం చెంచియో
చూడ న్వింతగఁ గూర్చె శౌకముల కంచోప్చ్; గోపురం బెవ్వఁడో!'॥ ౧౦౬

ధర్మపాలుండు, కాశీపురంబు చేరుట.

కం॥ అను చటు పరిపరివిధముల
ననుకొం చరుదెంచువార • లట నొకపాంథున్
గని, దాని నడుగ, నాతం
డనెఁ, 'గాశీనగరగోపు•రాగ్రం బ'ంచున్॥ ౧౦౭



కం॥ అంతట సైనికు లెల్లరు
సంతోషస్వాంతు లౌచు • సంరంభమునన్
గొం తెత్తి పాడఁ దొడఁగిరి;
'గాంతుము నేత్రోత్సవముగఁ • గాశి నిఁ'కంచున్॥ ౧౦౮

తే॥ గీ॥ వాహినీతతి వాహినీ•పతినిబలెనె
వాహినీతతి సంధించె • వారణాసి
సాంద్రభీమాటవుల నెల్ల • సంతరించి
శైలతటమార్గముల మించి • సంతసించి॥ ౧౦౯

కం॥ 'జనములు గమ్యస్థానము
గనుఁగొనునపు డొందుసుఖము•కంటె మ రెందున్
గనఁ జాల రధికమం'చని
జనపతి సంతోషపూర్ణ•జలధిన్ మునిఁగెన్॥ ౧౧౦

కం॥ అటు సని యట బహువిధపట
కుటీరములు దమకుఁ బ్రభున•కుం దగువీ లౌ
నటు లేర్పఱచిరి సవిటప
వటవృక్షాచ్ఛాదితోర్వి • వసియింప భటుల్॥ ౧౧౧

కం॥ బలుశాఖాలంకృత మై
పలుపులుగులు విడియ నాట•పట్టయి నలుది
క్కులకడలు ముట్టుచు వియ
త్తలము న్ముద్దాడు చున్నదా! యనునట్టుల్॥ ౧౧౨

చం॥ పెరిఁగినయట్టిగొప్పవట•వృక్షముక్రింది గుడారుబంతులన్
దెరువరు లెల్ల వెండిమల•దీధితులంచు భ్రమించి సూచి య
చ్చెరువు గరమ్ము నొందితమ•చేతములన్నుతిచేసికొంచు దా
రరుగుదు రెట్లొ కట్టకడ•కయ్యెడ చిత్రము లేమి సెప్పుదున్!॥

కం॥ ఆనాఁడు సచివభటభూ
జానిప్రభృతు లట నడక • శ్రీమ వాయఁగ నా
స్థానముల విడిసి కాంచిరి
పానీయాహారశయన • పరమసుఖంబుల్॥ ౧౧౪

కం॥ మఱునాఁ డుదయంబున వా
రరిగిరి గంగానదీజ • లాప్లవకేళీ
నిరుపమవిహారణలోలతఁ;
ద్వరసేయుచు నొకని నొకఁడు • దద్దయుఁ బ్రీతిన్॥"

ఆ॥ వె॥ అనఁగ సంశయాళుఁ • "డతికరుణోపేత!
వీతశత్రుజాత! • పూతచరిత!
విష్ణుపదిచరిత్రి • వినిపింపు మ"ని వేఁడఁ
బరవిదుండు నలరి • పలికె నిటుల॥ ౧౧౬

గంగానదీవర్ణనము.

ఆ॥ వె॥ "అమరపూజిత యగు • నాజాహ్నవిం గని
వినుతి సేయఁ దరమె • విశదముగను!
వాగ్విశారదుఁ డగు • వాణీశునకు లేక
భోగిపతికి నైన • బుధవిధేయ!॥ ౧౧౭

ఆ॥ వె॥ 'విష్ణుపదిని గన్న • విన్నఁ దిన్ననిబత్తి
జలము బొట్టు గొన్న • సలిలకేళి
కొక్కమాఱు సన్నఁ • బక్కిడాల్వేలుపు
పాపి కైనఁ గూర్చుఁ • బరమపదము'॥ ౧౧౮

కం॥ అనిపలుకుదు రార్యులు నిజ
మనముల బహువినుతి సేసి • మాధవశుభవ



జ్జనిత మనుజదోషనగా
శని సర్వధునీపవిత్ర • శంకరభరితన్॥ ౧౧౯

ఆ॥ వె॥ కాన దానిచరితఁ • గలనేర్పుకై వడిఁ
జెప్పఁ బూనినాఁడఁ • జిత్తచలన
మింత లేక విను త • దేకాగ్రనిష్ఠమై"
యనుచుఁ దీర్ఘజనుల • వినుతిఁ జేసి॥ ౧౨౦

తే॥ గీ॥ "అట్లు స్నానార్థమై వార • లరుగునపుడు
రంగదుత్తుంగభంగముల్ • నింగి ముట్టు
భంగి నుప్పొంగి పాఱెడి • గంగపొంగు
వేగముఁ గాంచి యద్భుతా • వేశు లైరి॥ ౧౨౧

తే॥ గీ॥ తొలుతఁ గన్నవారలనుండి • దుహిత తాను
పసుపు కుంకుమ వడిఁ దాల్చి • భర్త కడకు
నరుగునటు యాత్రికు లొసంగు • నఖిలవస్తు
వులను గొని పోవు చుండె నం • బుధికి గంగ॥ ౧౨౨

తే॥ గీ॥ అత్తటిని, స్వచ్ఛజలబింబి • తాంబరమునఁ
గోఁచె; నీలాంబరము దాల్చు • తొయ్యలిగతి
నందు సంచారములు చేయు • నప్సరములు;
తోడ నుండెడిసఖులుగాఁ • దోఁచె మిగుల॥ ౧౨౩

కం॥ అత్తింటికి నరిగెడుముద
మత్తఱిఁ బుట్టింటి విడెడు • నాచింతయుఁ ద
చ్చిత్తమున నొక్కసారిగ
హత్తిన వనురీతిఁ బొల్చు • నలనుడులగతుల్॥ ౧౨౪

సీ॥ శివశివా యనుదివ్య • రవ మొనర్చుచుఁ గొంద
ఱావల మజ్జన • మాడుచుండ

హరహరా యనుమంగ • ళారావములఁ గొంద
ఱొకచెంప బత్తిమై • నోలలాడ
భవభవా యనుభవ్య • పదశబ్దములఁ గొంద
ఱింకొకదిక్కునఁ • గుప్పింకు లిడఁగ
మృడమృడా యనుశుభా • మ్రేడితస్తుతిఁ గొంద
ఱాప్లావ మొకదెస • నాచరింప

తే॥ గీ॥ భక్తు లుపాంగి యొక్కచోఁ • బాడుచుండ
స్వస్తి, పనస, జటాదుల • శ్రవణపర్వ
మొనరఁ జేయుభాగీరథిఁ • గనినప్రజకుఁ
గనులపండు వయ్యె ననుట • ఘనమె! సెపుమ! ॥ ౧౨౫

ఉ॥ 'జీవుల కెల్లమూల మగు • జీవన మిచ్చెడి జీవనంబులన్
బావన మొందఁ జేయు మని • ప్రాణులు వేఁడఁగ, విష్ణుపాదభూ
శైవలినీసమాఖ్య మెయి • క్ష్మాతలముం దగఁ జేరి కామినీ
భావముతో సరిత్పతిని • భావజకేళిని దేర్పఁబోయెడున్॥

చం॥ దివమును వీడినందుననొ • దేవనదం బనుఖ్యాతిచేతనో
శివకరవిష్ణుపాదసర • సీరుహయుగ్మమునందు మంగళో
ద్భవమును గాంచినందుననొ • తక్కినకాలము లందుకంటె వే
సవి నిది స్వచ్ఛనీరమును • సత్వరపూరముఁ దాల్చి పాఱెడున్!'॥ ౧౨౭

కం॥ అని యిట్లు కొంద ఱనుకొన
ననుకొనెదరు తీర్థవాసు • లటఁ గొంద ఱిటుల్



'ఘననీహారకలితశ్రీ
తనగజ వేసవి నడరదె! • తరణికరాప్తిఁ'॥ ౧౨౮

తే॥ గీ॥ హిమముచేఁ బుట్టుకతన నే • విమలజలము
దీన నీమండు వేసవిన్ • దినదినాభి
వృద్ధి గాంచుచు సంపూర్ణ • వేగమునను
బాఱుచుండు నిశ్లేనది • పాఱు భువిని!'॥ ౧౨౯

తే॥ గీ॥ 'కాదు కాదండి మీ రను • కారణంబు
నిజవిమర్శకశాస్త్రజ్ఞ • నిపుణమతులు
పలుకువాక్యంబు లెల్లను • వమ్ము లౌనె!'
యంచు మరికొందఱిట్టు • లనిరి వినుమ॥ ౧౩౦

హిమవచ్ఛివసంవాదము.

ఆ॥ వె॥ 'నాకవాసము విడి • నాగలోకము సేర
దీక్షఁ గోడ మిపులఁ • దివురుగంగ
హాగుఁడు కరుణ నుత్త • మాంగంబునం దాల్చి
ధాత్రి జీవకోటి • దాహ మార్చ॥ ౧౩౧

ఆ॥ వె॥ ధరణి కేగి తనశ్వ • శురుఁ డైనహిమవన్న
గేంద్రుఁ జూడ వాని • యింటి కరుగ
నాతఁడును శివునకు • నభిముఖుం డై వచ్చి
కుశలవార్త లడిగి • కూర్మి మీఱ॥ ౧౩౨

ఉ॥ పిమ్మట నర్ఘ్యపాద్యములఁ • బ్రీతి నొసంగి యొసంగి విందునున్
సమ్మదసత్ప్రసంగరతి • సల్లపనోన్ముఖుఁ డై తదీయశీ
ర్షమ్మున నున్నయౌవనసు • సంభ్రమగంగను జూచి వేగఁ ద
త్సమ్ముఖుఁ డై విచిత్రము న • సమ్మతియున్ మదిఁ గల్గ నొక్కటన్

ఉ॥ 'ఏకసతీవ్రతుండ వని ♦ యిద్ధచరిత్రపవిత్రదేవతా
నీకమ్మార్చితుండు వని ♦ నెమ్మది నమ్మి మదీయకన్యకన్
బ్రాకటనైభవోన్నతివి♦వాహ మొనర్చితినాఁడు శంకరా!
శ్రీకర! నీకు; నేఁ డిటులు ♦ సేయుట న్యాయమె? లోక
గేయమే?॥ ౧౩౪

ఉ॥ ఎండకు వాన కోర్చియొడ♦లెంతయు నెండఁ దపంబునిష్ఠమై
మెండుగఁ జేయ నాసుతను♦ మెచ్చవు మున్బహువత్సరాల; కీ
ముండ నెటుల్ వరించితివొ! ♦ మోహముఁ జెందఁగ మచ్చుఁ
జల్లెనే!
భండనఖండితాసుర! ప్ర♦పంచము నం దిటు లుండ్రుగా
జనుల్॥ ౧౩౫

మ॥ తనపాదమ్ముల నిల్పుకొంచు మదిలో♦ధ్యానింపనీ నిత్యమున్
దనుదైవం బని నమ్మి పూజ లిడనీ ♦ ధర్మం బనుష్ఠింప నీ
జననింద్యంపు నిజేశ్వరీచరిత లే♦శం బేని భావింపకే
నన విల్కానికి లోఁగియే చెడిపనై♦నన్నెత్తిపైఁ దాల్చెదున్!'॥

తే॥ గీ॥ అనుడు జామాత మందహా♦సాననమున
'మామ! కేచ్ఛను వినుమ! హి♦మాద్రి! మామ!
పొంగి బలిసద్మమున కేగఁ ♦ బోవు గంగ
జటల ధరియించి నాఁడ నీ♦జ్జగతిఁ గావ॥ ౧౩౬

తే॥ గీ॥ కొడుక యొక్కింత సేయ నీ♦కూఁతున కెవు
డిందు సందేహ మేదైన ♦ నెడఁద నున్నఁ
జెప్ప వేఁడెద భవదాజ్ఞఁ ♦ జేయువాఁడ'
నంచు శపథంబుగా శంభుఁ ♦ డన నతండు॥ ౧౩౭



తే॥ గీ॥ 'గంగ నాచేత జననంబు ♦ గాంచ వలయుఁ
గాంచి నీచెంత సుఖముగాఁ ♦ గ్రాల వలయు
హైమవతి యన్నపూర్ణాఖ్య ♦ నంద వలయు
భూరికృపతోడఁ బ్రజ మీరు ♦ ప్రోవ వలయు'॥ ౧౩౯

కం॥ అనవుడు వల్లె యని శుభా
యన మెద నూహించి నిశ్చి♦తాత్ముం డై కా
శిని వెలయుచు 'విశ్వేశ్వరుఁ,
డనునామముతోడఁ బరఁగు ♦ నది మొదలు సుమీ!॥ ౧౪౦

తే॥ గీ॥ కాన నీసరిజ్జననాది♦కారణంబు
భవుఁడె యాట వానిదరినె ♦ పాఱు చుంట
దీన నాప్లావ మొనరించు♦మానవులకు
సకలపాతకపుంజముల్ ♦ సమసి పోవు'॥ ౧౪౧

కం॥ అన నింకఁ గొంద ఱని రిటు
'జననము హిమవన్నగంబు ♦ సంచరణంబా
వనరహితస్థల మాటన్
దనరున్ శుద్ధోదకములఁ ♦ దన్నది' యనుచున్॥ ౧౪౨

చం॥ పరవిదుఁ డట్లపారహిత♦వాగ్ఝరితో వచియించుచుండఁ ద
చ్చరితము సంశయాళుఁడు వి♦నన్విను కోరిక నిట్లనెన్ ''దయా
భరణ! భవత్ప్రభుప్రముఖ♦వంద్యులు బంటులు నాఁడు
జాహ్నవిన్
మురియుచు నోల లాడి యఘ♦మోచను లై పిద పేడ
కేగిరే?''॥

కాశీవిశ్వేశ్వరదర్శనము.

కం॥ అని వేడుకతనఁ బరవిదుఁ
డను; రాజేంద్రుండు స్మరహ • రార్చనకై దే
వునిగుడి కరిగినవివర
మ్మును వినిపింపంగ నెంచి • ముదితాత్ముం డై॥ ౧౪౪

సీ॥ "జలకేళి సల్పునా • సమయమందున ధర్మ
పాలభూపునిఁ జుట్టు • బ్రాహ్మణులను
బ్రాహ్మణసంతతుల్ • పార్థివేంద్రునికీర్తిఁ
గీర్తింపఁ బాడిన • గీతములను
గీతంబులకు మెచ్చి • భూతధాత్రీశ్వరుం
డర్పించినట్టిదా • నార్థతతుల
నర్థంబు లేమిచే • నర్థిబృందంబులు
ప్రార్థించి భూపుచేఁ • బడయుసిరుల

తే॥ గీ॥ వివరముగఁ దెల్ప నేటి క • వ్వీటిజనులు
పొగడి రిట్టు 'లిప్పటికి మా • పురికి నిట్టి
దానశౌండుండు రా లేదు; • ధరణి నిట్టి
యధిపుఁ డున్నట్టు వినలే దొ • కప్పు' డనుచు॥ ౧౪౫

సీ॥ ఒకచోట యాత్రార్థు • లురుభక్తి రామేశ్వ
రము సేరఁ గావిళ్లఁ • గా్రబుడంబు
నొకచోటఁ గొందఱు • వికచహృద్యు లై
పవిత కర్పించునం • జలిజలంబు
నొకచోట మఱికొంద • ఱకలంకచిత్తు లై
ప్రేతాస్థికలు గంగ • విడువిధంబు



నొకచోట నింకఁ గొంద • ఱకుటిలహృదయు లై
పితరుల కిడుపిండ • వితరణంబు

ఆ॥ వె॥ నీరుకాసులకయి • పోరుచుఁ బిడికిళ్లు
విఱుచు విప్రజనుల • విసిగి బ్రువ్వఁ
దిట్టి పోవు చుండు • తీర్థజనౌఘంబు
నొక్కచోటఁ గాంచి • రక్కజముగ॥ ౧౪౬

ఆ॥ వె॥ అట్లు చూచి చూచి • యధికవిస్మయ మంది
వసుమతీశుఁ డతని • పరిజనంబు
దివ్యభక్తి శివుని • దేవళంబున కేగు
వాంఛతోడ వాడ • వాడలఁ బడి॥ ౧౪౭

కం॥ కలచిత్రమ్ములు చిత్త
మ్ముల భ్రమపెట్టఁ గనె మంత్రి • భూపభటాదుల్
గలయాచిందం బచట స
కలచిత్రవిచిత్రవస్తు • గణముల నెల్లన్॥ ౧౪౮

సీ॥ కదళీఫలాదిస • కలఫలాంచితవిప
ణులఁ గన్నులారఁ గ • న్పలరువారు
కొను చుండఁ దిను చుండఁ • జను చుండఁ గ్రయికజ
నులతోడ మాటాడ • నిలుచువారు
వరతురంగమవృష • భాదిశకటఘనా
రవభీరు లౌచుఁ బ • ఱచెడివారు
బీదవారలు పెక్కు • వేలు వేగతుల యా
చింప విసుగ కీవు • లిచ్చువారు

తే॥ గీ॥ నొచు నబ్బజారులఁ బోరు • లగణితముగ
దాకపోకలు జరుపుచు • రభస మెసఁగఁ

గాలిలు చుండుట వారెల్లఁ • గాంచి రపుడు
సమ్మదాద్భుతమ్ము లోకట, • గ్రమ్ముకొనఁగ॥ ౧౪౯

సీ॥ పళ్లజాతి మిఠాయి • పలురకంబులఁ గూర్చి
యతిధర కమ్మువా • రచట లేరు
రేఁగి యీఁగలు వేగ • మూఁగి జుష్మని వ్రాల
సమ్మనంగడివార • లచట లేరు
పొగచుట్టలం గాల్చి • పొడుముపట్లను బీల్చి
యశుచిగా సమ్మువా • రచట లేరు
కోటిబూటకములు • తేటగా మాటాడు
నన్యాయవర్తకు • లచట లేరు

తే॥ గీ॥ చిన్నవారలుఁ జదువక • యున్నవారు
నీచజనులు రా వేఱుగాఁ • దూఁచువార
లరసి చూచిన నొకఁడైన • నచట లేఁడు;
పాడి తప్పక యమ్మెడు • వారె గాని॥ ౧౫౦

కం॥ చీమలు బారులు దీరిచి
నేమముతో రాక పోక • నెఱపెడిభంగిన్
వేమఱు బజారుల జన
స్తోమం బటఁ బోవు చుండుఁ • దొందరపడుచున్॥ ౧౫౧

తే॥ గీ॥ అట్టియంగళ్ల వీథుల • నరుగునపుడు
మదికిఁ బ్రియ మైన వస్తువుల్ • వెదకి వెలకుఁ
దీసికొని సామితో వెల • దెసకుఁ బోవు
దారి నడ్గుచుఁ బోయి ర • వ్వార లెల్ల॥ ౧౫౨



తే॥ గీ॥ తచ్ఛివాలయశిఖరసం • దర్శనమున
భక్తి పెంపార ద్వారసం • స్పర్శనమునఁ
బ్రమద ముబ్బంగ బంట్లెల్లఁ • బ్రభువుతోడ
మొదటిద్వారంబు కడ కేగు • పిదప రాజు॥ ౧౫౩

ఉ॥ సేనల నెల్ల నల్లగుడిఁ • జేరక నిల్వ ననుజ్ఞ నిచ్చి ము
న్మానసుఁ డౌచు విప్రపర • నశ్రుతి వీనులవిం దొనర్పఁగా
మానధనాఢ్యధీసచివ • మాన్యపురోహితసంయుతంబుగాఁ
దాను సతీసమేతముగ • దద్దయుఁ బత్తిని జేరఁజూచుచున్

ఆ॥ వె॥ తేరు డిగ్గి పాద • చారి యై వేగంబ
వచ్చు చున్నధర్మ • పాలుఁ గాంచి
తచ్ఛివార్చకులును • దగినమర్యాదతో
నెదురు వచ్చి గార • వించి రంత॥ ౧౫౪

శా॥ వేదోక్తంబుగ సర్వశోక్తముగఁ దం • ద్విప్రోక్తధర్మంబుగా
మోదం బొందుచు నాచరించె, జనస • మ్మోదప్రదుం
డావిభుం
డా దేవాలయమందుభక్తిమెయిఁ బూ • ర్వాచారసంప్రీతుఁడై
కాదం చొజ్జ ననంగఁ బోఁడు; ధనముల్ • గాఁ జేయు
నం చెంచియున్॥ ౧౫౫

శా॥ ఘంటానాదము లుప్పతిల్లె గుడిలోఁ • గాశీపురీవాసు ము
క్కంటిన్ రాజు సపర్యలం దనుపున • క్కాలంబునన్,
దేవతల్
మింటం దుందుభులుబ్బ్రమ్రోసిరి నలి • న్మొల్మలటం చెంతో, మి
న్నంటం బొంగిరి; పౌరులెల్లఁ గరతా • ళారావముల్ సల్పుచున్॥

ఉత్సాహ॥ కొంతసేపు ఱేఁడు శివుని • కోవెలకుఁ బ్రదక్షిణాల్
గొంతసే పటన్నపూర్ణ • కోవెలకుఁ బ్రదక్షిణాల్
గొంతసేపు భైరవాఖ్యు • కోవెలకుఁ బ్రదక్షిణాల్
సంతసమునఁ జేసెఁ దనదు • సతులఁ గూడి బత్తిమై॥

సీ॥ జపమాలికలను హ • స్తంబులం జరుపుచు
దైవతారాధనల్ • తాపసాళి
భర్మనిర్మితకుంభ • పాణులై యభిషేక
పూజావిధానంబు • భూసురాళి
బహుఫలంబులు గల • పల్లెరంబులఁ బూని
దేవతార్చనవిధి • స్త్రీజనాళి
వారువా రర్పించు • వస్తువుల్ గైకొని
భవవిభూతి నిడ దే • వార్చకాళి ౧౫౯

ఆ॥ వె॥ మఱచె; నటకు హేమ • పురనాథుఁ డేగున
త్తఱిని వానిదాతృ • తామహత్వ
సాహసంబు, వాని • సతులగతులు గాంచి
యతులవిస్మయాబ్ధి • యందు మునిఁగి॥

సుతశీల విశ్వేశ్వరునిఁ గొల్చుట.

ఉ॥ అంతట రాజుపెద్దసతి • యా సుతశీల తదీశ్వరాలయా
భ్యంతరభాగము న్వడి "య • పత్యమనోరథసిద్ధి గల్గునం"
చెంతొ పురోహితుండు మది • కెక్కునటుల్ పలుకంగఁ, దక్కు త
త్కాంతల నేద్వర న్విడిచి • కంతుహరస్థితచిత్తవృత్తితోన్॥

కం॥ గుడివెనుకటిపార్శ్వంబునఁ
బడి యుండినస్త్రీసమాజ • పంక్తిం బలెఁ దాఁ



బడి సాష్టాంగం బొనరిచి
"బుడుత నొకని దయ నిడు" మని • పొగడుచు నుండన్॥

కం॥ మది భ్రమసెనొ యేకాగ్రత
విదితంబుగ రూపు దాల్చి • విశ్వేశ్వరుఁ డా
ముదితకు దర్శన మిడెనో
తదుపరి నిటు పలుకు లేచి • తరుణులతోడన్॥ ౧౬౨

చం॥ "ఇఁక నెదఁ జింత యేల! వినుఁ • డీ! చెలులార! వర మ్మొడెన్ హరుం
డకుటిలరూపుఁడై కలుగు • నం చన సంతు; దయార్ద్రచిత్తుఁడై
వికచహృదబ్జుఁడై మనస • విస్తరపూజల నంది తృప్తుఁడై
యొకనిముసంబు కట్టెదుట • నుండి యదృశ్యము నొందె వింతఁగాన్॥ ౧౬౩

ఉ॥ శ్రీకలితావనీధవుని • చిత్తమునం గలచింత రూపఱన్
నాకును మీకె గాక సుజ • నాళికిఁ గూడముదంబు సేకుఱన్
మీ కయినన్ లభింపనగు; • మీఁదట నాకు లభింపకున్నచోఁ
దోకము, నీకెగల్గునని • ధూర్జటి నాకు వచింపనందునన్"॥

చం॥ అనవుడు వారు పల్కి రిటు • "లక్కరో! నీదృశబుద్ధిశాలినిన్
గొనములరాశిఁ గానమని • గొప్పఁగఁ బల్కెడిపౌరవాక్కు లీ
దినమున నెమ్మదిం బెఱిఁగి • తృప్తి నొసంగుచునుండె నమ్మ నీ
వనినకృపారసోక్తి నివ • హంబులు వీనుల విన్న మా కిటన్"॥

కం॥ అం చటు సల్లాపంబుల
మించి యొకరి నొకరు నేర్పు • మెఱయ ననుచుఁ ద

చ్చంచలనేత్రలు వెడలిరి
కాంచనపురనాథభటని • కాయము కదలన్॥ ౧౬౬

రాజు కాశీదివ్యస్థలంబుల నెల్ల సేవించుట.

కం॥ ఆనాఁడు ప్రొద్దు పోవుట
మానిరి; పరిశిష్టదేవ • మందిరవిభవా
నూనప్రదర్శనేచ్ఛా
యానము; దమబసల కరుగ • నను వగు ననుచున్॥ ౧౬౭

ఆ॥ వె॥ అట్లు నిశ్చయించి • యధిపానుమతి నొంది
సేరె సేన లట గు • డారములకు
రాజుగారుఁ జేరె • రాణులతోఁ గూడ
వస్త్రవేశ్మసుఖని • వాసమునకు॥ ౧౬౮

కం॥ దేవాలయవైభవములు
పావనదేవాపగాప్ర • వాహాసంఖ్యా
ప్లావమనుజసంరంభము
భావములం దలఁచుకొంచు • వసియించి రటన్॥ ౧౬౯

ఆ॥ వె॥ అద్దినంబున నట • నఖిలసౌఖ్యము లంది
రెల్లవిధుల వార • లుల్ల మలర
మఱుదినోదయమున • మరలఁ దరలి పోయి
రచటికొత్తతావు • లరసి రాఁగ॥ ౧౭౦

తే॥ గీ॥ అట్టు లిరువదిదివసంబు • లచట నిలిచి
దినదినమ్ము నొక్కొక్కవై • పునకుఁ బోయి



పుణ్యమా క్షేత్రములఁ జేరి • పూజ సల్పి
యందుఁ గలచిత్రచిత్రంబు • లరసి రంత॥ ౧౭౧

తే॥ గీ॥ అధిపుతో నొజ్జ యిటు లనె • 'ననఘవర్య!
మనము కాశికిఁ జేరి యీ • దినము తుదకుఁ
గడచె నిరువదిదినములు; • గాంచితిమిగ
సకలదివ్యస్థలవిచిత్ర • సంగతులను॥ ౧౭౨

ఆ॥ వె॥ కాన రాజ! నీకుఁ • గరతలామలకంబు
గాదె! యీప్సితములు • గనుట; విబుధు
లందు వైదుదినము • లిం దేరువసియింత్రొ
వారె గాంతు రెల్ల • వాంఛ'లనుచు॥ ౧౭౩

కం॥ కావునఁ బోదము వసుధా
దేవు లిచట భోజనములఁ • దృప్తి పడునటుల్
గావించి సర్వవిధసం
భావనలం దుష్టిపఱిచి • ప్రమదముతోడన్॥ ౧౭౪

కం॥ అన జనితోత్సాహుఁ డగుచు
ననెఁ గనకపురీశ్వరుఁడు స్మి • తాననుఁ డై 'యో
యనఘా! నీచెప్పినపని
కనుమానమె! సలుప నాకు • ననుమాత్రంబున్'॥ ౧౭౫

చం॥ అని మఱునాఁడు సూరివసు • ధామరు లెల్లరు నన్నుతింపగాఁ
గనకమయాంబరాదులను • గానుక లిచ్చి యుఁబంచభక్ష్యభో
జనములఁ బెట్టి సర్వశుభ • శాస్త్రవిదుక్తులరీతి వారికిన్
ఘనరజతాదిదానముల • ఖర్వముగా నిడె రాజు నెమ్మితోన్॥"

ధర్మపాలుఁడు నిజపురంబు సేరుట.

తే॥ గీ॥ అట్లు పలుకంగ విని సంశయాళుఁడు పర
విదుని గాంచి వినమ్రుఁడై వేఁడె నిట్టు
"ఓ మహాత్మ! సద్వర్త్మ! మీ యుర్వినాథుఁ
డింటి కేగెనో యటనుండి యెటకుఁ జనెనో"॥ ౧౭౭

ఆ॥ వె॥ చెప్పఁ గోరినాఁడఁ జేమోడ్పు లిడినాఁడ
నెంతొ శ్రమ దమ కొనరించినాఁడఁ
గానఁ గష్ట మంచుఁ గనలక దయతోడ
వివర మెల్లఁ జెపుఁడ! వేదు కలర"॥ ౧౭౮

కం॥ అనఁ బరవిదుఁ డావచనా
లను విని విసుగక మఱియు విలసితాననుఁడై
జనితోత్సాహంబున ని
ట్లను "నోసందేహమానసా! విను" మంచున్॥ ౧౭౯

ఉ॥ "ఛాందసనామసార్థకులు ఛాందసులంచను చుంద్రిగానియా
ఛాందసవాక్కులం బలుకు సారవిచారవిహీనచిత్తులే
పొందఁగ నర్హు లానడిని భూమిని; గావున ధర్మపాలుఁద
చ్ఛాందసుఁ డెల్లతీర్థముల సంచరణంబొనరింపకుండునే!॥

ఆ॥ వె॥ వారణాసి వీడి వరపుణ్యతీర్థ మౌ
గయకు వెడలి మరియు గంగయోర
నున్నతీర్థతతుల నన్నింటి సేవించెఁ
జిత్త మలర రాజు సేనతోడ. ౧౮౧

కం॥ ఉత్తరహిందూస్థానిక
తత్తీర్థప్రసిద్ధతరము లయిన న



త్పత్తనముల నన్నింటిని
బత్తిగ సేవించె ధర్మపాలుం డంతన్॥ ౧౮౨

కం॥ బ్రహ్మకపాలం బనుపురి
బ్రహ్మసుతాఖ్యాపగావరప్రాంతమునన్
బ్రహ్మవరమ్మున వెలసెన
జిహ్మచరితుఁ డైనజనుఁడు సేవింపఁ దగున్"॥ ౧౮౩

తే॥ గీ॥ అనుచుఁ బ్రేరేచెడుపురోహితునిహితోక్తి
పంక్తిమై ధర్మపాలుండు బ్రమసి వెడలె;
నటకు శీతాధికసమీరణార్తితోడ
మానినులతోడ నవిరళసేనతోడ॥ ౧౮౪

ఆ॥ వె॥ ఆస్థలంబునందు నైదుదినము లుండి
సర్వవిధులఁ బూజ సల్పి పిదప
బయలు దేఱెఁ బ్రభువు పంజాబుదేశస్థ
పంచధునుల మున్గి వశ్చిమముగ॥ ౧౮౫

చం॥ కరము హితంబుతో ధనము గైకొనఁ జేయుచు బాడ
బాళిచేఁ
బోరయుచు మెప్పు దీవెనలు పూజ లొనర్చుచు నొజ్జ
కిష్ట మౌ
సరణిని బోయె రాజవరసాగరతీరపురీప్రయాణుఁడై
పరిసరపుణ్యతీర్థముల బత్తిమెయిం బరికించి వచ్చుచున్॥

కం॥ దక్కినమునఁ బేరెక్కిన
యక్కన్యాపుత్రిక యనునగ్రము గాంచన్
మిక్కుటమగు సైన్యముతో
నక్కాష్ఠాచితయశోధరాధిపుఁ డరిగెన్॥ ౧౮౭

ఆ॥ వె॥ అచటునుండి తూఁగు • పంభోధిదరి సేరి
ప్రక్క నున్నతీర్థ•పట్టణములఁ
చిత్తశుద్ధి వారు • సేవించి నివసించి
రాఱునెలలదాఁక • నచ్చటచట॥ ౧౮౮

ఆ॥ వె॥ అట విడి కడకమెయిఁ • గటకమునకుఁ జేరి;
రక్క డక్కడ గల•పెక్కుపుణ్య
నదుల స్నాన మాడి • ముదితహృదయు లౌచు
సకలసైనికులును • క్ష్మాపతియును॥ ౧౮౯

కం॥ దానికి నంచల నుండుట
శ్రీనాథపురాదితీర్థ•సేవాభిలష
స్నానసపంకేరుహు లై
పూనికతో నిలిచి రెన్నో • ప్రొద్దు లచట నే॥ ౧౯౦

కం॥ తదనంతర మచ్చో విడి
కదలెను; రాజానుమతి సకలసైన్యంబుల్
ముదమునఁ దమ దగునష్టా
పదనగరాభిముఖగమన•వాంఛాధికతన్॥ ౧౯౧

కం॥ కతిపయదివసము లాగతి
నతిదూరగమనపరిశ్ర•మాతిశయమునన్
వెత సెందక విసు వొందక
పతియరదము నెద్దు వ్రాయె • బలములు వరుసన్॥ ౧౯౨

ఉ॥ అంతట ధర్మపట్టణశు•భాలయసౌధముఖాగ్రభాగముల్
వింతగఁ దోఁచెముందట;ప్ర•వృద్ధసుఖాంబుధినోలలాడ భూ



శాంతుఁడు సర్వసైనికుల•ఖండకళాహితవిప్రమంత్రులున్
శాంతముతోడ రాజపుడు•శంకరుఁడున్ తనమంత్రితో ననున్॥

చం॥ మనపురిఁ జేరవచ్చితిమి•మంత్రివరా! కబురంపుమా! పురీ
జనముల కిప్పుడేలికగు•శాంతభవుం డనుమంత్రికిన్ దగన్
ఘనమణితోరణాదులను • గట్టుచు వీధు లలంకరింపఁగా
జనపతివచ్చె నేఁడనుచుఁ•జాటఁగఁ బౌరజనంబు లుబ్బఁగన్॥

తే॥ గీ॥ సచివుఁడును దదాజ్ఞను శిర•సావహించి
పంపె నాశుగామి యనెడి•బంటు నొకని,
వాఁడు నాశుభసందేశ•వార్త గొంచుఁ
బోవ, సందేశహరుఁ డని • పొరసె నాఖ్య!॥ ౧౯౫

ఆ॥ వె॥ శాంతభవుఁడు పరిమ•దంతరంబునఁ గొల్వఁ
బడుచు నుండ ద్వార•పాలుఁ డొకఁడు
పరమసంభ్రమమునఁ • బగువెత్తుకొని వచ్చి,
'యాశుగామి వచ్చె' • నంచుఁ దెల్పె॥ ౧౯౬

చం॥ తెలుపఁగఁ దోడితెమ్మతని•దీర్ఘవిశేషము లెల్లనడ్గి, ధీ
బలుఁ డగుధర్మపాలజన•పాలురథం బిఁక నెప్డు సేరునో
దెలుపఁగఁ బృచ్ఛచేసి మఱి • దెల్పఁగ వచ్చినవార్త
లెప్పియో
దెలుపఁగఁ గోరువాఁడ' నని • ధీరుఁడు శాంతభవుండు
పల్కఁగన్॥ ౧౯౭

తే॥ గీ॥ ఆప్రతీహారి, వెసఁ బ్రతీ•హారపంక్తిఁ
గడచి తలవాకిటను నిల్వఁ•బడినయాశు
గామిఁ గాంచి 'లోపలికి వేఁగమ్మ రమ్మ!
యాజ్ఞ యయ్యెఁ దడయ వల' • దంచుఁ బలుక॥

క౦॥ ఆతఁడు సభాంతరమునకు
నాతురపడు చేగి, యున్న◆తాసనగతుఁడున్
భూతదయావ్రతుఁడును వి
ఖ్యాతుఁడు నగుశాంతభవున◆కనె నెఱిఁగి యిటుల్॥ ౧౯౯

క౦॥ చొచ్చిరి మనరాజాదులు
విచ్చలవిడి భవ్యతీర్థ◆వితతి, శుభగతిన్
వచ్చిరి మనపురసీమకుఁ,
గ్రచ్చఱ మీ కెఱుక చేయఁ◆గా వచ్చితి 'నాన్॥ ౨౦౦

చ౦॥ అనుపమహర్షచిత్తుఁ డయి◆యాభటునాతఁడుగారవించిత
క్కనశుభవర్తమానములు ◆ క్షేత్రవిహారము లెల్ల నడ్గి వ
త్తనము నలంకరింప భట◆తండముల న్వెసఁ బంపితాను ఖో
రన ఘనతూర్యరావముల ◆ రాజు నెదుర్కొనెఁ బౌర
రాజితోన్॥ ౨౦౧

ఉ॥ వారును వీరు భోరుకొను◆వాద్యములందొడిఁదారసిల్లి యి
వ్వారలు వారిక్షేమములు ◆ వారలు వీరిశుభంబు లడ్గుచ
వ్వారిప్రియంబుతోఁ బ్రమద◆బాష్పము లొందుచు లోల్ల
పై జగా
యేఱులునాఁదొరంగవిడి ◆ రెచ్చుతమింగనికౌగిలింతలన్॥

క౦॥ పిమ్మట శాంతభవుం డనె
నమ్మనుజాధీశుఁ గని జో◆హా రిడుచుఁ బ్రమో
దమ్మొనరఁగఁ దనకరవా
ల మ్మాతనిచేత నుంచి ◆ లలి నమ్రుం డై॥ ౨౦౩



క౦॥ భవదీయాజ్ఞావిధి నే
రవంతయుం దప్పకుండ ◆ రక్షించితి మీ
భువి జనసంఘమ్ముల; భవ
దవిరళకీర్త్యర్థవిక్ర◆మాధారాసిన్॥' ౨౦౪

చ౦॥ అనఁ దనచేతనున్ననిసి◆తాయుధమారయుచిట్లువల్కు రా
జనుపమబుద్ధిశాలి సచి◆వాగ్రణిఁ గాంచి 'మదీయఘోరశ
త్రునికరశీర్షభేది, ఘన◆దోర్బలపూర్వధృతంబు నైనయీ
నునిసితచంద్రహాసమును ◆ శూరుఁడు పూని జయంబు
నొందదే!॥ ౨౦౫

ధర్మపాలుండు గృహప్రవేశం బాట.

శా॥ క్రూరాసిం దగ నిచ్చినాఁడ ననియో ◆ క్రూరారి వం
చెంచియో
శూరాగ్రేసర! మంత్రిశేఖర! భవ◆త్క్షోణీప్రజాపాలక
త్వారంభంబుననుండి నేఁటివఱకొం ◆ డైనంగనన్ లేదు మ
ర్త్యారోగ్యార్థవినాశకారులగు జా◆డ్యంబుల్ పురీసంఘమున్॥

ఆ॥ వె॥ అనుచుఁ బురికిఁ జేరె; ◆ నతనిహస్తం బూని
ప్రమద మెసకమెసఁగఁ ◆ బలుకుచుఁ దన
సరసరథమునందు ◆ సౌఖ్యంబుగాఁ గూరు
చుండఁ జేసి ధరణి◆పుండు ప్రీతి॥ ౨౦౬

క౦॥ పురజను లత్తఱి వెదచ
ల్లిరి మొల్లలు వేనవేలు, ◆ లేఖావళి పు
ష్కరవీధినుండి పెల్లునఁ
గురిసెనొ యన్నట్లు లోకట ◆ క్షోణీశునిపై॥ ౨౦౭

సీ॥ ఏవీథిఁ జూచిన • నిం పెసలారంగఁ
గ్రాలెడుపసుపుజం•డాలు మిగుల
ఏవాడఁ గాంచిన • స్త్రీవారములు చేత
హారతుల్ పూనుచు • హాళి నొసఁగ
ఎచ్చోటఁ జూచినఁ • బిచ్చలించినభక్త
కోటిగీతంబులు • కోమరు మిగుల
ఏదిక్కుఁ గనిన స•మ్మోదదాయకశుభ
తూర్యరావంబులు • తుష్టి నిడఁగ

తే॥ గీ॥ వందిమాగధబృందంబు • ముందు నడువ
వివిధసైన్యసందోహంబు • వెనుక నడువ
ధీరసచివాదు లిరుగడఁ • జేరి నడువ
ధర్మపాలుండు భవనంబు•దరికిఁ జేరె॥ ౨౦౯

కం॥ 'శుభలగ్న మిపు డవునె?' యని
ప్రభు వెదలో జంకు లెత్తఁగ • బలికె ధిషణస
న్నిభుఁ డగుపురోహితుం 'డిది
శుభసమయం బౌ గృహమునఁ • జొరఁగా' ననుచున్॥

ఉ॥ అందుల కెంతొ సమ్మదము • నంది పురిం గలబ్రాహ్మణో
త్తముల్
విందులు పౌరమాన్యఘన•వృద్ధజనంబులు వేగ రాఁగఁ బల్
తొందరఁ బిల్వఁ బంచె శుభ•తూర్యరవంబులఁ గూర్చి
పెద్దలన్
బొందుగ రాజు; వారలును • బోరన రండని పిల్వఁ జెచ్చెరన్॥

ఉ॥ వచ్చిరి; రాజభక్తి గల•వారలు పౌరజనంబు లెల్ల వే
పొచ్చిరి; రాజమందిరము•సొంపును జూపులఁ జూచుకొంచు వే



లిచ్చిరి; మేటికట్నముల, • నెంతయు మన్నన లంది రాజుచే
హెచ్చగుమెచ్చుల న్హృదయ • నెంచిరియొ మించినబత్తి
గాంచిరో!॥ ౨౧౨

తే॥ గీ॥ ఆశుభముహూర్తమందు గృ•హప్రవేశ
లాలసోత్కంఠుఁడై ధర్మ•పాలుఁడు దన
పెద్దభార్యతోఁ గూర్చుండెఁ • బీఠమందు;
భూమిదేవు లాశీర్వాద•ముల నొసఁగ॥ ౨౧౩

ఆ॥ వె॥ వేదవేత్తలైన•విప్రవరేణ్యులు
సభికులును బురోధ•సమితియు నట
వేదవిధి గృహప్ర•వేశకార్యంబు గా
వించి దీవన లిడి • రంచితముగ॥ ౨౧౪

తే॥ గీ॥ తక్కుపెద్దలు సభ్యులుఁ • దద్ద ప్రీతిఁ
గాంచి 'యారాజమిథునంపుఁ • గామితార్థ
ములనుసర్వేశుఁ డిడుఁ గాత • మోద మంద'
ననుచు దీవించి రక్షత, • లంది వైచి॥ ౨౧౫

తే॥ గీ॥ అంత ముగుదలు కర్పూర•హారతి నిడి
రెన్నొ పాటలు పాడి యా•సన్నుతచరి
తాధిపునిచేత బహుమతు • లంది మిగులఁ
బ్రమద మొందుచుఁ దదనంత•రంబు వారు॥ ౨౧౬

వినుతశీలను స్త్రీలు చూడ వచ్చుట.

ఆ॥ వె॥ వినుతశీలతోడఁ • జని రామ సౌధాంత
రమున కెల్లవృద్ధ•రాండ్రఁ గూడి

అందుఁ గొండ అందు • రిందునిభాన లీ
క్రింద నుదహరించు • చందమునను॥ ౨౧౭

సీ॥ 'కనకాంగి! నీయొడల్ • కడుడస్సి యుండెను;
గారణం బేమొ వేఁగమ్మ సెపుమ!
కంబుకంఠిరో! మెడ • కరము సన్నం బయ్యెఁ;
గారణం బేమొ వేఁగమ్మ సెపుమ!
కమలాయతాక్షి! నీఁకనులు గుంటలు పడెఁ;
గారణం బేమొ వేఁగమ్మ సెపుమ!
కంజాస్య! నీముఖ • కమలంబు దెలు పాయెఁ;
గారణం బేమొ వేఁగమ్మ సెపుమ!'

ఆ॥ వె॥ అనుచు వినుతశీల • నారసి వారెల్లఁ
బృచ్ఛ సేయ, నొక్క • వృద్ధురాలు
పలికె నిట్టు 'లేల • ప్రశ్నింతు రామెను?
దారికష్ట మొంది • తగ్గ కున్నె'॥ ౨౧౮

తే॥ గీ॥ అనఁగ నిం కొర్తు పల్కె నా • యువ్వతోడ
'ధనికులకుఁ గష్ట మున్నె! ని • ర్ధనులకు బలె
దూరదేశప్రయాణాతి • భారకార్య
ధుర్యులై పోవ! నరయుమీ! • దొడ్డబుద్ధి॥ ౨౧౯

చం॥ కరము శిరంబు బగ్గు మనఁ • గాఁ దమమూటలు మోతు రొక్కొ; దు
ర్భరతరభారవాహు లటు • పాదములం గదుఁ బొక్కులెక్కఁ బో



దు రె! నడకన్వహించివసు • ధూర్వహులెయ్యెడనర్థశూన్యులా
నరగణమట్లుచూడఁబయ • నంబయిదారినిబోవునత్తతిన్॥

కం॥ ఎండ న్మాడ న్వలెనా!
మెం డగువర్షంబునందు • మిడుక న్వలెనా!
కొండలు ముం డ్లని యెంచక
బండలుగా నడువ వలెనె! • బాటం ధనికుల్ ॥ ౨౨౧

తే॥ గీ॥ అందు శ్రీస్ఫూర్తి సకలది • గంతకీర్తి
దళితరిపుమూర్తి విగతార్తి • ధర్మవర్తి
యైనభూచక్రవర్తిజా • యాగ్రగణ్య
కున్నె! రవ్వంతయును లోప • మెన్నఁ డేని॥ ౨౨౨

తే॥ గీ॥ అందమున మీఱు చందుమే • లందలమునొ
డెంద మింపొందఁ జేయుబల్ • స్యందనమునొ
హాయిగా నంది యందులో • నధివసించు
ప్రభుసతులుగాంచ్రె! శ్రమనింత • పయనమందు॥ ౨౨౩

తే॥ గీ॥ అం చనంగ నిం కొకచంచ • లాక్షి సూచి
యిట్టు లనఁ జొచ్చె నామెతో • నింపు గదుర
'నీవు సెప్పినమాటలు • నిజము లైన
నాకుఁ దోఁచినగతి నందు • వీఁక వినుమ! ॥ ౨౨౪

ఉ॥ మూటలు నెత్తిఁ బెట్టుకొని • మోయఁగఁ జాలక మూల్గుచున్నిరా
ఘాటవనోగ్రమార్గములఁ • గంటకముల్ శిలలెన్నొ కాళ్లలో

నాటిన బాధ కోర్చుకొని • నైజతితిక్ష నిదాఘధారులై
చాటను బోవుబీద లగు • పాంథులసౌఖ్యము బ్రహ్మ
కబ్బునే! ॥ ౧౨౪

మత్త॥ గాలి చక్కఁగ మేనఁ దాఁకిసు • ఖప్రదం బగు నేరికో;
వ్రేలితీపులు కాలితీపులు • పీడ లుండవు వారికే
వేలుజాడ్యము లేఁచుమర్త్యుల • వృత్తి హత్తద దేరికో
చాలఁగా వివరింప ధాత్రిని ' సౌఖ్య మబ్బునువారికే ॥

సుగంధి॥ కాన ధర్మపాలరాజు • గారు, కాంతలందు నీ
మానినిం గడింది మెచ్చి • మంచి తేరు గూర్చినన్
మానునే!పరిశ్రమంబు•మార్గమందుఁ బోవుచో;
మేనికోమలంబువాడి•మిక్కుటంపుఁగష్టమా॥ ౧౨౬

గర్భిణీస్త్రీవర్ణనము

గీ॥ అనుడుల విని మఱియొక • మానిని యిటు
లను నవు నవును నీపల్కు • లన్నినిజము,
కాని మార్గప్రయాణమే • గాక మిగిలెఁ
జూడుమా!యీమెలతుకనాల్ • చూలివేమొ!॥ ౧౨౭

సీ॥ అరఁటిబోదెలఁ బోలు • నతివతొడలతీరు
మాఱె వారణపాద • మహిమ గాంచె
సింహమధ్యంబు హా • సించునుగ్మలినడు
మవనీధరాభ మై, యతిశయించె
లకుచఫలనిభకు • చకు, స్తనయుగ్మంబు
క్షీరకుంభద్వయ • శ్రీ వహించెఁ



పసిఁడివన్నెఁ దెగడు, పడఁతిమైజిగి వీడి
వెడ వెడ కాంతుల • నడి వహించె ॥

తే॥గీ॥ స్వచ్ఛముకురకపోలమై • ధవము కగ్గె
నిగ్గరితమిన్న మన్నభ • క్షింప మొగ్గె
నగ్గలంపునిట్టూర్పుల • కొగ్గి తగ్గె
దోహదంబులాఁ యనెడిసం • దేహ మేల?॥ ౧౨౮

కం॥ అను చత్తెఱఁగువఁ బలుకఁగ
విని యానుతశీల, లజ్జ • వెన లోపలికిన్
జనె, నది గని యామెసకియ
మన మలరఁగఁబల్కె నిట్లు • మగువలతోడన్॥ ౧౨౯

ఉ॥ "ధర్మమికేలమీయెడలమానినులార!వినుండి!నానుడుల్
నిర్మలబుద్ధితోడ మన • నీరజనేత్రికుఁ దోఁచె గర్భిణీ
ధర్మము లాఱుమాసములు • దాఁటెడు నీనెల పోవనేటికి
ధర్మపురీప్రజావళులు•ప్రాప్తమనోరథులై రనందగున్ ౧౩౦

ఆ॥వె॥ పండితాళియెదుట • నొండుకావ్యార్థచి
త్రమ్ము సెప్పకరణిఁ దమకు నేను
వినుతశీల కన్న • వేవిళ్లవిధమును
గొంతచెప్పెదను నిట • సంతసమున ॥ ౧౩౧

ఆ॥వె॥ ఆమెవెంట నేను • నరిగినదానను
గానఁ గన్నులారఁ • గంటినమ్మ!
దోహదములతీరు • దోఁపని చూడని
గొడ్డురాల నౌటఁ • గోర్కెమెండు ॥ ౧౩౨

కం॥ అన్నము కన్నుల కగపడఁ
గ్రన్నన డానోకరించుఁ, • గటగటపడుచున్
మిన్న యగుపిండివంటల
కన్నంగ చ్చికలఁ బొగడుఁ • గమ్మఁదనమునన్ ॥ ౨౩౪

ఆ॥వె॥ అన్నమాటమీఁద • నరగంట సేపైన
నిబ్బరముగ బుద్ధి • నిలుప లేదు
కార్య మొందు దీక్ష • కాలంబు నం దేమి,
న్యాయచర్చ సేయు • నప్పు డేమి ॥ ౨౩౫

కం॥ అడుగు న్విం తెగువస్తువు
గడఁగుం జూలింతరాంధ్ర • కతల వినంగన్
వడఁకు! విపత్తులఁ దెల్పిన
నెడఁదండుడు కయ్యె నంచు • నేమో పల్కున్॥ ౨౩౬

సీ॥ జీలుగుబెండుగాఁ దేలిక యామేను
క్రమముగా నిప్డు భా • రంబునొందె
హరిణపోతంబుగా • నతిచులు కౌచూపు
క్రమముగా నిప్డు మం • దమువహించెఁ
గాముకీజనముగాఁ • గామించుహృదయంబు
క్రమముగా నిప్డు ని • ష్కామమొందె
సూచికాగ్రంబుగాఁ • జొచ్చుసూక్ష్మపుబుద్ధి
క్రమముగా నిప్డు స్థూ • లమయి మించెఁ॥ ౨౩౭

ఆ॥వె॥ జిలుకపలుకు లటులఁ జిత్తంబు రంజించు
కులుకుపలుకు లిపుడు • పలుక మానె,



వినుతశీల లోక • వినుతసద్గుణజాల
మాన్యశుభదసుఖద • మార్గలోల॥

ఆ॥వె॥ అనుచు ముగుద లెల్ల • రానందమగ్నాత్మ
లౌచు స్వగృహములకు • నరిగి రంత
వినుతశీలఁ జెలులు • వీడ్కొని వెళ్లిరి
తమతమనిలయముల • దారిఁ బట్టి ॥ ౨౩౮

మ॥ అటుపై నీశుభవర్తమానముపురం • బందంతటం బ్రాకె స్త్రీ
లెటఁ గన్నంగుమి కూడి సెప్పుకొనుచుం • దీరీతి నాదేవుఁడ
క్కటికమ్మానుతశీలపై నిలిపి త • త్కాలార్థ మే తెలఁచినన్
బటుకార్యజ్ఞుఁడుగానఁ గూర్చెనిటఁ గ • ర్భశ్రీవిలాసోన్నతుల్ ॥

మ॥ మరియున్నెల్లడికాఁగఁ దత్పురపతి • గ్రామావాసపూజార్హబం
ధురకీర్త్యర్థధరాధినాథనిజబం • ధుస్నేహితాదిప్రజల్
గరముం బ్రీతిఁ దదీయసంగతిని నా • కర్ణించి మర్యాదగాఁ,
బరమోత్కృష్టపదార్థభక్త్యుతతులం • బంపించిర వ్వారిగాన్ ॥

కం॥ సీమంతోత్సవ మొనరిచె
సీమంతిని • చయము, వినుత • శీలకు వేడ్కన్
శ్రీమానినీసమాన
శ్రీమతికిం బుద్ధిమతికి • జితభారతికిన్ ॥ ౨౪౧

వినుతశీల, నీళ్లాడుట

మ॥ నవమాసంబులునిండెనాసతి కృటుల్ • నానామనోభీష్టముల్
సవతుల్ గూర్చుచునుండఁ; బెన్మిటియను • జ్ఞామార్గ సంచారలై
దివముల్ రాత్రులు వెంట వెంటఁ జనియెన్ • దేవేరి కా కాలమం
దు, వపుశ్శ్రీకళలెట్లుమార్పులగునో • తుష్టింగ నంగోరుచున్ ॥

తే॥గీ॥ చేరి సేవించుచుండంగఁ జెలులసమితి
యంత నొకనాఁడు రాజ్ఞిసీ • శ్లాఢె నలఁతి
దివ్యనక్షత్రశుభలగ్న • దివస మంద
ప్రభువు బంధులు పౌరులుఁ • బ్రమద మంద॥

తే॥ గీ॥ అంత జయదుందుభిధ్వను • లాకసమును
ముట్టి యాశాష్టకంబును • దొట్టినిగిడి,
నాగలోకంబుతోఁ గిట్టి • నతులఁ గాంచె
సర్వలోకాళికిని సంతసం బొనర్చి॥ ౨౪౪

కం॥ సుతుఁడే యని ముందటిపురో
హితుఁ డాస్థానంబునను వ • చించుచు నుండన్
సుత పుట్టె మీ కటం చల
పతితో నొకదాసి వచ్చి • పలికె నిజమ్మున్॥ ౨౪౫

కం॥ ఆమాట వినినంతన
మోమునఁ గళ తఱిఁగి దీన • ముఖుఁడై యుండన్
ధీమంతులైన మంత్రులు
భూమీశున కెలమి జ్ఞాన • బోధ నొనర్పన్॥ ౨౪౬

ఆ॥ వె॥ ఆపురోహితుఁ డను • భూప! గుణకలాప!
లోకవినుతసురక • శ్లోకలాప!
తనయ కలిగె నంచు • మనమున వగ పేల
పొందె దయ్యా! కొడుకు • పుట్టు ముందు॥ ౨౪౭

ఉ॥ ఇందునుగూర్చి ప్రశ్నగతి • నించుక నేపటినుండి చూచితిన్
డెందమునందు నున్నవగ • డిందుపడున్ వినుమయ్య జాతకం



బుం దిలకించి చెప్పనుడి • పొంపిరివోవునె? ముందు నీదుక
డ్పందు సుతుండు గల్గుటకు • నారయ సంశయ మింత
యుండునే?॥ ౨౪౮

ఆ॥ వె॥ మఱియు నొక్కమనవి • మన్నించి వినుమయ్య!
యిపుడు జనన మైన • యీకొమార్త
మీకుఁ బేరుఁ దెచ్చు • లోకసతికి హెచ్చు
సచ్చరిత్రనాఁ బ్ర • శస్తి గాంచు॥ ౨౪౯

సంతృప్తి.

ఉ॥ నావుడు ధర్మపాలుఁడు మ • నంబున నూఱటఁ జెందె; నెట్లనన్
దేవుఁడు ప్రేమతో నెపుడు • దేని నొసంగునొ దాని నేజనుల్
భావమునందు నప్పటికిఁ • బ్రాప్త మటంచును సమ్మ
తించుచోఁ
భావిని, వర్తమానమున • బాధల నొందర టంచు నెంచుటన్

కం॥ ప్రాప్తం బగు సంపదతోఁ
దృప్తిం జెందనినరుండు • పృథ్విన్ సౌఖ్య
ప్రాప్తిం దగునే? నిజముగ
సప్తద్వీపాళి హేమ • శైలం బిడినన్॥ ౨౫౧

సీ॥ మబ్బుబంతుల మించు • మదవారణము లున్న
వాయుజవోత్తమా • శ్వంబు లున్నఁ
ద్రిదివేశుపురి మించు • దివ్యపట్టణ మున్నఁ
బరఁగ రుద్రుని గెల్చు • బంటు లున్న
శూరసూనుల మించు • ధీరసూనులు నున్న
రజనీకరానన • రమణు లున్నఁ

జైత్రరథము మించు • చిత్రవనము లున్నఁ
దారల నంటుసౌ•ధంబు లున్నఁ

తే॥ గీ॥ గనకరజతాచలంబులఁ • గ్రోలు చున్న
మించి భూచక్రమెల్లఁ బా•లించు చున్నఁ
బ్రభుని కైనను విశ్రాంతి • ప్రాప్తమగునె?
నిత్యసంతోషము న్మది • నిల్పఁ జేని॥ ౨౫౨

ఆ॥ వె॥ అంచు నిట్లు పరవి•దాఖ్యుండు వచియించు,
చుండ సంశయాత్మ•కుండు నలరి
"తనకొమార్త పేసు • ధర్మపాలుం జేమి
పెట్టినాఁడో సెపుమ! • వేఁడితి" నన॥ ౨౫౩

కం॥ బృందారకవిద్వజ్జన
మందారా దురితదూర • మాహృచ్చోరా
బృందావనసంచారా
సుందరవదనారవింద • సూరిముకుందా॥ ౨౫౪

చంద్రవర్త్మ

వేదవేద్యహారి • విక్రమవిభవా
భేదబుద్ధిచర • భీకరచరితా
మోదఖేదభయ•మూలభవహరా
సాదరాత్మరిపు • సంచయభయదా॥ ౨౫౫

భుజంగప్రయాతము.

స్థిరావాస వైకుంఠ • శృంగారహేలా
సురానీక మందార • సూర్యబ్జసూరా



పరాజేయనిష్ణాత • బాణవ్రయోగా
నిరాధారదీనార్ధి • నిత్యావనేచ్ఛా॥ ౨౫౬

— • గద్యము • —

ఇది శ్రీమత్సరస్వతీ నిర్హేతుక జాయమానకటాక్ష
వీక్షణపవిత్ర మధ్వమతహారితసగోత్ర చిల్లరిగె
వంశపయః పాథోధిరాకాసుధాకర నరసిం
హారాయార్య ద్వితీయపుత్ర సకలబుధ
జనమిత్ర యోగానందకవి ప్రణీతం
బయిన జ్ఞానవతీప్రబంధమందలి
ద్వితీయాశ్వాసము.



శ్రీమత్పరాత్పరాయనమః

# జ్ఞానవతి.

## తృతీయాశ్వాసము.

---

కం॥ ఘోషాంగనావిచిత్రా
దోషగణలతాలవిత్ర • దుష్టామిత్రా
దోషాచరాళిహర్తా
భాషేశస్తోత్రభక్త • పాలనసూత్రా॥ ౧

జ్ఞానవతి బాల్యక్రీడ.

ఆ॥ వె॥ అంతఁ బరవిదుండు • సంతసంబున మించి
ధర్మపాలుఁడు తన • తనయ కేమి
పేరు పెట్టినాఁడొ • ప్రీతితో వివరంబు
దెలుప నుద్యమించి • పలికె నిట్లు॥ ౨

ఉ॥ "శ్రీనుతతీర్థసంచరణ • చిత్తరతిన్ జనుకాలమందుఁ ద
న్మానిని కడ్పునం బడుట • మంచితఱిం జననంబునొందుటన్
మానితశాస్త్రవేత్త లను • మానముపీడఁగ హెచ్చరించుటన్
జ్ఞానవతీసమాఖ్య నిడె • నందనకప్పుడు రాజు నెమ్మితోన్॥

ఉ॥ ఆమెకు బారసాల మొద • లైనమహోత్సవకార్యముల్గడున్
బ్రేముడి నాచరించె నల • పృథ్విధవుం డని సెప్పనేఁటి యా
భూమిని బీదమానవులె • పుట్టినబిడ్డకుఁ జేయుచుండఁగా;
నేమము దప్పకుండ ధర • ణీవిభు లంతటివా రొనర్పరే!॥ ౪



సీ॥ కనువిచ్చి చూడని • కందు దీపంబుల
వెల్గుఁ జూడఁగ నేర్చె • వేడ్కమీఱఁ
బన్నుండఁ బెట్టినఁ • బ్రక్కఁ బాయనిబాల
మరియొక్కప్రక్కకుఁ • బొరల నేర్చెఁ
దనవారిఁ బెఱవారి • దగ నెఱుంగనిబిడ్డ
ప్రేమించు తలిని గు • ర్తింప నేర్చెఁ
నెపుడు సూచినను ని • ద్రించెడి పసికూన
తొట్టిని దన్నుచుఁ • గొట్ట నేర్చెఁ

తే॥ గీ॥ ప్రాఁక నేర్చెను వరుసఁగాఁ • బలుక నేర్చె;
నమ్మ! యక్క! యనుచు జ • నాహ్లాదముగను
ముద్దెములఁ గూడఁ జేయుచు • వినుతశీల
చిత్త మలరింప సాగె నా • చిన్నిబాల॥ ౫

కం॥ బుడుబుడుతనంబునఁ బఱచున్
బడుచుం దన కిష్ట మైన • కుడుపుల నోలిన్
విడుచు న్నన్నము విచ్చల
విడి బాలక్రీడ నామె • విహరింపఁ జనున్॥

కం॥ అమ్మా! యని యొకపరి పి
న్నమ్మా!' యని యొక్కసారి • యామె యరుగు గే
హమ్మునకు నెమ్మి వీధిన్
జెప్పటచే నాడ మాని • శీఘ్రగతి మెయిన్॥

సీ॥ నెమ్మితండములకు • నృత్యంబు బోధించు
గొరువంకలకు నేర్పుఁ • గూర్మిపెంపు

హరిణపోతములకు • నలవరించును జూపుఁ
గూర్చుండుపిధిఁ దెల్పు • గువ్వలకును
చిలుకచిందములకుఁ • బలుకుచందము నేర్పుఁ
గరిగున్నలకు నేర్పుఁ • గమనగతులు
భరతపత్తుల కిడు • బహువిధగానంబుఁ
గోకిలలకు నేర్పు • గొంతుసొంపు

తే॥ గీ॥ సారిదివానికి మేతనీ • ళ్ళరసి యిడుచుఁ
జెలుల మిన్నలతోఁ గూడి • చెలిమికలిమి
ననుదినము చూపఱకు నెల్ల • మనము లలరఁ
బ్రొద్దు గడపుచు నుండు నాఁముద్దుబాల॥

సీ॥ నవరత్నమయభూష • ణపరిష్కృతమ్ములౌ
బంగారుబొమ్మల • వరుస నిల్పి
పరిణయంబు లొనర్చు • వలయు వేరండంచుఁ
జెలికత్తె లెల్లరఁ జేరఁబిలిచి
మనమిద్దఱము నెయ్య • మున వియ్య మొందుట
తగు నంచు నొకసఖిఁ • దద్దవేఁడి
తక్కువారల నిరు • పక్కలఁ బెండ్లివా
రై యుండఁ దగినట్టు • లాజ్ఞ యిచ్చి

ఆ॥ వె॥ ప్రాణశూన్యము లగు • ప్రతిమదంపతుల క
భిఖ్య లేవొ గూర్చి • ప్రీతితోడ
నుత్త వైనమంత్ర • నృత్తవాద్యాదులఁ
దంతు జరిపి పెండ్లిఁ • దానొనర్చు॥



కం॥ అల్లధరిత్రీరమణుని
యిల్లాం డ్రనమందుఁ బెంతు • రెలమిగ నామెన్
బిల్ల లకొఱ కెదలోమును
దల్లడమును బొందినట్టి • తరుణులు గానన్

ఆ॥ వె॥ రాజుకూతునకును • రండకూఁతునకును
సాగవె! హృదభీష్ట • సంచయంబు
లన్నసామెతగతి • నాజ్ఞానవతిముద్దు
లెల్లఁ జెల్లు చుండుఁ • దల్లులకడ॥

జ్ఞానవతీ వివాహ ప్రయత్నము

మ॥ అనఁగా నంతట సంశయాళుఁ డెద న • త్యానందమున్ బొంది “యో
యనఘా! పిమ్మటిగాథ సెప్పఁగదవే! • యాధర్మపాలాత్మజా
ఘనచారిత్రము వే వినంగ మదిలోఁ • గౌతూహలంబెక్కుడ
య్యె” ననం జెప్పఁ దొడంగెఁ దాఁ బరవిదుం • డీక్రింది చందంబునన్

సీ॥ “అస లాఁడుపిల్లలే • మిసమిస లాడుచుఁ
బెరుఁగుతోఁటాకు నాఁ • బెరుఁగు చుందు
రందు గారాముగా • నరచేతఁ బెనిచెడి
స్త్రీలున్న నిం కేమి • సెప్పవలయు
నందు మైసిరికూడఁ • బొందుగా నున్నచో
మఱికంకణము లట్లు • మఱియు మెఱయు
నందు బిడ్డలు లేమి • నారాటమొందెడు
నర్థవంతులకడు • నందుఁబుట్టు॥

తే॥గీ॥ పట్టిడినదినవృద్ధిని • బలుకఁ దరమె!
అట్టిసందర్భమున జేని • కవతరించు
బాల బాలేందు విధమునఁ • బ్రతిదినంబు
గళలఁగాంచు చుండెడి దన • ఘనమె! సెపుమ॥ ౧౩

తే॥గీ॥ అస్త్రవిద్యయు మఱి సర్వ • శాస్త్రవిద్య
శస్త్రవిద్యయు నేర్పించె • జ్ఞానవతికిఁ
బెక్కు లేటికి నాబాల • కొక్కనైనఁ
దెలియ రానట్టివిద్య లే • దిలను జూడ॥

తే॥గీ॥ నేత్రపర్వంబు సేయుచు • నెగడునట్టి
జ్ఞానవతిఁ జూచి యొకనాఁడు • జనకుఁ డంతఁ
బండితామాత్యభూసుర • మండితసభఁ
జొచ్చి యుత్కంఠతో నవఁ • జొచ్చె నిట్లు॥

సీ॥ ‘‘బహుకాలమునకు నీ • శ్వరకటాక్షంబునఁ
గన్నె యొక్కతె నాకుఁ • గల్గెను గద!
ఆబాల యిప్పుడు • యౌవనవతి యౌచు
నుంట మీర లెఱిఁగి • యున్నదె గద
ఆఁడుపిల్లలఁ గన్న • యయ్య లెప్పటి కైన
నొరుల కర్పించుట • యుచితమె గద!
గంతకుఁ దగినట్టి • బొంతయున్నట్టుల
దగి నచ్చుట్టఱికంబు • ధర్మవెగద!

ఆ॥వె॥ గాన మీర లరసి • జ్ఞానవతికిఁ దగు
వరుని వెతకి తెల్పు • వలయు ననిన



ముంద టిగురు వృద్ధు • ముదముతో నిట్లను
వినుమ నాదుపలుకు • మనుజనాథ!

తే॥గీ॥ ఈనడుమనురజస్వల • యైనజ్ఞాన
వతిని గూర్చి చర్చఁ జే • సితిని రాజ!
అందు ఫల మెట్లు తేలె నం • చందు రేమొ
సర్వశుభవతి యై స్త్రీప్ర • శస్తి వడయు

ఆ॥వె॥ అంచుఁ బలుక నంత • నవనీసురవ్రాత
ములను సచివుఁ డంపె • నలుగడలకు;
జ్ఞానవతికిఁ దగిన • వాని నరయుఁ డంచు
నామెపటము లిచ్చి • యర్థ మిచ్చి॥

తే॥గీ॥ మనల నెవ్వాఁడు ముందుగా • మఱలి పురికిఁ
జేర వచ్చిన నిచ్చోటఁ • జేరియుండ
వలయుఁ దక్కువారలు దన్నుఁ • గలియువఱ క
టంచుఁ దా మొక్కయెడ నియమించుకొంచు॥

తే॥గీ॥ వేగ నాభూసురుల్ చీలి • వెడలినారు
జంటజంటలుగాఁ గూడి • శాస్త్రవిధిని
నెల్లవసుధాధిపుల విచారించుకొంచు
వారికొమరులపటములు • దారు కొనుచు॥

కం॥ ‘‘మన మీదినమునఁ గాంచిన
మనుజేశాత్మజు వరించు • మనజ్ఞానవతీ
మన సౌని ప్రతివాఁ డనుకొని
చను చుందురు వారు తొంటి • సంజ్ఞాసలికిన్॥

తే॥ గీ॥ అట్లు వరుసఁగ వారెల్ల • రటకుఁ జేరి
యనుకొనెద రొండొరులు హర్ష • మంది యిట్లు
'చెప్పఁడీ! మీరు గనినట్టి • చిత్రములను
చూపుఁడీ! పెండ్లికొమరుల • రూపములను'॥ ౨౨

కం॥ అని మఱియుఁ గొంతసే పట
నసురాగ మెసఁగఁ బరస్ప • రాలాపములన్
మనముల దుష్టిం గని ప
త్త్రనాభిముఖులై నడిచిరి • తద్దయు వేడ్కన్॥

మ॥ చనిదీవించుచు ధర్మపాలుఁ గని యో • ధర్మపాల! మీ కోర్కి చె
ల్లె నృపాలోత్తమపుత్రికాళిపటముల్ • లక్షించి మీ
కూఁతు రే
జననాథాత్మజు నివ్వరించు నతనిన్ • జామాతగాఁ జేసికొం
డనినన్ రాజు నిజాత్మజం బిలిచియ • త్యంతప్రమోదంబునన్॥

తే॥ గీ॥ ఆదరణఁ జేసి యమ్మరో! • యఖిలరాజ
సుతులపటములు చూచి నీ • హితము పగిది
వరుని వరియింపు మిది స్వయం • వర మటంచుఁ
బలికి యాజ్ఞానవతిముందు • పటము లుంప॥

జ్ఞానవతీ స్వయంవరము

ఆ॥ వె॥ అంత నామె యుత్త • మాంగంబు లజ్జచే
వంచి యూరకుండఁ • గాంచి యొక్క
సఖి పటమ్ములందు • లిఖితాక్షరమ్ములఁ
జదివి దెలిపె నిట్లు • సమ్మదమున॥



ఉ॥ కంటివె? వీనిరూప మల • కంతు జయంతుల గెలిచే సెడున్;
వింటివె! వేల్పుటొజ్జ గతి • విజ్ఞుఁ డితండు సమస్త విద్యలన్;
బంటుతనంబునందరయ • భార్గవరాముఁడొకండు మీఁదమ
క్కంటియొకండు గాక మఱొ • కండుగలండె సముండు వీనికిన్

మత్తకోకిల.

వారిమువ్వురి కన్న నీతఁడె • వాసి కెక్కెను జూచితే!
భూరివిక్రమవిద్యలన్ ఘన • భూతిచే ననమానుఁడై
ధారుణీధవపజ్క్తి నోర్చి కృ • తాపకారులఁ ద్రుంచి య
వ్వారికీర్తిని గాంచి వెల్గెడి • పార్థివాత్మజుఁ డీతఁడే॥

తే॥ గీ॥ అంగవంగకళింగ మ • త్స్యకురుశూర
సేన కాశ్మీరకర్ణాట • చేదిమగధ
చోళసాళ్వదేశాధిప • సుతులఁ గనుము
యంచు వారిచిత్తరువుల • నన్ని చూపి॥ ౨౯

పంచచామరము,

అయోధ్య నేలునట్టి భాస్క • రాన్వయాధిపాత్మజున్
నయోక్తితోడఁ జూప నామె • నాన వీడి చేకొనెన్;
వయః కలాపభావరూప • వంద్యమైన యాపటం
'బయారె' యంచు సభ్యులెల్ల • హర్ష మొంది మెచ్చఁగా॥

ఉ॥ అంతన యోధ్యనాథుఁ డగు • నాగ్రహమూర్తికి బంపెఁ బత్రికన్
సంతస మంది రాజు పరి • చారహితాప్త జనాళితోడ మా

కెంతయు వేడ్క సేయఁ దమ • కెల్లి రయంబున రండు పెండ్లికై
స్వాంతవిశుద్ధ నాదుహిత • సభ్యులు మెచ్చ వరించె మీఱఁ దర్జ॥

కం॥ అని యటుల వ్రాసి యంపినఁ
గని శ్రీమదయోధ్యరాజు • కడుహర్షమునన్
జనుదేరె ధర్మపట్టణ
మునకు సమస్తపరివార • పూర్ణుం డౌచున్॥

జ్ఞానవతీ పరిణయమహోత్సవము

తే॥ గీ॥ ఎదురుకోలుసన్నాహంబు • నెల్లఁ జేసి
ధర్మపాలుం డెదుర్కొని • తగినరీతి
విడిదలకుఁ దోడుకొని వచ్చి • పెండ్లివారి
నెల్లరను నిల్పె నుల్లముల్ • పల్లవింప॥ ౩౩

సీ॥ మురజాది శుభతూర్య • ములు మ్రోగి వినువారి
చెవులకుఁ బండువు • ల్సేయుచుండ
రత్నాలతోరణాల్ • రంగవల్లులుఁ గాంచు
వారికి నేత్రోత్స • వం బొనర్ప
సామంతరాజన్య • సచివధీరాదులు
క్రమపీఠస్థులై • కాంతులు చుండ
నిగమశాస్త్రవిచార • నీతికోవిదభూమి
దేవతాబృందంబు • దీర్చియుండ

తే॥ గీ॥ ధర్మపాలునిభవనంబు • దనరుచుండె
నత్తఱిఁ బురోహితుఁడు సమ • యంబు మీఱి



యుండఁ బెండ్లిపీటం గూరు • చుండఁ జేసె
వినుతశీలను రాజుఁ ద • త్తనయఁ గూడ॥

తే॥ గీ॥ అంత విధ్యుక్తముగ వివా • హవిధిమంత్ర
ములను జదివి మంగళసూత్ర • ము మెడయందు
వధువునకుఁ గట్టఁ జేసె న • వ్వరునిచేత
జీలకఱ్ఱబెల్ల మిడఁ జేసి • శిరమునందు॥

కం॥ ఆజియుఁ దలంబ్రాలు వధూ
వరు లొండొరు లెచ్చి తలల • పైఁ బోసికొనన్
వరముక్తాఫలభూషిత
శిరపులబలె గానఁ బడిరి • తత్సమయమునన్॥

కం॥ గాంచిరి ముద మెల్లరు దీ
వించిరి బ్రాహ్మణులు వేద • విధి దప్పక మ్రో
యించిరి దుందుభు లొక్కటఁ
గాంచనపురి నట్టిభవ్య • కాలమునందున్॥

కం॥ బాడబులకు సంభావన
లోడక వేడినటు లిచ్చి • రుభయాధిపతుల్
పాడిరి గాయకు లత్తఱి
నాడిరి వేశ్యాంగనలు మ • హానందమునన్॥ ౩౫

సీ॥ భోజనానికిరాక • పోకలు నెఱపెడి
వింతవారల కొక్క • వేళ లేదు
దక్షిణాతాంబూల • ధరులౌచుఁ బోయెడి
విప్రసంతతి కింత • విసువు లేదు

కానుక లర్పించి • కడుగారవం బంది
వెడలు రాజుల లెక్క • వేయ రాదు
పట్టణాలంకార • బహుచమత్కృతి గాంచి
యమరావతియు సాటి • యనఁగ రాదు

తే॥ గీ॥ వీధి నల్లాడు నెంగిలి • విస్తరాకు
మొత్తములఁ బ్రీతి నాకంగ • మొఱుఁగు లిడుచుఁ
గడురయంబునఁ బరువెత్తి • గడమవానిఁ
గఱచు నూరఁగుక్కలసంఖ్య • గణన లేదు॥

తే॥గీ॥ అట్టు లుద్వాహ మొనరింప • నఖిలవైభ
వముల గంకణమ్ములు నాల్గ • వదినమందు
విప్పి శోభనకార్యంబు • విధికృతముగ
నొజ్జ చేయించె నారాత్రి • రొప్ప మీఱ॥

తే॥గీ॥ మగని నామంబు సెప్పింప • మగువ లెల్లఁ
బంత మూనంగ నాజ్ఞాన • వతియు విసిగి
నైజమార్గాహ్వయుండు నా • నాథుఁడంచు
సిగ్గు పెంపున వచియించె • శిరము వంచి॥

తే॥గీ॥ అట్లు వేడుక లెన్నొ స్త్రీ • లాచరించి
పడుకటింటియం దావధూ • వరుల డించి
తాము బయటికరిగి తల్పు • తగ బిగించి
ముచ్చటల నాడఁ జొచ్చిరి • ముదము గాంచి॥ ౮౧

తే॥గీ॥ యోగి యిహలోకభోగంబు • లొల్లనట్లు
లొల్లకుండెన ప్డావరుం • డెల్లసుఖము



లంత నావధూమణి గాంచి • చింతతోడఁ
బల్కు వినయంబుతో నిట్లు • భర్త కెరఁగి॥

వధూవరసంవాదము

ఉ॥ మౌనము దాల్చినారొ! కుసు • మాస్త్రశరంబుల డస్సినారొ! మీ
మానసమందు నెద్దియను • మానము నావయి నొందినారొ! కా
దే నిశరీరజాడ్య మొకఁ • డెంతయు నేఁపఁ గృశించినారొ! యి
ష్టానన మెత్త రేమియు! సు • ఖావహ కాలమునందు నిమ్మెయిన్॥

కం॥ అన నైజమార్గుఁ డగురా
తనయుం డావరుఁడు పల్కు • దరహాసమునన్
విను మోహప్రాణేశ్వరి! నా
కనుమానం బొక్క టుండె • నది తీర్చెదవే॥

కం॥ నావుడు ప్రాణేశ్వర! మీ
భావంబునఁ గొంకు లేల! వచియింపుఁడు నా
కావిషయము నొనరింపం
గా వీ లవునే నొనర్తుఁ • గడుశీఘ్రమునన్॥

ఆ॥వె॥ అనఁగఁ బల్కు నాతఁ • డబ్జాక్షిరో! స్త్రీల
కలవి గాని పనులు • గలవె ధరణి!
నున్న నట్టివాని • నెన్నఁ డైనను నీకుఁ
జెప్పవాఁడనె సతి! • చేయు మంచు॥ ౮౨

ఉ॥ మర్మము వీడఁ బోరు; బహు • మాయలఁ బన్నినఁ బ్రాణ మిచ్చినన్

ధర్మపథంబు దప్పినను ♦ దమ్మిల ధర్మచరిత్రలంచు స
ద్ధర్మములు లోన నెంచఁగన ♦ నానటి యింతుకు స్త్రీలటంచు స
త్కర్ముఁడొకండు పల్కవిని ♦ కౌతుకినై గనుమంటె సత్యమున్ ॥

కం॥ తలఁచితి నిత్తఱి నే నొక
తలఁపు నసందర్భ మైన ♦ దానిన్ దానన్
గలవరపడి మది నివ్విధి
నలినాక్షిరో! సిగ్గు వంచి ♦ నాఁడ ననంగన్ ॥

కం॥ కలవరమేలా! నాథా!
కలరూ పెఱఁగింతు రేని ♦ గలనాశక్తిన్
దల్పఁ పీడేర్పెద నాదటఁ
దలఁకుదు నే పల్క; భూమి ♦ తలక్రిందైనన్ ॥

చం॥ అనవుడు నాతఁడిట్లనుము ♦ దాప్తుఁడనై తినినీదు పల్కులన్
వనితరో! మాట దప్పకుము! ♦ వాంఛను దీర్పుము! దానిఁ
జెప్పెదన్
ననుఁగనుమూసి బిడ్డను గ ♦ నన్వలెనీవు; పతివ్రతాత్మవై
జనసుతి గాంచఁగా వలెఁ బ్రి ♦ శస్తిగ నన్నడఁ బాసి
యుండియున్ ॥

తే॥గీ॥ అనుడు నాశ్చర్యమగ్నయై ♦ యామె వల్కు
బాపురే! బాగుగా నెంచి, పలికితిరయు!
పిచ్చికుదిరె రోఁకలిఁ జుట్టఁ ♦ బెట్టుఁడు తల
కన్నగతి కాదె మీ రిప్పు ♦ డన్నమాట!॥

తే॥గీ॥ పరులు విన్నచో నవ్వరే! ♦ ప్రాణనాథ!
యిట్టివెడనుడు లెవ్వారి ♦ కిం పొనర్చు?





నిట్టియూహ లెవ్వారల ♦ కెడఁ బుట్టు!
నంచు నెంచంగ నతఁ డాగ్ర ♦ హంబు నంది ॥

ఉ॥ చేసెద మీర లేపనిని ♦ జెప్పిన శక్తికొలంది యం చటుల్
బాసయొనర్చితప్పకొనఁ ♦ బల్కెద వే? యిటు; సెప్పపిమ్మటన్
దోసము రాదె నిన్ననినఁ ♦ దొయ్యలిజాతిని నమ్మవచ్చునే!
యోసిపిసాళి! యంచనఁగ ♦ నొప్పగ నామె వచించె నిమ్మెయిన్

కం॥ న్యాయహితకార్య మైనం
జేయం దగుఁ గాని భర్త, సెప్పినమాత్రన్
జేయంగ నౌనె దూష్యము!
జాయ కయినఁ బోషితప్ర ♦ జానటికైనన్ ॥

ఆ॥ వె॥ అయినఁ దొల్త నొక్క ♦ టాడి పిమ్మటఁ దప్పఁ
దప్పు గాన నాథ! ♦ తప్పకుండ
మీయనుజ్ఞ చొప్పు ♦ నొకొని చేయంగ
నొప్పుకొంటిఁ గోవ ♦ ముడుగుఁ డింక ॥

కం॥ అంతట నిద్రాదేవత
సంతసమున నావహింప ♦ శయనించిరి త
చ్చింత న్వీడి యిరువురు; నే
కాంతవిలాసముల నొల్ల ♦ కయె క్రమమునన్ ॥

ఆ॥ వె॥ ఆమె తనకు పెనిమి ♦ టనుకూలవర్తిగా
కుండె నంచు నెడఁద ♦ మండిపడుచు
మొగము మాడ్చుకొంచు ♦ మూతి బిగియఁ బట్టి
చాటుచోటి కేగి ♦ సణగ లేదు ॥

ఆ॥ వె॥ పిల్లవయినొ లేక ♦ పిల్లిపైనో పెట్టి
కోపపడుచు విసుగుఁ ♦ గొనుచు నింటఁ
బనులు సలుపువేళ ♦ వాడెడిసామగ్రి
బుడమియెదురునట్లు ♦ విడువలేదు॥

ఆ॥ వె॥ చెప్పినట్లు చేసి ♦ చేసినట్టులె యొప్పి
యెప్పుడుఁ దనయాజ్ఞ ♦ దప్పకుండు
నట్లు సల్పునంచు ♦ ననుకొని ప్రాణాలఁ
దీయుమరుగుమందు ♦ వేయలేదు॥

మ॥ అరిగెన్మాడుదినంబులావగిదిఁ బూ ♦ ర్వాచారమార్గంబుగా
జరిపెన్ వియ్యమునందు జంపతులకున్ ♦ జామాతకున్ వేడుకల్
కరమర్థింగన వచ్చు బంధుసఖులం ♦ గారాబ మేపారఁగా
నరసెన్ గానుకలిచ్చి హేమపురమ ♦ ర్త్యాధీశుఁ డుత్సాహియై

నైజమార్గుండు, వేదపురికింజనుట

తే॥గీ॥ ధర్మపాలుండు కోరువి ♦ ధమునఁ బెండ్లి
కొమరు నొక్కరు నట డించి ♦ కుతుకమునను
వివిధపరివారము ల్గొల్వఁ ♦ బెండ్లివారు
జనిరి మిగతవా రరిగిరి ♦ స్వపురములకు॥

ఆ॥ వె॥ బాంధవంబుఁ జూచి ♦ పరమమైత్రిఁ దలంచి
వైభవంబు గాంచ ♦ వచ్చినట్టి
వార లెల్లఁ బోవ ♦ ధర్మపట్టణ మొప్పెఁ
బాటు గన్నయువహ ♦ పేటిభంగి॥





ఆ॥ వె॥ తేలు దొంగవానిఁ ♦ దీవ్రంబుగాఁ గుట్టి
బెట్టిదముగ బాధ ♦ పెట్టుచున్న;
గుట్టు వాఁడు విడువ ♦ నట్టుగా నాసూత్న
రాజమిథున మచటఁ ♦ గ్రాలుచుండె॥

తే॥గీ॥ కొంతకాల మైనపిదప ♦ స్వాంతమందు
నైజమార్గుండు చేసె నీ ♦ యోజఁ జర్చ
నాదుచింత నెవ్వనికి వి ♦ న్నవ మొనర్తు?
నేరికిం జెప్పకుండ నే ♦ నెట్టులోర్తు? ॥

తే॥గీ॥ మంచియో! చెడ్డయో! మున్వ చించినాఁడ
దాని నెఱవేర్ప కున్నచో ♦ మానుషంబె?
మానుషవిహీనుఁ డిలపైని ♦ మనిన ఫలమె?
ఫలము లేకుండ బ్రదుకుట ♦ పౌరుషంబె?

ఆ॥ వె॥ ఎంతదిట్టకైనఁ ♦ జింత నొందెడివేళఁ
దగిన వెరవు సెపహ ♦ తజ్జ్ఞఁ డొకఁడు
మ్రోల నున్నపుడె ప్ర ♦ మోదంబు వాటిల్లు
లేక యున్న నదియు ♦ లేక పోవు ॥

ఆ॥ వె॥ ఉన్నమాత్రిన ఫల ♦ మున్నె? మర్మము లెల్ల
డించు వెంగలి సఖుఁ ♦ డెంచి చూడ!
వాఁడు కాల మెఱిఁగి ♦ వర్తిల్లుచతురుండు
స్నిగ్ధుఁడైన మివుల ♦ క్షేమకరము ॥



ఆ॥ వె॥ కలఁడు నాకు నట్టి ♦ చెలికాఁడు నుతిఁగన్న
పుడమిఱేఁడు వేద ♦ పురినిఁ గాన

నేఁడు పోయి వానిఁ • తోడ నాలోచింతు
ముందుచేయఁ దగిన • చంద మేదొ ॥

తే॥గీ॥ ఈవిషయ మిచ్చ బెవ్వారి • కించు కంత
దెలియనీకుండఁ బోవుచే • తెలివి యంచు
నెంచి యుత్తమామలతోడఁ • నీదినంబు
పోవుదువ్వురి కని బొంకి • పోయె నటకు ॥

ఉ॥ జ్ఞానవతీసతీమణియు • స్వాంతమున న్నెలకొన్న చింతచే
బోనముతిన్నఁగాదినదు • భూషణరాజిధరింప దెప్పుడున్
గానదు; చేటికల్పలువు • కార్యవినోదమహోపచారముల్
పూనదు; ముచ్చటల్వినఁగ • బోదు; విహారవనమ్ము చెంతకున్

జ్ఞానవతీ వనక్రీడ

తే॥గీ॥ అట్టు లుండంగఁ గని చెలి • బొట్టొకర్తు
శారదాంబయనెడిజాణ • దూర మరసి
యాత్మఁ జింతకుఁ గత మేమొ • యడుగఁ దలఁచి
చెలులతో నామెఁ దోఁటకుఁ • జేరఁ బిలిచి ॥

తోవకము

ఒక్కొకచెట్టున • కొక్కొకపూవున్
జక్కఁగఁ గోయుచు • సారసనేత్రిల్
ముక్కునఁ జేరిచి • మూర్కొని లోనిం
పెక్కుడుపొంది చ • రించుచు నుండన్ ॥ 23

ఉత్సాహము

తాను శారదాంబ యపుడు • తద్దసంతసంబునన్
జ్ఞానవతికిఁ బరిమళసుమ • సమితిఁ గోసి యిచ్చుచున్



మానవతిరో! చూడు మల్ల • మదమధువ్రతంబులన్
సూనగుచ్ఛవిహరణముల • సొంపు నింపుఁగూర్చెడున్

ఇంద్రవజ్రము ॥

అంచున్ లతాపుంజము • లన్నిటిం జూ
పించున్ సఖి! నీమెయి • యిట్టులేతీ
ణించెం జుమీ యంచుఁ గృ • శించు తీగన్
గాంచంగఁ జేయున్ లల • నాలలామన్ ॥

సీ॥ పికవాణి యొక్కతె • పికముల నెంచంగ
శుకవాణి శుకములఁ • జూచి నవ్వ
వల్లికాంగి యొకర్తు • వల్లులం దూషింప
గుచ్ఛకస్తని పూలగుత్తిఁ దెగడు
నరసిని యొక్కర్తు • సరసినిం గని మించ
హంసలఁ గని మీఱు • హంసగమన
పద్మాక్షి యొకరిత • పద్మాళి హసియింపఁ
బల్లవాధర దూఱుఁ • బల్లవముల

తే॥ గీ॥ నిట్టు లాసఖుల్ తమసిరి • కీడుకాని
వానిని దిరస్కరించుచు • వనవిహార
వనవిహారవిలాసముల్ • తనివి దీర
సల్పిరి ప్రమోదపరవశ • స్వాంత లగుచు॥

ఆ॥ వె॥ అందఒక్కచోట • ననువుగాఁగూర్చుండి
చల్లగాలితాఁక • నంతసించి
యొకరితోడ నొక్క • రొప్పుగా ముచ్చట
లాడు చుండిననమ • యంబు గాంచి॥ 22

జ్ఞానవతిని శారద విమర్శించుట

కం॥ అందఱిలోఁ బ్రశ్నించిన
సందేహం బొందు నేమొ • జ్ఞానవతి యటం
చుం దా శారద మదిలో
నం దలఁచి రయమున దవ్వు•నకు రమ్మనఁగన్॥

ఆ॥ వె॥ ధర్మపాలుపుత్రి • తద్విధంబునఁ బోవ
నామెతోడ నిట్టు • లనియె సకియ
చిత్తమందు నీవు • చింతించు చున్నట్టు
చెప్పు చుండె మోము•చిన్నె లరయ॥

కం॥ చెప్పుము! నీమదిచింతఁ
దప్పక నాశక్తికొలఁదిఁ • దప్పరఁబాపెద నే
దెప్పరపుఁగార్య మైనన్;
దప్పదు రే! సఖులపట్లఁ • దగఁ జేయుటకున్॥ ౧౦

చం॥ అనవుడునామెయిట్టులను • నాత్మసఖీమణి! యెట్లుసెప్పుదున్
జనములువిన్నవవ్వుదు రఁజస్రము;నింతటియెల్లిదుల్ భువిన్
జననమునొందలేదెచటఁ•జక్కఁగఁజూచినముందుఁబుట్ట రం
చునునడిసల్పుచుంద్రయినసుంతయుజంకనునీకుఁదెల్పఁగన్॥

ఉ॥ నాఁడునిపేక కార్యము నొ • నర్పఁగఁ జేసిరి గాదె! నాకుసద్
బాడబు లెల్లబాంధవు ల • పారకృపారసపూర్ణ చిత్తులై
పాడిగమంత్రతంత్రవిధి;•భామరో! నాఁటిక్రియామనాదెసన్
జూడనిజీవి తేశుఁగని•శోకముతోనిటులంటిమొక్కుచున్॥

ఆ॥ వె॥ చల్ల కేగుదెంచి • సందియంబున ముంత
దాపనేల సెప్పుడీ! • తలను వంచు



కత మదేమొ యంచుఁ • గడు వేఁడికొనఁ గొంత
వడికి జాలి నొంది • పలికె నతఁడు॥

మ॥ సతిరో! నీపయిలేదు నాకెడఁదనే•సందేహముం జూచినన్
సతతంబొందుమనోభిలాష మెయినా•స్వాంతంబుశంకించునా
కతముం దెల్పినఁదీర్తువేయననటుల్ • గావింతునాశక్తిమై
పతి! మీపాదములానయంచననిటుల్ • వల్కన్ సఖీ! యా
తఁడున్

కం॥ పాతివ్రత్యము సెడకయ
నాతీ! నను మోసపుచ్చి • నందనుఁ గనుమా;
పూతచరిత్రి వటంచున్
భూతలజను లెల్ల మెచ్చి • పొగడెడు భంగిన్

కం॥ అనవుడు నాథా లోకులు
వినని కనని దానిఁ గోర • వెంగలి యనరే!
యనఁ గుపితచిత్తుఁ డై దాఁ
జనె దినములు గొన్ని పుచ్చి• స్వపురిం జేరన్॥ ౧౬

శారదు వెరపుచెప్పుట

కం॥ ఆమాటల విని శారద
యోమానిని! దీనికింత • యోచించెద వే
నీమానస మరయనొ తన
నామం బెఱింగించుటకో యొ • నర్చె నతఁడటుల్

కం॥ సరసీరుహాక్షి! నాకొక
వెర వెదస్ఫురియించె దీన్ని • వినుమా! చింతన్

బొరసిన లాభము లేదే
వరుసనొ పతిఁ గూడఁ బోవ • వలె నీ వింకన్॥

ఆ॥ వె॥ అందుకొఱకుఁ బోదు • ముందుగా నీపతి
పురమున కురహస్య • ములఁ గ్రహింప
మగిడి వచ్చి కార్య • మార్గంబు దెల్పెద
నీక టంచుఁ జెప్పి • వీఁకఁ బోయి॥

ఆ॥ వె॥ కొన్ని దివసములకు • నన్నాతి వచ్చి తా
జ్ఞానవతిని గాంచి • సకియ! వినవె!
మాఱువేస మూని • ధీరత నటఁ జొచ్చి
వార్త లెల్ల నెఱిఁగి • వచ్చితిఁ జుమి॥

తే॥ గీ॥ ఒప్పిదము దప్పి యుండె న • యోధ్యరాజు;
గాటపుం బ్రేమ కొమరుపైఁ • గల్గియుంట
నెప్పు డేడఁ బాసి యుండమి • నిప్పు డింత
కాల మా నిజాడయే • గాన కుంట॥

తే॥ గీ॥ అనుడు నా జ్ఞానవతి పల్కు • నామెతోడ
నా ప్రియుం డింతదనుక ను • నగరి కరుగ
కుండ నెచ్చోట నిలిచి తా • నుండె నొక్కొ
యైన; నాపయి సంగతు • లన్ని సెపుమ!'॥

తే॥ గీ॥ అనఁగ శారద యిటు లను • నాత్మసఖిరొ
నీదు మామయె గాక చె • న్నేది; యత్త
లో నయిన వార లెల్లరు • లోచనములఁ
బ్రాణములు నిల్పియున్నారు • వానిఁ జూడ॥



తే॥ గీ॥ నిన్న నా రాజు సభ చేసి • నెనరు దోఁపఁ
బ్రెగ్గడం గాంచి 'నా సుతున్ • రేపమాపొ
తోడుకొని రాఁగఁ జెప్పుమా! • దూతతోడ!'
నాఁగ నాతండు నట్లు ని • ర్ణయ మొనర్చె॥

ఆ॥ వె॥ ఇంతదాఁక నెఱిఁగి • యిటు వచ్చుడితటిం
బాట నొక్కకొత్త • వార్త వింటి
నే మనంగ నీ బహిః • ప్రాణి మాధర
వేదపురికిఁ బోయి • విడిసె నంట॥

కం॥ అట వానికి సున్నాఁ డట
పటుగుణసంపన్నుఁ డైన • పార్థివుఁ డాప్తుం
డట నాతఁ డున్న దెఱుఁగమి
నిట కిపు డా దూత నంప • నెంచిరి వారల్॥

ఉ॥ కావునఁ గూడి యిద్ధ్వరముఁ • గల్గెడి కష్టము లెల్ల నోర్చి వే
పోవలె మాఱువేసములఁ • బూనియ వేదపురంబు సేరఁగన్;
నీ విభు మోసపుచ్చి బలు • నేర్పుగ వానిని నీవు గూడఁగన్
దైవము గూడ నీ పనికిఁ • దప్పక సాయ మొనర్చుఁ గాతనాన్॥

కం॥ 'ఓసఖి! నీ నుడి చొప్పునఁ
జేసెద సాహసమె లక్ష్మిఁ • జేకూర్చు నిలన్
వాసి యొసంగును జనులకు;
దోసము లేనట్టి మంచి • త్రోవం బోవన్॥

జ్ఞానవతీశారదలు దేశాటనకుఁ బోవుట

కం॥ ఈ వృత్తాంతము నేరికి
నావంతయు నుడువఁ; గాని • యర్థనిమేషం

జే విడువ లేనిమాతకు
నేవిధమునఁ జెప్పకుండ • నేగుదుఁ జెపుమా!॥

ఆ॥ వె॥ కాన నామెతోడఁ • గలరూపు నొప్పగాఁ
జెప్పి యొప్పెనొనఁగఁ • జేసి పిదప
నేఁటి రేయినడుమ • నేను బయలుదేఱి
యూరిబయట మఱ్ఱిఁ • జేరి యుందు॥

కం॥ అన నామెయు సమ్మతిపడి
చనె నింటికి నాఁటి రేయి • సకియ లిరువురున్
గనరైరి; కూర్మి నింతయు
మనమునఁ గార్యానుకూల•మార్గ మరయుచున్॥

కం॥ శారద ముందామఱ్ఱిని
జేరెఁ బురుషవేష మూని • శ్రీపవన జవా
శ్వారోహణంబు సేసి వి
హారారామమున కేగు•నట్టుల నెలమిన్॥ ౧౦౨

ఉ॥ అంతటఁ గొంతసేపటికి • నయ్యెడ కేగెను; రాజుకూఁతు రొ
ల్లంత ముసుంగు వేసికొని• యావలపూరుష వేషమూనఁగా
స్వాంతమునందలంచుకొని•వాయుజవాశ్వము నెక్కి స్వచ్ఛ మా
కాంతులఁ జిమ్ము ద్విడ్భయద•ఖడ్గశరంబులుదాల్చిధీరతన్॥

ఆ॥ వె॥ ఆమెరాక గాంచి • యమితమోదము బంది
ప్రౌఢ శారద యిటు • పల్కె నపుడు



మాఱువేస మూన • కీర్తిఁ బోవుచో
భంగపడమె! మనము • పరులవలన॥

తే॥ గీ॥ అనుడు నాఁగాక యంచు దేహంబుమీఁది
భూషణంబుల వెస నొల్చి • మూట గట్టి
పురుషవేషంబు ధరియించి • పోవు చుండఁ
జూచి రాచెట్టుపై నున్న•చోరు లంత॥

చోరులొండొరులు సంభాషించుకొనుట

తే॥ గీ॥ వారిలో నొక్కఁ డొకనితోఁ • బల్కె నిట్టు
లోరి! యీరేయితో మన • కున్న లేమి
దీఱు; దారికి నడ్డమై • వీరిఁ గొట్టఁ
బూర్ణముగఁ బ్రాప్త మా దివ్య•భూషణములు॥

తే॥ గీ॥ అనుడు నింకొకం డిట్లను • మనకుఁ దరమె?
కొట్టి వీరలద్రవ్యంబు • గొల్లపెట్ట
దండిమగలుగఁ గనపట్టు • చుండి రీర;
లెవ్వరో రాజులైయుందు • రెంచి చూడ॥

తే॥ గీ॥ అట్టు లనఁగ నింకొకఁ డిట్టు • లనియె నపుడు
పిఱికివాఁడవు గావున•బెదరె దట్టు
లోరి! నాబోఁటి ధీరుఁ డౌ • చోరవరుఁడు
భీతి గనునె! దుర్బలు లగు • వీరిఁ గాంచి॥ ౧౦౩

తే॥ గీ॥ అన మఱొక్కరుం డిట్లనె • నంతలోన
నోరి! వీరిటు నడురేయి • నూరుబయలు

దేఱు టది చూడ మదిఁ దోఁచు • జారు లంచుఁ
గానిచో నామె మగవేస • మూనుటేల?

తే॥గీ॥ అనుడు వేరొక్కఁ డనియె నీ • వన్నయట్లు
కాదయేని ముం దొకఁ డేల • గడఁగివచ్చు?
మఱియు నామెను వేసంబు • మార్చు మంచు
నేల వాఁడు బలాత్కార • మొనఁగఁ జేయు॥

తే॥గీ॥ అనుడు నంత దొంగలదార • యనియె నిట్లు
లోరి! మీ రేల నూరకే • నోరు విడిచి
పేర్లెదరు! వీరి మార్కొని • పీఁచ మడఁచి
రండు పొండని పురిగొల్పి • గండుమీఱ॥

జ్ఞానవతీ శారదులకు దొంగ లడ్డముగుట

తే॥గీ॥ వారిదారికి నడ్డమై • చోరు లప్పు
డొక్కపెట్టున బొబ్బిడి • నిక్కి నిలిచి
వేగ మీడబ్బు మా కిచ్చి • వెడల రేని
ప్రాణములు గోలుపోదు రీ • రాతిరనుడు॥

కం॥ వీరలు చోరులు మనలను
గాఱియపెట్టంగ నెంచి • కడు వడి నిట్టుల్
దారికి నడ్డం బై రని
శారదచెలి మించి కురిసె • శరవర్షంబున్॥ ౧౧౩

తే॥గీ॥ దెబ్బలకుఁ దాళలేక తబ్బిబ్బుపడుచు
దబ్బునం దుడ్లు మూఁపులఁ • దాల్చి వారి
దుడ్డుపై నాస విడి తమ • దారను గలిసి



వణఁకుచుం బడ్డపాట్లెల్ల • బల్క నతఁడు

మ॥ భటులారా! వచియించెద న్వినుఁడి! నా • భావంబు దెల్లంబుగాన్
జటులస్వాంతుల రైతిరింతపనికే • చాల్చాలు బాగాయె! మీ
పటుధీరత్వము నేఁడు వెల్లడిపడెన్; • బాణావళిన్నాటుచో
నెటులో యుక్తినొకండు పన్ని పరులన్ • హింసింప లేరైతిరే!

కం॥ కావున వారలు వోయెడి
త్రోవకు నడ్డంబు సొచ్చి • దొంగ లనుచుఁ ద
ద్భావములకుఁ దోఁపింపక
యేవేసమ్ములనొ దాల్చి • యెఱుఁగనిభంగిన్॥

తే॥గీ॥ వార లేమఱి యున్నప్డు • ప్రక్కనుండి
వారివాజుల ముందటి • పాదములను
మీకృపాణప్రహతిఁ దుంచి • మించి పాఱి
రండు వారప్డు మనకు దొ • రకుదు రనిన॥ ౧౧౭

ఉ॥ వారలు నట్లె వారరుగు • బాటకు నడ్డము సొచ్చి వేసముల్
మాఱిచి పాంథులట్లు గరిమంబునఁ బోవుచుఁ బ్రక్కప్రక్కలన్
ధీరతఁ బొంచి యుండి తఱి • నింగని శారద తేజికాళ్లు ద
చ్చోరుఁ డొకండు వేసఱికి • జోక మొయింబరు వెత్తునత్తఱిన్॥

ఉ॥ జ్ఞానవతీసతీమణి వె • సందనగుఱ్ఱము మీఁద శారదన్
దానుగ నెక్కఁ జేసి పర • మాగ్రహవృత్తి మలిమ్లుచావళిన్
బూనిశరోగ్రవృష్టివగఁ • బొందఁగ జేయుచు వెన్నుఁదన్నుచున్
దూనిఁగ మాడ్కి నెల్లెడలఁ • దోఁచుచు నల్వురఁ దున్మె నొక్కచోన్॥

క॥ హతశేషులు వేగమె తమ
పతికడ కేతెంచి దుఃఖ • భావంబులతో
బ్రతికితి మిప్పటి కయ్యా!
క్షితి నాకలు నాకు నింక • శేషించుటచేన్ ॥

క॥ ఆయువు సెల్లినదూతలు
పోయిరి; యమపురికి నల్ల•భూపాస్త్రములన్;
వాయువు వీచినఁ బసచెడు
తోయదములభాతి వింటె! • దొర! మాపాట్లన్ ॥

తే॥గీ॥ అనఁగ నాచోరనాయకుం • డనియె నిట్లు
లోరి! మీరేల చింతించు! • టూరకొనుఁడు
నేను వారల వంచింపఁ • బూని పోదు
మీరలును రండు నావెంట • ధీరులౌచు ॥

తే॥గీ॥ అని కథించి తూర్ణంబె స • న్యాసివేష
ధారియై పోయె నటఁ దెల్ల • వారువేళ
వార లిద్దఱు సుఖముగా • వాజి నెక్కి
పోవు చొకచోట దాటిని • బోల్పలేక ॥

తే॥గీ॥ భీకరాటవి యైనను • భీతిపడక
త్రోవ వెదకుచు నొకతప్పు • త్రోవఁబట్టి
సాగి పోవుచు నొక తరు • చ్ఛాయఁ గనులు
మూసికొని యుండునట్టి సం•న్యాసిఁ గాంచి॥ ౧౨౮

సీ॥ మఱ్ఱియూడల నీ । మౌనీంద్రు పెంజడల్
రాగివన్నియతోడఁ • దూఁగుచుండె



మఱ్ఱిబోదియన నీ • మౌనీంద్రు పేరురం
బతిఘనవిస్తీర్ణ • మై యెసంగె
మఱ్ఱిపండ్లనఁగ నీ • మౌనీంద్రు రుద్రాక్ష
మాల వ్రేళ్లనడుమఁ • గ్రాలుచుండె
మఱ్ఱికొమ్మలన నీ • మౌనీంద్రు భుజశాఖ
లత్యంతదీర్ఘంబు • లై పొసంగె

తే॥గీ॥ సర్వభంగుల మఱ్ఱికి • సవతువచ్చి
యుఱ్ఱితోలున దీక్షమై • మఱ్ఱినీడ
గూరుచుండిన యీజడ • దారిమిన్న
యెవ్వఁడోయని మది నెంచు • చేగి వారు ॥

క॥ వినయమున నమస్కృతు లిడఁ
గనియుఁ గనని యట్లు మౌని • గనులఁ దెఱచుచున్
ననుఁ దపమునుండి విముఖత
నొనరించినమీర లెవరొ • యొపవిగఁ జెపుఁడీ!

చ॥ అనవుడు యోగిభూషణ! హృ•దంతరదృష్టిని బొఱిఁజూడమీ
కనులకుఁగట్టినట్టు లెఱుఁ • గంబడు; మాచరితంబు లెల్లఁగా
వుననడుగంగ నేలయతి • పోనిధి! కోపముడించిసత్కృపన్
గనుమనదంభమానియును•కంపనుబొందినజాడఁదెల్పుచున్

ఆ॥వె॥ అంతరంగదృష్టి • నరసెడిభంగి న
టించి కొంతసేపు • మించినంతఁ
గన్నుదృష్టిఁ జూచి • కలరూ పెఱింగితి
మీర లిర్వు రొండు • కారణమున॥ ౧౨౯

ఆ॥ వె॥ వేసములను మార్చి • వెడలినా రొక్కొక్క
జక్కి నెక్కి మొదట • నుక్కు మిగిలి
పిదప నొక్క వాజి•పదములు తెగిపడ
నిద్ద ఱొక్క తేజి • నెక్కినారు॥

ఆ॥ వె॥ మఱియు గొంతి రాట • మార్గంబు దప్పినా
రడవి యాట బల్ప్రి•యాసపడుట
నందుచేత నిట్లు • లక్షించెదరు నన్ను
'దారిఁ దెల్పుఁ' డంచుఁ • దమ రనంగ॥

కం॥ ఇతఁ డీల మహానుభావుఁడు
యతివర్యుఁడు కాలవేది • యని నమ్మటచే
స్తుతియించి వార లని రో
యతివర! మీ కెఱుఁగరాని • యంశము గలదే॥

కం॥ నరసంచయ హృదయభయం
కరసత్వావాస మైన•కానన మిది యాఁ
గణించి ముందుపుక్రమున
కరుదెంచెడిదారి దెల్పు•మా! ఋషివర్యా!॥

కం॥ అన సంయమి దరహాసా
ననుఁడై యను మీర లీది•నంబున నిచ్చో
టను గలనా యాశ్రమ మం
దునిలిచి యాతిథ్యము గొనఁ • దుష్టిపడెద నా॥ ౧౩౭

దంభమాని వృత్తాంతంబు బయల్పడుట.

కం॥ నిద్దురకు వాఁచి యుంటన్



దద్దయు శ్రమచెంది యుంటఁ • దరణిమరీచుల్
పెద్దవెఱిగి మెయిఁ గాల్చుట
వద్దనలే కచట నాఁడు • వసియించుటకై॥

ఆ॥ వె॥ నిశ్చయించి వా ర•నిరి తత్కపటజటి
నైజ మెఱుఁగలేక • నతు లొనర్చి
'సదయహృదయ! నీకు • నెదు రాడఁ జాలక
నిలిచినార మయ్య! • నేఁ డిచటనె'॥

కం॥ నాఁగ ముద మంది మదిలో
సాగెం దనకృత్రిమంపు•జతనం బని యు
ద్యోగి నిజశిష్యునిం గని
వేగ మదాశ్రమముఁ జూపు • వీరి కటన్నన్॥

ఆ॥ వె॥ 'భళిర! రొట్టె నేతఁ • బడె' నంచు నెద నెంచి
తత్క్షణంబె మనికి • దారి దీసి
వారిని గొని పోయి • బైరాగు లున్నట్టి
మఠము వాఁడు సూప • మదిని వారు॥ ౧౩౮

మ॥ ఒకరా! యిద్దఱ! లెక్క వేయుటకు వే•లున్నట్టులున్నారలీ
ప్రకటాభీలవనాంతరస్థలిని నీ • బైరాగు లెబ్బంగిఁ గూ
డుకొనం గల్గిరొ; చిత్ర మాయె! జపని•ష్ఠుల్ వహ్ని దే
వార్చకుల్
సకలామ్నాయవిచారు లీఘనులప్రి•జ్ఞం జెప్పఁగా శక్యమే॥

ఆ॥ వె॥ అంచు నెంచు చెంతో • యాశ్చర్యపడుచుండ
నరుగుదెంచి రంచి•తార్ఘ్యపాద్య

ములను గొని యిరువురు • మునికన్యకామణుల్
మెఱుఁగుతీఁగ లట్లు • మేను లలర ॥

కం॥ వారును హర్షాధికతన్
బోరనఁ దద్వస్తుచయముఁ • బుచ్చుకొని యటన్
గారవ మొందుచుఁ దత్క
న్యారమణులచిన్నె గని • సుహాస్యపుఁజోటన్

ఉ॥ రూపవిలాసముల్ గనిన • రూఢిగఁ దోఁచెడునాత్మలోన నే
భూపవరేణ్యువంశమునఁ • బుట్టినబోట్టులో! యంచు వేసము
ల్తాపసకన్యకావిధముఁ • దద్దయుఁ జూపెడుసత్య మేదియో!
మా పయిఁ బ్రేమతోఁ జెపుఁడి! • మాచరితంబును దాఁప
మింతయున్ ॥

కం॥ అని మఱియు ముందువారలె
మన సిచ్చి నిజచరితలుగ్ర • మంబుగ నుడువన్
మునికన్యలు విశ్వాసం
బునఁ జెప్పం దొడఁగిరి తమ • పూర్వచరిత్రన్

తే॥గీ॥ యవనదేశాధిపతితన • యలము సుమ్మ!
యక్కచెల్లెండ్ర మిరువుర • మాదు మమ్మ!
జంటఁగా నేకశయ్యఁ బ • రుంటి మమ్మ!
చల్లగాలికై యొకరేయి • సౌధమందు ॥

కం॥ ఆరాతి రెట్టులో! యీ
చోరులు మా మేడ సొచ్చి • చూఱఁగొని వెసన్
బాఱిరి; మంచముతో మము
నేరుపుమై దొంగిలించి • నిద్రావస్థన్ ౧౪౪



కం॥ కాంచితిమి మేల్కొని వని భ్రి
మించితిమా యంచు లోన • మిడుకుచు నుండన్
మంచమునంచల నిల్చిన
వంచకు లీచోరు లప్డు • వచ్చి యని రిటుల్ ॥

ఆ॥వె॥ భూపతనయలార! • లోపంబు మీకింత
గలుగఁ బోదు; నమ్మి • మెలఁగుఁడమ్మ!
మాదొరకు మదిని గొ • మార్త లేదనుచింత
దీఱమిమ్ముఁబట్టి • తెచ్చితి మిటు ॥

సీ॥ బైరాగిమఠముగాఁ • బైకగపడుఁ గాని
కృతకసౌధము నేల • క్రిందఁ గలదు
పగటివేళం జూడ • బైరాగులమె గాని
నిశల దొంగల మగు • నేర్పు గలదు
పరులచే నొక్కప్డుఁ • బట్టుపడము గాని
పరు లెవ్వ మాకు లోఁ • బడుట గలదు
రా జన నొకదేశ • రాజ్య మేలెడుఁ గాని
మారాజుగారికీ • మహిమయె గలదు

ఆ॥వె॥ ప్రీతిపురమున కొక్క • గతి వైభవమె గాని
మాపురి కఖిలార్థ • మహిమ గలదు
గానఁ గొదవ లేదు • కామితార్థములకుఁ
బ్రీతిఁ బొంది ప్రేమఁ • బెంపుఁడమ్మ! ॥ ౧౪౭

కం॥ అనవుడు వారికి మే మే
మనుటకు సమయంబు గామి • నత్తఱి నటు కా

దని యోనని సెప్పక మత
ము నెఱింగించితిమి హర్ష • ముఖచిహ్నములఁ॥

తే॥ గీ॥ పిదప గొంతకాలముదాఁకఁ • బ్రేమఁ జూచి
చోరనాథుండు మమ్ములఁ • గోరెనిట్టు
లోపడుచులార! ననుఁ గూడి • యుండు రేని;
లోటు చేయ నెల్లపుడు మీ • మాట నుందు॥

తే॥ గీ॥ కాదయేని మిమ్ముల బలా • త్కారముగను
బొందఁ గలవాఁడ నని మీరు • డెందమందు
నమ్ముఁడని వాఁడు పల్క, మ • నమున మేము
దూర మీక్షించి దొంగల • దొరను గాంచి॥

తే॥గీ॥ పరిణయంబు గాలే దింత • వఱకు మాకుఁ
గాన నిను మించుఘనకాంతుఁ • గాంచలేమ
టంచు మామనమ్ములు సమ్మ • తించెఁగాని
యింకొకరహస్యమును వచి • యింతుము విను॥

తే॥గీ॥ దక్షిణాయన మిప్డాటఁ • దగదు పెండ్లి;
గనుక నీక నాఱుమాసముల్ • గడపి యుత్త
రాయనమున మనము వివా • హంబు చేసి
కొనుట శ్రేయమ్ము సుమి! చౌర్య • కోవిదుండ!

తే॥గీ॥ అంచుఁ గపటంబుతోడ వ • చించి వాని
మనము రంజించి నమ్మించి • వినయగతిని
వంట మొదలగుపనుల వ • న్నింటిఁ గాక
హింసలను గూడఁ జేయ స • హించితి మిట॥ ౧౫౩



తే॥గీ॥ అవ్వియే వన; దారి స్త్రీ లెవ్వ రైన
మీవలెనె మార్గముం దప్పి • మిడుకు చున్న
వారిఁ గొని వచ్చి యిట నుంచి • పవలుపుచ్చి
పేర్మి విడిచి మాచేతఁ జం • పించు వీఁడు॥

ఉ॥ నాఁటికి నేఁటి కిచ్చటివ • నాటమృగంబులె చేటికాతతుల్
మోటగనుండుతోల్లె ముక • ముక్కలెవస్త్రవిభూషణాళి వే
యేటికిభూమినారక మిఁ • దేసుఁడి! ప్రాణములు మీఁదిటిపి; ఘో
రాటవిఁ జేరియుంబ్రదుక • నైతిమిసత్కృపఁజూచిగావరే!॥

యవనభూపసుతలు చెఱఁబాయుట

తే॥గీ॥ నాఁగ నాజ్ఞానవతి యిట్లు • నంగఁ జొచ్చె
నుమ్మలించుట మానుఁ డో • యమ్మలార!
కొలఁదికాలంబులో మీకుఁ • గోర్కెదీరు;
దైవమును దోడ్పడును మన • తలఁచునట్లు॥

తే॥గీ॥ అంచు వచియించి తోషాబ్ధి • ముంచి వారి
ని జెలియుండ్రఁగం గాంచిన • స్నేహబుద్ధి
రక్ష సేయఁదలంచి చో • రతతి నొంచి
మించి పరతెంచుదారి యో • చించుటకయి॥ ౧౫౪

తే॥గీ॥ ఎప్పు డేమలిమ్లుచు లెల్ల • రేగుదెంతు్రో;
చౌర్యవృత్తి నూరూరును • జక్కఁబెట్టి?
మరల నేవేళ నిలు సేర • మల్లి వత్తు?
రెచ్చు టుంతు రీరలు ధన • మెల్లఁజెపుఁడ!॥

కం॥ అని తదా్రిశాత్మజలను

వినయముతో నడిగి గుట్టు • వివరం బెల్లన్
మనమలరఁ దెలిసికొని యా
దిన మచ్చటఁ బుచ్చి బయలు • దేఱె సఖులతోన్

ఆ॥ వె॥ అనఁగ సంశయాళుఁ • డానందమున బొంగి
మధురవదన! సర్వ • మాన్యధిషణ!
పిదప వార లెట్లు • వెడలిరి? యటనుండి
యెడ కేగినారొ • యెఱుఁగఁ జెపుమ!॥ ౧౬౦

కం॥ అనఁ బరవిదుఁ డను ని ట్లా
జనధూర్తాధిపుఁడు నమ్మ • సాంతోవృత్తుల నీ
దిన మేము ముందు పురికిం
జనవలయును ముదల నిమ్మ! • సంయమివర్యా! ॥

కం॥ అని జ్ఞానవతీశారద
లన వారలమోసపుచ్చ • నాత్మఁ దలఁచుటన్
మునివేషధారి యి ట్లను
జనవచ్చును నిలుఁడు నేఁడు • నంతోషింతున్ ॥

కం॥ అందుల కామోదించిన
చందముగా వారుకొంత • జరిపిరి నటనన్
డెందమునం దుప్పొంగుచు
నందుల కాకపట యతిర • హాస్యస్థలికిన్ ॥

ఆ॥ వె॥ యవనదేశభూధ • వాత్మజలఁ బిలిచి
నేఁటిరేయి వీరు • నిదురకొరుగఁ
గఠినఖడ్గధారఁ • గంఠముల్ విదళించి



పొందుఁ డమ్మ! వీరి • భూషణములు॥ ౧౬౪

తే॥ గీ॥ అని తళుకుతళు కనెడికా • రాసి నొకటి
వారి కిచ్చి తాము పడిన • పాట్లఁ దెల్పి
పొద్దు కుంకంగ దండుతోఁ • బోయె నతఁడు;
చుట్టుపట్లపట్నము లెల్లఁ • జూచి గొనఁగ॥

ఉ॥ వీరలు నల్వు రానిశను • స్వేచ్ఛఁగ నింటిని జక్కఁబెట్టి త
ద్భూరిమ యాంచితప్రముఖ • భూషలు ద్రవ్యము మూట
గట్టి యా
చోరులవాజిశాలఁ గని • చొచ్చి శుభాశ్వచతుష్టయంబునన్
ధీరతనెక్కి వేగనొక • తెన్నునఁ బోయిరి సమ్ముదంబునన్॥

వనవర్ణనము

సీ॥ నడఁగొండలో నాఁగ • నడయాడు చుండెడి
నాగతండము గంటె! • నాతిమిన్న!
తెల్లఁద్రాఁచులఁ బోలెఁ • బెల్లునఁ బాఱెడి
నిమ్నగాతతిఁ గంటె! • నీరజాక్షి!
భువి దివి నొడింపఁ • మొలచుబాణా లను
వంశావళిం గంటె! • వనజగంధి!
మాపటివేళకు • మాతగా నుండుత
మాలపంక్తిని గంటె! • మధురవాణి!
తే॥ గీ॥ కాండుశ్రీకాం డ్రనుబెబ్బులి • గములఁ గంటె!
బెదరి వెనఁ జిఱుచెడి లేళ్ళ • పిండుఁ గంటె
భయ మెఱుంగనిభూదార • చయముఁ గంటె!
ఖడ్గశరభ కాసరభల్లు • కములఁ గంటె!॥ ౧౬౭

కం॥ చీఁకటి నభివంఖజనహృ
ద్భీకర మై పఱచునైలు • తేజమున, బలో
త్సేకంబుతోడ వచ్చెడు
నాకోల్పులికములకాంతు • లక్కరో కంటే!॥

కం॥ కరణము లొండొరులంబడఁ
బొరయుచుఁ గృషికులకు నష్ట • ముం జేసెడున
ట్లొరయికగని యెండిన మ్రో
ళ్లెరగలిఁ గలిగించె నడవి, • నెల్ల దహింపన్

ఆ॥వె॥ అలవు బలువుఁ బరువు • నెలవుఁ జనువుఁదను
వెఱుఁగఁ జేయు మనల • కెదురు పడెడు
నల్లసింగదృష్టి • పిల్లను గాంచితే!
యలికులాభ వేణి!' యబ్జపాణి॥

తే॥గీ॥ అంచు నొండొరు లనుకొను • చరుగ నరుగఁ
దెల్లవాఱెను దిశలెల్లఁ, • దెల్లవాఱె
సూర్యుఁ డలరారె దమ్ముల • స్రుక్కుదీఱె
వారిముఖములు విప్పారె • వంత జాఱె॥ ౧౭౧

కం॥ అంతట నా ఘోరాటవి
సంతతపథికాప్తగమన • సరణి నడుచుచు
న్నంత నొకవిప త్తొదవెన్
వింతఁగ వారలకు; వినుమ! • విప్రకుమారా!॥

జ్ఞానవతి కళింగరాజుచేఁ బట్టువడుట

కం॥ మృగయాక్రీడార్థము సుభ



టగణాకీర్ణుఁ డయివచ్చె • ధకాదులతో
మిగిలి కళింగనృపతి నాఁ
డె; గాన వేఁటాడె; మదకి • టిప్రముఖములన్॥

కం॥ అందొక్కవరాహము పో
టుందిని కెడయు కడరుచుఁ బ • టురయంబుననా
క్రిందఁ మొనర్చుచు వీరల
ముందటిదిక్కునకు వచ్చెఁ • బొ్రిపు డనునటుల్॥

తే॥గీ॥ దాని వెనుకొని వచ్చె నా • ధరణివిభుఁడు
విల్లు నమ్ములు దాలిచి • భీమవృత్తి
వానిఁ గని జ్ఞానవతి యిట్లు • పలికె నపుడు
వీరపూరుషవేషంబు • వేసెఁ గాన॥ ౧౭౫

చం॥ శరణని వేఁడఁగాచుట యొ • క్షత్రియధర్మముగాన నాకుముం
దర బహుళార్తియై నిలిచి • తద్దయుజాలిని గోల్పుచున్న యీ
శరహతదంష్ట్రి నే విడువఁ • జాలను; గావున వీడి పొమ్మ! యో
ధరణిధవేంద్ర! యుష్మదభి • ధానము రాజ్యముఁ దెల్పి
ప్రేముడిన్॥

చం॥ అనవుడు నెందు మ్రోడులకు • నగ్గితగిల్చిన మాడ్కి తీవ్రకో
పనయనదీప్తుఁడై యహిత • వర్గము గుండెలు జల్ల నంగఁ బె
ల్లునఁ బలికెం గళింగపతి • లుప్తదయామతి యాచు వేగమే
చనుఁడయ! మీరు పోవుగతి • సంగరమానటుగాని చోనవన్

కం॥ పెద్దగ నినుఁ జూచుటచే
నొద్దికలోఁ బల్కినాఁడ; • నుర్వీనాథా!

యుద్దియగురాజు నౌననుఁ
దద్దయు నిరసించి ద్రోయు • ధర్మమె! సెపుమా!॥

కం॥ ఇష్టంబు లేనిచో నది
స్పష్టంబుగ నెమ్మిఁ దెల్ప • సరసము; గాకే
కష్టోక్తిపరంపరల న
వష్టంభివి యాటఁ గాదె! • పలుకుట రాజా!॥

తే॥ గీ॥ ఇష్ట డయినను దొలఁగి పో • వొప్పిదముగ
నప్పగిది సేయ కున్నచోఁ • దప్పదింక;
ఘోరయుద్ధంబు మనల కీ• ఘోణిఁ గూర్చి
నాఁగఁ గ్రుద్ధుఁడయి కళింగ•నాథుఁ డనియె॥ ౧౭౦

సీ॥ దారి నడచువారు • తలవంచుకొని పోక
పరులసంగతిఁ దలఁ•వంగ నేల?
తలఁచినన్ వారల•తలఁపు వెన్నడిఁ బోక
వ్యతిరేకవాక్యము • ల్పలుక నేల!
పలికినా రని వార • లలుగ వే వెన్నిక
డీకొని పోరాడ • దూఁక నేల?
దూఁకియు శూరతఁ • దొడరి పైఁ బడ లేక
బెదరింపుమాటలు • వేల నేల?

తే॥ గీ॥ కట్టిపెట్టు; నాకడ నీదు•దిట్టతనము
శత్రుసంతాపకరుఁ డంచు • నన్స్తుతింతు
రట్టియాకళింగనృపతి • యని కలుకున:
మిన్ను విఱిగి పైఁ బడినను • దన్నుఁ గాని!



కం॥ పోరాట వ్మగు మన కని
బీరముతోఁ బలికితి గద! • పిఱికినక ననున్
జేరి భుజబలము మెఱయఁగఁ
బోరి గెలుమ! స్వబ్ధరోమ•ము న్వ్రాడి పోదుర్॥

కం॥ అటు గాక నేన గెలిచినఁ
గిటిఁ గొనిపోవుటయె; గాక • కీడ్పఉపఁగ ని
న్నిటుపైఁ జెఱఁ బెట్టెద న
క్కటికం బొకయింతలేని•కఠినాత్ముఁడ నై॥

ఆ॥ వె॥ అంచుఁ గోలుమసఁగి • యంపవానం గురి
పించి దేహమెల్ల • ముంచె నతఁడు;
గాని యామె ధీర • గాన మేరువుభంగిఁ
గలఁతపడక నిల్చెఁ • గదనమునకు॥

ఆ॥ వె॥ నిలిచి బాణసమితి • నిగిడించి మైఁబెంచి
కత్తళంబుఁ జించెఁ • దుత్తుముఱుగ
నంత నతఁడు పట్టె • నంత నొల్చినలేఁత
చెట్టుపగిదిఁ దోఁచి • పట్టు విడక॥ ౧౭౧

కం॥ బి ట్టదరి గిట్టి యసమున
నెట్టనఁ గ్రూరాస్త్రయుగము • నిగిడిచి యచ్చో
నిట్టలపుమూర్ఛ నెందం
గట్టిగనాటించె; నామె•కంజముఖమునన్॥

కం॥ ఆలోనన తద్భూపతి
కాలుబలము లెల్లఁ దనదు•కడ కేగుటచే

వైళముగా మనపురికీ
యాలములోఁ గూలినట్టి • యరిఁ గొని నన్నుఁడీ॥

కం॥ అనవుడు వారలు నట్లే
గొనిపోయిరి; దిశలు పగులఁ • గోలాహలని
స్వనము లొనర్చుచు ననఁగా
ననేఁ బరవిదుతోడ సంశ • యాళుం డంతన్॥

శారదాదులు, కళింగపురిని చెఱుకలై చరించుట

కం॥ "పరు లటు గొని పోయెడుతఱిఁ
బరమసఖులు శారదాది • భామలు లేరే?
దుర మేలసేయ రైరి? రది
త్వరఁగా నెఱింగింపు" డనుడుఁ • బరవిదుఁ డనియెన్॥

ఉ॥ "వారలకస్త్రవిద్య యల • వాటొకయింతయు లేకపోవుటన్
బోరెడువార లిర్వురుఁ బ్ర • భూతవిభాకరు లట్లు వెల్గుచున్
ఘోరమరీచిబాణతతిఁ • గోల్తల సేయుచు విక్రమోద్ధతిన్
దేఱి కనంగరామియును • ధీరలుగామియు నిల్చి రంచలన్॥

కం॥ పిమ్మటఁ దమచెలి పోరున
సొమ్మసిలం గాంచి దేర్పఁ • జూచియు వారల్
హా మ్మని తాఁకుచు నాభటు
లెమ్ములు పొడి కాఁగఁ గొట్ట • నేగిరి భీతిన్॥ ౧౯౧

ఆ॥ వె॥ ఏగుచున్నవేళ • నిట్లనె శారద
యవనదేశభూమి • పాత్మజలకు
సకియలార! మనము • శక్తి వంచన లేక



జ్ఞానవతిని దేఁగఁ • బూన వలయు॥

ఆ॥ వె॥ అట్లు శపథ మూని • యాత్మసఖిని దెచ్చు
నపుడ మనము చెలుల • మనఁగ వచ్చుఁ;
గాక, వెనుక దీయఁ • గపటసఖుల మని
జగము దూఱును జుమి • సంతతంబు॥

తే॥ గీ॥ అనఁగ వారును దమ కున్న • యార్తిఁ దెల్పి
వేగ నటు సేయు టిత వని • వినుతి సల్పి
తగిన వెర పుభయయులు నాత్మఁ • దడవికొనుచుఁ
బోయి రా కళింగనృపాల • పురముఁ జేర॥

ఉ॥ చేరియిటంచుఁ బల్కు నిజ • చిత్తవికాసము దెల్పు మోమునన్
శారదతక్కు వారిఁ గని • చక్కఁగఁ దోఁచెను పాయ మొండిటన్
సారసనేత్రలార! మన • సాహసధైర్యము లెల్లకాలమున్
నూరిజనాళియుం బొగడఁ • జొచ్చెదు దీన; వినుండి దెల్పెదన్

మ॥ మన మీపూరుషవేషము ల్విడిచి స • న్మానింప నీపట్టణం
బున సోదెం జెప్పుచుసానివేసములతోఁ • బోవంగఁ గొన్నాళ్లున
ద్వినుతిం గందుము లోఁ దెలుంగుదుము పై • వీ లెంచి రాజ్యార్థమున్
గనవచ్చున్ జయమొందవచ్చు వెరవుల్ • గల్పించి వేవేలొగిన్॥

ఆ॥ వె॥ అనుడు వా రిరువురు • హర్షించి రంతట
నూరిబయట సత్ర • మొందు నిర్జ
నంబుగాఁ బురాత • నంబుగా నుంటఁ జే
నందులోన విడిసి • రంద అంత ॥ ౧౯౨

ఉ॥ ఆనపకాయబుఱ్ఱ తల • యందునఁ గల్గినతంబుఱ ల్తైగన్
బూనితదీయతంత్రులుప్రి • మోదకరంబుగమీటుచేగ;నా
మానవతీత్రయంబు ప్రతిమానిని • వేఱుగ వీధివీధి నో
మానినులార!సోదెబుఱా•మార్గముగావచియింతుమంచనన్

ఆ॥వె అట్టులా పురంబు•నందుఁ బ్రతిదినంబు
దిరుగు చుండి యేమి • యెఱుఁగనట్లు
దెలిసికొంచు నుండు • కలమర్మముల నెల్ల
నెల్లవారు మెచ్చ • నెఱుక సెప్పి ॥

కం॥ ఇరువదినాళ్లగుపిమ్మటఁ
పురజను లొకచోట వింత • వుట్టె ననుచు నొం
డొరు లనుకొను చుండఁగ డ
గ్గరి యుం దొక్కరిత పూర్తి • గా నెఱిఁగి తగన్ ॥

ఆ॥వె॥ బసకుఁ జేరి యిటులు • పలుకు సఖులతోడ
సకియలార! క్రొత్త • సంగతులను
వింటి నేఁడు వినుఁడు • వివర మంతయు మన
కవియె దారి చూప•నౌను మంచు ॥ ౨౦౧

చం॥ మనచెలినీకళిందపుర • మానవనాథుఁడు నాఁడు తెచ్చి త
జ్జనములచేత స్త్రీయనెడి • సంగతి నెల్ల నెఱింగి కామియై
వనితరో! నీయుదంతము న • బద్ధములేక వచింపుమీఁదటన్
ననువరియించిభోగముల•నారతముంగనుమంచువేఁడినన్ ॥

జ్ఞానవతిఁ చెఱఁబాయుట

ఉ॥ ఆమెయు శత్రుపతిసమ•యంబని లోనగ్రహించియుక్తిచే



నీమనుజేశు మెల్లన జ•యింపఁగ నెంచి సిరంబువంచిరో
భూమిప! నేవినోదపుర•భూపతిబిడ్డను నన్ను శత్రులు
ద్దామపరాక్రమస్ఫురణ•దారితబాంధవకోటిఁ జేయగన్ ॥

మ॥ ననుఁగూడంబరిమార్తురంచుమదిదై•న్యంబొందినా చేటికా
జనులన్ మువ్వురఁదోడుతీసికొనివే•సాల్మార్చియచ్చోవటుల్
చనుచుండన్విధిమీకునాకుదురము•నంకల్పముంజేసెఁగా
వున మీచేఁబడియాత్మచేటికలప్రా•వున్వీడితిన్ భూవరా! ॥

ఉ॥ మీపటుబాణవిద్యకును • మీఘనదోర్బలసంపదాళికిన్
మీపురవైభవోన్నతికి • మీగుణరాజికి మీసుమాస్త్రశ్రీ
ద్రూపవిలాసరేఖకును • దృష్టిని బొందితిఁ గాని మీరలో
భూప!మదీయచేటికలఁ•బొందొడఁగూర్చియొపొందుఁడీననున్

తే॥ గీ॥ నాఁగ నతఁ డలరి ‘త్రుటిలో•న నమకూర్తు
నీతలం’ బని చెయి వేసి • చేతిలోన
నామె నూరార్చి సభ కేగి • యఖిలరాజ
పూజితుండయి నిజపీఠ•మున వెలంగి॥ ౨౦౨

తే॥ గీ॥ ‘చారులార! నూతనసమా•చారములను
దెల్పుఁడీ’ యన వారలు • ‘దేవర! మన
పురికి నెఱుక సెప్పెడి స్త్రీలు • మువ్వురేగు
దెంచి నిజము దెల్పుచు ఖ్యాతి • గాంచి’ రనఁగ॥

తే॥ గీ॥ ‘వారిఁ దోడ్కొని నేమేడ•పైకిఁ బోవు
నప్పటికి మీర లచ్చోట • కరుగుదెంచి
యుండుఁ డ’న వారలు వెదకు • చుండిరిప్డు

డిదియ నేవిన్న దనంగ శారద ముదమున॥

తే॥ గీ॥ 'చెలియలారా! మనచెలియ • చిక్కె మనకు
నేఁడు, గావున నావెంట,నే మెలంగుఁ
డంచుఁ బల్కి బంటులు పిల్వ • నరిగియటకు
రాజుకుడిచేయి వామకరమునఁ బట్టి॥

తే॥ గీ॥ 'రాజ! నీపాలఁ బడె నొక్క • రాజవదన
ప్రాపుమాలిన దాటచే • భవ్యసదన!
కొలదికాలంబులో నాపెకోర్కెఁ దీర్చి
పొందఁ గలవయ్య! రతికేళి; • డెంద మలర'॥

ఆ॥వె॥ ఆమెకోర్కె యేమి • టని యడిగెద రేమొ!
చేటికలను గూర్పఁ • జింత సేయు
వార లిప్పు డేడ • వర్తింతు రందురా!
తూర్పు భూమి నెమక • దొరకఁ గలరు॥

ఆ॥వె॥ అనుడు తేదు నమ్మి • బనిచెను దూతల
వారి నెదకి తేఁగ; శారద యట
రాణివాసమందు • రాజాంగనలఁ గాంచి
యెఱుక సెప్పి దనిపి • యెఱిఁగిచెలిని॥ ౧౧౨

కం॥ నీవేసము నేఁ దాలిచి
నీవిడిదల నుందు; వేగ • నీ వేగు చెలీ!
నావేసము దాలిచియే
నే వచ్చెదఁ గొంతవడికి । నెఱవెరవు మెయిన్॥

సీ॥ అని రహస్యంబుగా • నామెకు బోధించి



పంచి పిమ్మట నల్లి • బయలు వెడలి
దౌవారికులఁ గాంచి • దయతోడఁ బోనిందు!
దారి తెలియ కిటఁ • దడవు సేయ
వలసి వచ్చె నన నా • ద్వారపాలురు పూర్వ
మున్నట్టివారు కా • కుండుకతన
నెఱుక సానులు ముగ్గు • రే యన్న నంగతి
నిసుమంతయును వార • లెఱుఁగ లేక

తే॥గీ॥ దారి యిచ్చి పోనిచ్చి; రా • శారదయును
శాత్రవాగ్నికుండంబులో • శలభములుగ
మాడి పోకుండ హరికృప • నేఁడు దాఁటి
నారమంచుఁ జెలులతోడ • నగరిఁ దాఁటె॥

వేదపురీశునకు నైజమార్గుండు తనకథం జెప్పుట

చం॥ అనవుడు సంశయాళుఁ డప్పు,డప్పరవిద్వరుతోడ నోసుధీ!
మునుపటి నైజమార్గుఁడను • భూపకుమారకుఁ డేగెనంచుమీ
రనుట యెగానిమీఁద నెట్టు,లయ్యెనో! చెప్పరుగానఁ దెల్పుడి
ప్డని ప్రణమిల్ల నాతఁడుద • యాహృదయాధికుఁడౌచునిట్లనెన్॥

ఆ॥వె॥ నైజమార్గుఁ డట్లు • నాఁడు వేదపురిని
జేరి సంగడీని • చేతనాద
రింపఁ బడెను; బిదప • నిరుపురుసల్లాప
మాడునపుడు నైజ • మార్గసఖుఁడు॥ ౧౧౩

కం॥ ఇలుబయలు దేఱ వెన్నఁడు;
నలి బతిమాలినను మున్ను • నావంటినఖుల్

తలఁపనితలఁపుగ నివు డో
చెలికాఁడా! వచ్చి తిటకుఁ • జెపు! మాకతమున్

ఉ॥ నావుడునై జమార్గుఁడిట • నందొడఁగెం దనప్రాణమిత్రుతో
భావ మెఱుంగఁ జెప్పుటకు • వచ్చియుఁ గన్మదిజాకు లేల! స్ని
గ్ధా! వినునావివాహశుభ • కార్యముచక్కఁగనై నసంగతిన్
నీవును గన్న దే గద; మ • నీషులతో నట వచ్చి పిమ్మటన్

ఆ॥ వె॥ నాగవల్లి యైన • నాఁడు నిషేకంబు
జరిగెఁ; గాన రాత్రి • సమయమందు
నొక్కపిచ్చిపంత • మూనితి నెట లేని
దాని విన్నవవ్వ • మాన రెవరు॥

కం॥ నా విని నీమది శంకన్
బో విడి వే దెల్పు; స్నేహ • పురుషులు వినఁగా
నావశ్యకంబు లేదను
నావార్తలుగలవె! భూమి • వరయ వయస్యా!॥

ఆ॥ వె॥ అన నయోధ్యరాజ • తనయుండు మొగమున
వెల్లివిరియుముదము • వేడ్కఁ గొల్పఁ
బల్కె నిట్లు వేద • పట్టణాధీశుతో
బిడియ మెల్ల వీడి • ప్రియము మెఱయ॥ ౨౨౧

కం॥ ఆనాఁటిరాత్రిఁ గూర్చిన
నానావిధదివ్యభక్ష్య • నవ్యసుమాదుల్
గానక శయ్యాతలమున
నాననముం ద్రిప్పి యుంటి • నాసమయమునన్॥



సీ॥ ముసుఁగు దీయవు ముద్దు • మొగ మిటుసూపవు
నావల్లఁ దప్పేమి • క్ష్మావరేంద్ర!
అలుకవీడవు గంధ • మలదంగ నీయవు
నాదోస మేమి యో • నరవరేణ్య!
గానంబువినవు భ • క్ష్యమ్ములైనఁ దినవు
నాపున్నెమా యిది • భూపవర్య!
కన్నెత్తి గానవు • పన్నెత్తి పలుకవు
నాతప్పు దేదియో • పూతచరిత!

తే॥ గీ॥ కడకు నావేఁడికోల్వని • కరఁగవకట!
హేతు వెఱిఁగింప కిట్లు బా • ధించు టేల?
గొంగళిని రాలతో నింపి • గొట్టు టేల!
సెపవెమా వేగ వివరించి • జీవితేశ! ॥

కం॥ అని యిటు బహువిధముల నా
వనిత నను వేఁడికొనఁ గృ • పావంతుఁడనై
వినుమా! సఖి! చేసెద నని
యనుమానుడి; బాస చేసి • యన నాసతియున్॥

కం॥ మీపాదార్చకురాలను
మీపలుకుం దాఁటి సుకృత • మిడుకం గలనే!
భూపాలేంద్రకుమారా!
మీపాదములాన; దాని • మేకొన కున్నన్॥ ౨౨౫

ఆ॥ వె॥ అంచ నేకరీతు • లాడి వేఁడుటఁ జేసి
పలికినాఁడ నిట్లు • పడఁతితోడ
నన్ను మోసపుచ్చి • నందనునిఁ గనుమ!

ధర్మపథము నింతఁ • దప్పక సతి!॥

ఆ॥వె॥ నాఁగ నాదుప్రాణ • నాయిక యనె నిట్టి
కోర్కు లెవ్వ రేనిఁ • గోరినారె?
యనుచు వేవిధాలఁ • బనవి తుదకు సమ్మ
తించె నాదు కోవ • తీవ్రము గని ॥

ఉ॥ పిమ్మటఁ గొన్నినాళ్లచట • వెళ్లఁగ బుచ్చిరతి ప్రమోదముల్
నెమ్మది సమ్మతింపక య • నేఁ డిటువచ్చితి; దానిఁ గూర్చి నీ
సమ్ముఖమందు నారయఁగ • సంతతపీడితమానసుండ నై
సమ్మదదాయి సత్పథవి • చార! వచోమృతధార! సద్వరా! ॥

వేదపురాధిపుండు సైజమార్గునకు హితోపదేశము సేయుట

కం॥ అనవుడు వేదపురీశుం
డనె నిట్లో వెఱ్ఱివాఁడ! యని సంబోధిం
చి నగుచు వింటిమె! యిటు లే
జనపదముల నైనఁ గాని • జరిగిన దనుచున్ ॥ ౨౨౯

తే॥గీ॥ ఇట్టి వెడఁగుపంతము లూను • హేతువున నె
సతులు పెడదారి ద్రొక్కంగ • సాహసింతు
రిట్టి మితిమీఱు కష్టముల్ • పెట్టుకతన
శంక విడనాడి పతులతో • బొంకుచుంద్రు ॥

తే॥గీ॥ తనకుఁ దోఁపదు; సెప్పిన • విననె వినఁ డ
టన్న సామెత సార్థకం • బయ్యె నేఁడు
నీదుపట్ల విచారింప • నేస్తకాఁడ!
శ్రేయ మానీదు నతిమాటఁ • ద్రోయనౌనె! ॥



తే॥గీ॥ ఇంత మాత్రానఁ బోవునే • యీయుదంత
మెల్లవారికిఁ దెలియుచో • నెంత దూఱొ!
యెంత కష్టంబొ! యపయశ • మెంత యగునొ!
చూడుమా నెచ్చెలీ! మన • సునటు చొన్ప

చం॥ గతజలసేతుబంధనము • గాదె! గతించిన దాని కింక నీ
గతిఁ దలపోయుటల్ మనము! • గావున ధీరత పూనిలో సహా
మ్మతి వెఱపేది యుండుట స • మంజసమార్గ మటంచుఁ దెల్పఁగా
సతఁడును సమ్మతించె; విగ • తార్తి మనోవిభవాభిరాముఁ డై ॥

ఉ॥ నా విని సంశయాళుఁ డువి • నమ్రత నిట్లనె నామనీషితో
నో విబుధేంద్ర! నాఁటి నిశ • యుక్తిమయోక్తులఁ దన్ని పూర్ణ వి
ద్యావతి యైన జ్ఞానవతి • యట్లరుదెంచిన మీఁద మాత్రలో
నే విధి సైఁచి యుండెనొ ని • జేశున కే మని సెప్పఁగల్గెనో!

ఆ॥వె॥ తల్లిదండ్రు లోర్చి • దమచిత్తములఁ బెట్టు
కొనిన నితరు లూర • కొందురె! ధరణి
నితరజనము లెఱుఁగ • కెట్లుండెదరు పాప
మొక్కగడియ కన్న • నొదిఁగి యున్నె! ॥ ౨౩౫

కూఁతుసంగతి, వినుతశీల తనపతికిం దెల్పుట

కం॥ అనవుడుఁ బరవిదుఁ డనె నిటు
"లనుమానం బేల! సంశ • యాత్మా! నీ నె
మ్మనమున నది వెల్లడియ
య్యెనొ లేదొ యని; యెఱిఁగింతు • నేర్పడ వినుమా!॥

కం॥ సుత వెళ్లిన మఱునాఁడు వి

నుతశీలకు హెచ్చె; మనసునొ వ్వాకతనన్
హితమతితో నామె పతి
వ్రితగాఁవునఁ జెప్పె నిజము • పతి కిప్పగిదిన్॥

ఆ॥వె॥ జీవితేశ! జనులు • చేసినపాపంబు
సెప్పినంత నది న•శించు నండ్రు;
గాన వినుమ! మనల•గాదిలిపట్టివృ
త్తాంత మెల్ల, భూమి•కాంత! కాంత!॥ ౨౩౮

ఉ॥ శోభన మైననాఁటినిసి • శోధనముం దగఁ జేయనో, మఱే
లాభము పొందనో,మనల•లాఁతిజను ల్పడిసల్పనెంచియో;
వైభవరాజి వీడి మన•పట్టిమగం డిటు వల్కె నంట; శై
లాభమనస్కుఁడై వినుప్రి•యా!యొకదీక్షవహించితిన్మదిన్॥

కం॥ అది యే మని యడిగెదవో!
సుదతీ! న న్విడిచి నీవు • సుతుఁ గన వలయున్
సదమలచారిత్రిముతో
నిది నెఱపినదాఁక నిన్ను • నేఁ గలియఁ జుమీ॥

చం॥ అనుటయుఁ జింత నొంది మన•యాత్మజ మ్రొక్కి నుతించి యోవిభూ!
జనములు విన్న నవ్వరె!య•జస్రమునింతటివింత కార్యమే
జనుఁడునుగోరియుండెనె!య•శంబుదొలంగదె దీనిచే!నిఁకన్
మనకనివేవిధాలబతి•మాలుకొనందయమాలియాతఁడున్॥

కం॥ చల మెడలక దుర్వారపు
టలుక న్వెలుఁగుచు భయావ•హాకృతి మనము



ద్దులసుత నొప్పించి యతం
‘డిలు సేరెద’ నంచుఁ జెప్పి • యేగినవెనుకన్॥

ఆ॥ వె॥ మారువేస మూని • ‘శారద’ యను చెలి
వెళ్లి సర్వ మెఱిఁగి • వేఁక వచ్చి
వెరవు బోధ సేసి • వెంటరా మనసుత
వెళ్లె నేఁటిరేయి; • విభునిఁ గలియ॥ ౨౪౩

వినుతశీలను రాజారార్చుట

కం॥ అని చెప్పి మఱియు వేదపు
రిన్నృపాలుని దెస కతం డ • రిగెనవినుతచే
త నెఱింగిన దంతయుఁ జె
ప్పిన విని యాభర్మనగర • విభుఁ డిట్లనియెన్॥

ఆ॥వె॥ అబల లనెడినామ • మన్వర్థ మని మీకుఁ
బెద్ద లుంచి నారు • బుద్ధినెంచి;
ధీబలంబునందు • దేహబలమునందుఁ
దాల్మియందు మాకుఁ • దక్కువగుట॥

ఉ॥ ఆవెడఁ గట్టుపల్కుమన • యాత్మజతద్వ్యధిభీతినొందుటల్
భావిని వచ్చుకష్ట మప • వాదమునెంచకసాహసించుటల్
నీవును సమ్మతించుటలు • నెమ్మదిఁ జూచిన నెంతతప్పొ నీ
కేవిశదంబగున్బ్రియస • తీ!యిఁకమాటలువేయునేటికే!॥

ఆ॥వె॥ నీతు లెన్ని యేని • ఖ్యాతిగా బోధింప
వచ్చు నెత్తిమీఁది • బరువుదింప
వచ్చు త్తుత్తు వాఁత •వచ్చుఁ; గాని యొరుల

పూర్వకర్మ మేరు • పుచ్చఁ గలరు! ॥

ఆ॥ వె॥ కాన నిచట నిన్నుఁ • గనవిన ఫల మేమి!
డెందమందు నొగులు • పొంద నేమి!
యిందుల కొకవెరవు • నెఱిఁగింతు విను మింతి!
నీదుశీలమునకు • మోద మంది ॥ ౨౭౮

కం॥ అంతఃపురదాసీజన
మంతయు నమ్మఁ బలుకు; మన • యాత్మజ గత్రయా
మాంతంబునఁ దనమాతులుఁ
డెంతయుఁ గోరంగనచట • కేగె నటంచున్ ॥

కం॥ అందుల కామెయు నమ్మతిఁ
జెంది యటులె నెల్లడించి • చిత్తంబందున్
గ్రిందుగ దుఃఖం బుండుటఁ
గుందుచుఁ గాలంబు గడవు • కొనుచుండంగన్ ॥

ఆ॥ వె॥ ధర్మపాలుఁ డట్లె • శర్మహీనుండౌచుఁ
బొద్దు పుచ్చు చుండెఁ • బోడిమి సెడి
యంత నొక్కనాఁ డ • నంతరాజన్యాఘ
వినుతి గాంచి యతఁడు • పీఠి విడియ ॥ ౨౮౧

ధర్మపాలుఁడు పురవార్త లెఱుంగుట

సీ॥ రాజరాజాగ్రణీ; • ప్రథితవిద్వన్మణీ!
ధర్మపాలనృపాల! • దండమయ్య!
నేఁడు పౌరులు గుంపు • గూడి యీపురి నచ్చు
టచ్చు టనుకొనెడి • ముచ్చట లివె;



'మనరాజుకూఁతురు • మగఁ డొల్లమిం జేసి
దేశాలమీఁదికిఁ • దెగి సనె నఁట
'సావాసకత్తె యా • శారదాంబను గూడి
దేశాలు గాంచి రాఁ • దెగి సనె నఁట'

తే॥ గీ॥ 'అమ్మ కయ్యకుఁ జెప్పకే • యరిగె నంట'
'తల్లితమ్ముఁడు పిలువంగ • వెళ్లె నంట'
యనుచు వేఁపురు వేవిధా • లాడు చుండి
రయ్య! విను మయ్య! యెది సేయుఁ • దందురయ్య! ॥

తే॥ గీ॥ అనుచు దూత లనఁగ నంతఁ • గనకపట్ట
ణాధిపుం డాధిమంతుఁ డై • యరయు చుండ
నొండు దౌవారికుఁడు వచ్చి • 'యోనృపాల
వర! యయోధ్యనాథుం డంప • వచ్చె భటుఁడు ॥

ఉ॥ దేవర! మీ రనుజ్ఞ నిడఁ • దెచ్చెద మోలికువానినన్న నా
భూవరుఁ డట్టులొప్పుకొని • పుచ్చఁగ వాఁడును బోయి యయో
ధ్యావసుధేశకింకర! ర • యంబున లోనికిఁ దోడి తేర మా
క్ష్మావరుఁ డాజ్ఞయిచ్చెనది • గావునరమ్మనవచ్చి యాతఁడున్ ॥

తే॥ గీ॥ అంజలి ఘటించి తలవంచి • యవనినాథ
దర్శనాగతసేవక • ధర్మధుర్యుఁ
డౌచు సాష్టాంగ మొనరించి • యనిమె నిట్టు
లోమహా • రాజ! సురసార్వ • భౌమ తేజ! ॥ ౨౮౮

అయోధ్యాధీశుని ప్రథమసందేశము

కం॥ మీ వియ్యంకునిపలుకులు

భూవర! విను మయ్యా! వాని•పోలిక ననెర్గ
బావా! నాదుకుమారుని
నీవఱకుం బంప నైతి • వేకతముననో!॥

తే॥ గీ॥ పదిదినంబులలోపలఁ • బంపెద నని
నమ్మఁ బల్కుటఁ గాదె! నా•నందను నట
వీడి వచ్చితి బాంధవ•ప్రియుఁడ నౌటఁ
జేసి; బావ! నీ కెదురాడ • జిహ్వ రాక॥

ఉ॥ పుట్టినదాదిమాయనుఁగు • బొట్టెనొకప్పుడునింతవట్టు మే
మిట్టెడఁబాసియుండమి ర • మేశుపదంబుల నాత్మనిల్పి; నేఁ
బట్టపురాణితో ఘనత • పం బొనరింప జనించినట్టియా
పట్టియితండె; గానబహు • భారముమామదికయ్యెని త్తఱిన్॥

తే॥గీ॥ ఇప్పుడైనను మీయొద్ద • కేగుదెంచు
మాభటునితోడ వెస మాకు • మారునంపు
టుచిత మని యెంచుఁ డయ్యా! మీ • యుల్లమందు
నెన్నిదినము లేగెనో నేఁటి • కెంచి చూచి॥ ౨౫౯

తే॥గీ॥ కోడలిని బంపు టెప్పుడో • కువలయేశ!
దెలియఁ జేయుమ! యది గూడఁ • దేటపడఁగ
మఱియు మీక్షేమములను వే • మాఱుఁ దెల్పు
చుండు మయ్యా! స్వాగత మయ్యా! • యుర్వినాథ॥

చం॥ అనవుడుధర్మపాలుఁడొడ•లంతయుఁజెమ్మటఁదోఁగబీతునన్
వెనుకకుఁబోవగోయియట•వీడియుముందునకేగనూయియం
చనుగతి నేమి సెప్పుటకు • నాతఁడు నోరుమెదల్పలేక మూ



ఢునిబలెఁగొంతసేపటికి • రోషవిషాదరయంబుమ్రింగుచున్॥

కం॥ కుశలమె మీప్రభువరులకుఁ
గుశలమె మీరాజుగారి • కులసతులు? జనుల్
వశులే మీరాజాజ్ఞకుఁ?
బశుపతిదయవలనఁ బాఁడి • పంటలు గలవే?॥

ఆ॥వె॥ అనుచు క్షేమవార్త • లడిగి మర్యాదఁగా
నల్ల బంటు మిత్రుల, నాదరించి
భోజనంబు సేయఁ • బుత్తెంచి సభమూసి
మంత్రితో రహస్య • మందిరమున॥

తే॥గీ॥ తనతనయకథ నంతయు • దాఁప కుండఁ
జెప్పి వీరకానికి నష్టు • సెప్పి పంపఁ
దగినవెర వేదియో యరసి • దానిఁ దెలుప
వలతు నన మంత్రియు విచార•వంతుఁడౌచు॥

ఆ॥వె॥ కడుపు చించుకొన్నఁ • గాళ్లపైఁ బడునట్లు
మనము వెల్లడింప • మనకె కీడు;
గాన మీసుతుండు • కతిపయదినముల
నాఁడె వెళ్లెఁ దనదు • నగరమునకు॥ ౨౬౫

ఆ॥వె॥ అనుచు వార్తఁ బంపుఁ • డని మంత్రి వాక్రువ్వ
ధర్మపాలునకదె • తగిన దంచు
మనమునందుఁ దోఁప • మంచి దటం చటు
వచ్చినట్టిబంటుఁ, బంచె నతఁడు॥

ఒకవేశ్యాంగన వేదపురీశుసభ కేఁగుట

ఆ॥ వె॥ ఇచ్చ ట్టిట్టు లుండ • నచ్చట వేదపు
రీశుఁ డొక్కనాఁ డ•హీనరాజ
మండలబుధతండ•మండితం బై యుండు
కొలువుకూటమందుఁ • గూరుచుండ॥ ౧౬౭

సీ॥ కులుకుతోఁ జిగిమేని•బెళుకుతోఁ నగలమేల్
తళుకుతోఁ గడుముద్దు•పలుకుతోడఁ
బట్టుతో మెఱసెడి • బట్టతో టక్కరి
బెట్టుతో నెఱజాణ•గుట్టుతోడ
నేవుతో మోహిని•రూపుతో మారుని
తూపుతో సరితూగు•చూపుతోడ
నతులతో శ్రీకృష్ణ•నుతులతో శృంగార
వతులతోఁ గలహంస•గతులతోడఁ

తే॥ గీ॥ బొలుపుమీఱెడికస్తురి•బొట్టుతోడ
వేడ్కఁ గొల్పెడునలినీల•వేణితోడ
మోహ ముదయింపఁ జేసెడు•మోముతోడ
వచ్చె;వినయంబుతో నొక్క•వారకాంత॥

కం॥ శ్రీమద్యశోరమేశా!
క్షేమంకర! శత్రునాశ! • శ్రీయక్షేశా!
కామితవరనిఖిలఫల
స్తోమప్రదభర్గదాస! • శ్రుతిపురవాసా!॥

కం॥ కొనుమా! జోహారిదిగో



వినుమా! మాచేయుమనవి • విశ్రుతకృపతో
జనపదములఁ జొక్కింటిని
గని వచ్చితి మిటకు విద్య • గనఁబఱచుట కై॥ ౧౭౦

చం॥ ధనమునుగోరఁబోమువసు•ధాధవయేసిరిఁగోరిరాము మేల్
గానములు లేనివారలను•గుత్సితబృందముఁ జేరఁ బోమునీ
తినియమశూన్యులంగనము•ధీరనికాయముఁ రోసిపోముమా
చినతనమాది నేర్చినవి•సిద్ధపుటాటను బాటఁ జూపుచున్॥

ఆ॥ వె॥ ఉర్విపతులు బుధులు • యోగ్యతాపత్రిక
లిచ్చినారు; మమ్ము•మెచ్చికొంచు
మీరుఁ గూడ నొసఁగఁ • గోరెద మట్లు; మా
పాట నాట నరసి • పార్థివేంద్ర!॥

మ॥ అనిపల్కన్ శ్రుతిపట్టణాధిపుఁడు తా•నాశ్చర్యమగ్నాత్ముఁడ
య్యెను;దద్రూపకళాప్రభామృతవచో•దృష్టుల్ విలోకించిగా
వున నాలాసికతోడ నిట్లనియె నో•పూఁబోఁడి!మీ వేఁడికో
ల్కైనిసంతోసమునొందినాఁడ నిఁక మీ•విద్యన్ ప్రదర్శింప రే!॥

చం॥ అనుడువిపంచికాస్వనల • యస్వరమెల్లరకింపొనర్పఁగా;
గనక మయాదిభూషణధ • గద్ధగ లెల్లెడ నావరింపఁగా
వెనుకసుధాకరాననలు • వేశ్యలుగొందఱువాంగు సేయఁగా
మునుకొని యొక్కబోగముది • మోహినిరూపము దోఁపఁ
జేయుచున్॥

వేశ్యాసంగీతము

శ్లో॥ భజామి దేవేంద్రిభవాజసేవితం ।

భజామి రోగార్తిభవాంత్యవర్జితం ।
భజామి సంగ్రామపరాజితాహితం ।
భజామి సద్భక్తవరప్రదాచ్యుత ॥ ౨౭౫

శా॥ శ్రీవిఘ్నేశ్వరశంకరాబ్జభవహృ• త్సేవాత్మ! సత్సత్తమా!
దేవాధీశ్వరసేవితాంఘ్రియుగ! స• త్తేజఃప్రభావోత్తమా!
దేవద్వేషిచయాటవీదవసమా! •ధీరాంబురుణ్మిత్రమా!
యావజ్జీవిగణప్రముత్కరణ! కృ•ష్ణా దీనలోకావనా! ॥

మ॥ సిరినిండారఁగనున్న నుండరుసుతుల్ • చేతోముదంబొందని
ద్ధరఁ దత్పుత్రులఁ గల్గియున్న; నెడమా•ద్రవ్యంబు మర్త్యాళికిన్
సిరియున్ సంతతిపూర్తిగా దొరకినన్; • జింతించుచుం డ్రెవ్వఁడీ
నరు లాశాయుతచిత్తు లౌట గద! కృ•ష్ణా! దీనలోకావనా! ॥

మ॥ కనఁగా నొక్కఁడు ప్రాణికుందొ! మగిందుదురో! వ•క్కాణిం
పఁగా లేనియీ
జనముల్ సల్పెడు యత్నముల్ గనినచోఁ; • జాకుండ నెల్లప్పుడీ
తనువుల్ దాలిచి యిట్లె యుండు మనిచి•త్తంబందుఁ జింతించుచున
ట్లనఘా! దోఁచెడు; నెట్టిగాదె! యది కృ•ష్ణా! దీనలోకావనా! ॥

మ॥ ధన మార్జింతు రధర్మమార్గచరులై •దైతేయమార్గావలం
బనులై; గొందఱు సజ్జనప్రకరమున్ •బాధించు చజ్ఞానులై;
మనకీడబ్బె ప్రధానమంచు సతమీ•మాడ్కిన్ ధరన్ స్నిల్తుమం
చనఘా! వారలు దుర్గతిం బడరె! కృ•ష్ణా! దీనలోకావనా! ॥

శా॥ తా మేరీతిగ నొడ్లఁ జూడఁ గలరో •ధర్మప్రకారంబులన్
భూమిందప్పు నొకళ్లఁ గూడ నటులే •పూజింతు రంచెంచుచో



నేమర్త్యాధముఁడైన జేయునె! విచా•రింపంగ దుష్కృత్యమున్
సామోపాయ మొనర్చఁగా కెపుడు కృ•ష్ణా! దీనలోకావనా! ॥

కం॥ అని దేవస్తుతి ముందుగ
నొనరిచి యట జావళీల • నుద్యద్వీణా
స్వనభూషణకంకణరవ
మొనయంగాఁ బాడెఁ గృతులు • నృత్యముతోడన్ ॥

కం॥ అందుల కాభూధవుఁ డా
నందావృతచిత్తుఁ డౌచు • నవ్యాంబరముల్
పొందుగ నుపహారము లిడి
ముం దడిగిన లేఖ వ్రాసి • ముదమున నొసఁగెన్ ॥

ఆ॥ వె॥ పిదప వేశ్య లెల్లఁ • బ్రీతిపూర్ణాత్మలై
బసకుఁ బోవుదారిఁ • బట్టి చనిరి
సభ్యులును దదీయ•సంగీతపారవ
శ్యాంతరంగు లౌచు • నరిగి రంత ॥

వేశ్యామణిని నైజమార్గుండు మోహించుట

తే॥ గీ॥ మోళ్లు చిగిరించె నన్నట్లు • మూర్ఖుఁ డయ్యె
నైజమార్గుండు మోహించె; • నాట్యమందు
మిన్న యానొక్క వేశ్యపైఁ • గన్ను వేసి
కడకు మది సైఁప లేక సం•గాతి గాంచి ॥ ౨౮౪

ఉ॥ యౌవనకాలమొంకటి మ•హాత్తరశక్తియుతంబొ; గాని యీ
భూవలయంబునం గలుగు•భూతచయంబుల కెల్లఁ గొల్పెడున్
భావజకేళిలోలత; స్వ•భావగుణంబుగ; నందుఁ జూడఁగా

నోవిహితాత్మ! మానవుల • కుద్భవ మొందవె! మోహ
చిహ్నముల్॥

సీ॥ కాలు వంకర యైన, • వ్రేలు వంకర యైన
నగపడ దాలోటు • యౌవనమున
మెల్లకన్నైనను • నల్లనిమే నైన
నగపడ దాలోటు • యౌవనమున
బుఱ్ఱముక్కయినను • జుఱ్ఱువెండ్రుక లైన
నగపడ దాలోటు • యౌవనమున
బానకడ్పయినను • బాఱపం డ్లైనను
నగపడ దాలోటు • యౌవనమునఁ

ఆ॥ వె॥ బలుకు లేల వేయి! • వంకరల్ నూఱున్న
దాఁగి యుండుఁ గావె! తరుణమందుఁ;
బూరుషులకుఁ గాని • పొలఁతుకలకుఁ గాని
వలపు గల్గుఁ గలియఁ • దలపుగల్గు॥

ఉ॥ జవ్వన మంకురింప నవ•సమ్మదహాసవిలాసచేష్టలున్
గ్రొవ్విరి నవ్వునట్టిమెయి•గ్రొత్తఁగఁ గల్గు;స్వభావసిద్ధమై
యెవ్వరికైన నందు హరి•ణేక్షణజాతికి నొక్కఁ డెక్కుడౌ
నివ్వసుధాస్థలిం గన;న•దేమన! • బైసిగలట్టిచూడ్కియే॥

ఆ॥వె॥ ఆఁడుదానిచూపు • టంపటఁ గెలువరా
దనుచుఁ బలుకురసికు • లజ్ఞులె? సఖ
నేఁడు నాహృదయము • నేడుచిల్క వెనఁబోయి
వారకాంత యనెడు•వలను జిక్కె॥ —అ౮౮



కం॥ నిలువఁగ లే; నాసతిరతి
కలితుఁడఁ గా కున్న నేఁడు • గావున సఖ! యె
ట్టులొ యీడేర్పుము! నాయీ
తలఁపున్; మిత్రత్వ మెంచి • దయతోడ ననన్॥

వేశ్యాసంభోగనష్టములు

కం॥ ఘనగుణమిత్రమ! యొకనీ
తిని దెలిపెద సఖునిమాట • స్థిరమతి వినియో
చన సేయ వలయు; మీఁదట
మనసెఱిఁగింపంగఁదగు న • మర్మాత్ముండై॥

కం॥ అని యిటు ధర్మశాస్త్రము
లనిశము ఘోషిల్లు చుండు • నా హేతువునన్
మనమునఁ గలసందియమును
వినిపించెదఁ దోఁచినంత • వినుమా ప్రీతిన్!॥

కం॥ కనుసైగలచేఁ బురుషుల
మనసులు హరియించునట్టి • మాయలమారుల్
గనుచో గణికలుగారే!
వినుమా! నామాట సఖుఁడ! • వినుతిం గనుమా॥

కం॥ మనలోకంబున రంభా
వనితం బలె వావి లేక • వర్తించెడునీ
వనితలఁ గూడం దగునే!
వినుమా!నామాట సఖుఁడ! • వినుతిం గనుమా! —అ౯౩

కం॥ మును కాళిదాసుఁ డను నా
ఘనకవియుం గూడ వార • కాంతామణిచే

ధనముం బ్రాణము గోల్పడె
వినుమా! నామాట సఖుఁడ! ♦ వినుతిం గనుమా! ॥

కం॥ మనధన మాకర్షింపఁగ
వనజోద్భవుఁ డంపినట్టి ♦ వైరిగణంబో
యన గణికలు పరగుదు రిల
వినుమా! నామాట సఖుఁడ! ♦ వినుతిం గనుమా! ॥

కం॥ వినయాతిశయోక్తులచే
ఘనముగ మవమిాఁదిపేర్మి ♦ గనఁబఱిచిన; నీ
వనితలు క్రూరమృగాల్ సుమి
వినుమా! నామాట సఖుఁడ! ♦ వినుతిం గనుమా! ॥

కం॥ మనసిజపీడితపూరుష
ఘననీడజవితతి పడదె! ♦ గణికోక్త్యానా
యనికర మం దెపుడైనను!
వినుమా! నామాట సఖుఁడ! ♦ వినుతిం గనుమా! ॥ ౨౯౭

కం వినిచితి ధర్మము నిదిగా
కను సంగతి వేఱొకండు ♦ గలదది గానన్
మన మేకాగ్రిత నిలుపుచు
వినుమా! నామాట సఖుఁడ! ♦ వినుతిం గనుమా! ॥

కం॥ తనసతి నొకఁ డొందినఁ దన
మనమున కెటు లుండునో ప్రీతి ♦ మనుజునకట్లే
యని తలఁచిన నిట్లనెదవె!
వినుమా! నామాట సఖుఁడ! ♦ వినుతింగనుమా! ॥ ౨౯౯



కం॥ మును రావణుఁ డేవఱుటయు
వనజారికి శాప మాట ♦ వాసవుఁ డొందలన్
గనులను వేల్గను టెఱుఁగవె!
వినుమా! నామాట సఖుఁడ! ♦ వినుతిం గనుమా! ॥

కం॥ మనకనుమునుమునఁ బల్లవ
జను లడఁగరె! వేనవేలు; ♦ జాడ్యాదులచే
మునుపటిగాథ ల వేలా!
వినుమా! నామాట సఖుఁడ! ♦ వినుతిం గనుమా! ॥

ఆ॥ వె॥ అనుడు నైజమార్గుఁ ♦ డతనుకోలల కోర్వఁ
జాల కిట్టు లనియె ♦ సంభ్రమమునఁ
బ్రాణసఖుఁడ! తమిసి ♦ బ్రాణముల్ నేఁ బాయఁ
బనవు దంతె; గాని ♦ ఫలము గనెదె? ॥

మ॥ స్మరపీడార్తుఁడ నౌచు జీవములని ♦ మ్మైబాయుటల్ కంటెముం
దు రుజోపేతుఁడ నై మృతిం గనుటబల్ ♦ దూఱొందుటల్ మేలటం
చరయందోఁచెడిఁ; గాననామనవిని ♦ న్మా! నీవు మిత్రోత్తమా!
పరమోత్కంఠుఁడ నైతి నంచు బహుధా ♦ ప్రార్థింపఁ దన్మిత్రుఁడున్ ॥

కం॥ చెలికానిమనసు నొవ్వఁగఁ
బలుకుట దగ దనెడుధర్మ ♦ భావంబున న
గ్గలిక యగుపేర్మితో నో
చెలికాఁడా! నీదుకోర్కి ♦ చెల్లింతు వెసన్ ॥ ౩౦౪

ఆ॥ వె॥ దీని కింత మదిని ♦ దిగు లొందఁగా నేల!

వెక్కు వెరవు లెఱుఁగు • వృద్ధభటుని
సాయ మిత్తుఁ; గాన • సఖుఁడ! నీ కా వెల
యాలు లభ్య మవుట • యబ్బురంబె!॥

వేశ్యామణితో నైజమార్గుండు భోగించుట

తే॥ గీ॥ అంచు వచియించి యప్పాట • నంప, నైజ
మార్గుఁ డానందమగ్నుఁ డై • మనసుకోర్కె
దెలిపి యా వెలయా లను • పలుకు లేమొ
వే యొఱింగింపు మన వృద్ధు • వెళ్లి వచ్చి॥

ఉ॥ యౌవనధూర్వహోత్తము ల • నన్యమనోహరసుందరాకృతుల్
భూవరసత్తముల్ విభవ • పూర్ణులు సద్గుణధాములైన యో
భూవర! మిమ్ముబోంట్ల నొక • భోగము దే రతికొప్పుకున్న! నే
నే వచియింప; మీ తలఁపు • నెమ్మది నా వెలయాలు మేకొనెన్॥

కం॥ తడయఁగ నేలా! చీఁకటి
పడె నెల్లెడ; జారచోర • వారము పొంగెన్
వెడలుము! తద్వేశ్యామణి
గుడారమునకు నదె; మేడ • కొమరు వహించెన్॥ ౩౦౯

ఆ॥ వె॥ అనఁగ సంతసించి • యాతఁ డావటకుటీ
రంబు సొచ్చి దాని • డంబు చూచి
సొంపు నింపుఁ బెంచు • సొబగుదివ్వెలఁ గాంచి
కరము వింత సెందు • కాలమందు॥

కం॥ పూజాద్రవ్యంబులఁ గొని



రాజానన యొర్తు వచ్చి • రాజవరేణ్యా!
మా జన్మంబులు సఫలత
గాఁ జేయఁగ విచ్చితీవు • కారుణ్యమతిన్॥ ౩౧౦

కం॥ కొనుమా! పూజార్థంబులు
చనుమా! నీ వలచినట్టి • చానం గదియన్!
గనుమా! కరుణాదృష్టిన్
వినుమా! నా మనవి లపన • విజితశశాంకా!॥

గీ॥ అంచుఁ గొనియాడి సకలమ • ర్యాద లొసఁగి
తోడుకొని పోయెఁ గై సేతఁ • దుఱఁగలించు
చున్న యొక గదిలోనికిఁ • జెన్ను మీఱ
నంత నెదురుగ నొక్కల • తాంగి వచ్చి॥

శా॥ మా పూర్వాంచితజన్మపుణ్యగరిమన్ • మా చింత లోడెక్కెటన్
మాపై సత్కృప మీకు మెండవుట నో • క్ష్మానాథ! యీ ప్రొద్దు మీ
శ్రీవత్స్వాగ్మన మొంది మా గృహము సం • సిద్ధింద గంబొందె మీ
ప్రాపుం జెందిమదీయవిద్య లెసగున్ • ప్రఖ్యాతి మా కయ్యెడున్

సీ॥ దయచేయు మయ్య! యో • ధరణిపాలకచంద్ర!
సందేహ మేల! మీ • సదన మిదియ
కూరుచుండుము! పీఠిఁ • గొం కేల మది రాజ!
మీ దాసురాండ్ర మో • మేదినీశ!
మీ బోఁటి ఘనులకూ • ర్మిం జెందఁ గోరి యే
దేశాటనము సేయుఁ • దివురు టయ్యా!

తమవంటిధను లనఁయము పెంచుకతననే
మావంశ మెల్లప్డు ♦ మనెడునధిప!

తే॥ గీ॥ రసికజనవరు లెవ రన్న; ♦ రాజులె గద
పుషితనిర్ధను లెవ రన్న; ♦ భూపులె గద
దానఘను లెవ రన్న; భూఁజానులె గద;
పూర్వకాలమం దుండియు ♦ బుద్ధి నెంచ॥ ౩౧౪

మ॥ అని వేశ్యామణి నేర్పుగాఁ బలికి యో ♦ గ్యానర్ఘపీఠస్థుఁ జే
సిన యోక్తిప్రకరామృతంబుననుదఁచ్చిత్తంబురంజించిపూ
సెను; మైగంధము రాచె; నత్తరవుఁద ♦ చ్చేలంబులందుష్టిమై
దనిపెన్; మారవిలాసహాసరతివి ♦ ద్యాప్రౌఢిమం బేర్పడన్॥

చం॥ అనవుడుసంశయాళుఁడను ♦ నావిబుధాగ్రణితోడనాడయో
ధ్యనృపుఁడు దూతతోడఁ గబు ♦ రంపి సుతుండటలేఁడటం
చటుల్
విని పిద పేమి చేసినది ♦ విస్తరకీర్తిచరిత్రి! దెల్ప వే!
మనసతికౌతుకంబుగన ♦ మాటకునడ్డము సొచ్చినాఁడ నాన్

కం మామకసుతసన్మిత్రా
మామకసంహారలోక ♦ మాన్యచరిత్రా
నామకసుతపంచకమున
మామకసుతశతమురూపు ♦ మాపినకృష్ణా ॥

స్రగ్విణి

శ్రీశమానీశనం ♦ సిద్ధచిత్తస్థస
ర్వేశగర్వాంధపా ♦ పేంధనాగ్నీమహా



కాశసంకాశది ♦ క్కాయసద్భక్తలో
కేశసంప్రార్థితా ♦ భీష్టసంధాయకా

సమారలలిత

జరామరణశూన్యా
మురఘ్నసురమాన్యా
వరీయశుభచేష్టా
నిరాకృతపరేష్టా ౩౧౯

—:గద్యము:—

ఇది శ్రీమత్సరస్వతీ విశ్వేతులజాయమానకటాక్ష వీక్ష
ణపవిత్ర మధ్వమతహారితసగోత్ర చిల్లరిగె వంశ
పయఃపాథోధిరాకాసుధాకర నరసింహ
రాయార్య ద్వితీయపుత్ర సకల
బుధజన మిత్ర యోగా
నందకవి ప్రణీతంబైన
జ్ఞానవతీ
ప్రబంధమండలి
తృతీయాశ్వాసము.



శ్రీమత్పరాత్పరాయనమః

# జ్ఞానవతి.

## చతుర్థాశ్వాసము.

కం॥ విశ్వంభర విశ్వంకర
విశ్వాత్మక విశ్వమూర్తి • విశ్వాధారా!
విశ్వమయ విశ్వలయ శ్రీ
విశ్వేశ్వర ప్రామరందు • వెలసినకృష్ణా ॥

ధర్మపాలుని ప్రత్యుత్తరముంగూర్చి యయోధ్యారాజు చర్చించుట

ఆ॥ వె॥ అట్లు సంశయాళుఁ • డడుగఁ బరవిదుఁ డ
యోధ్యరాజుగారి • యోచనలను
మరిపయిజరిగినస • మస్తవృత్తాంతంబుఁ
దెలుప నెంచి యిట్లు • పలుకఁ జొచ్చె ॥

కం॥ వియ్యంకుఁ డనినమాటల
నయ్యవనీధవుఁ డెఱింగి • యధికార్తుండై
యయ్యా! ముద్దులపట్టీ!
యియ్యెడకుం జేర కుండ • నేమైతొ గదా! 3

ఉ॥ ఒంటరిగా బయల్వెడలి • యుగ్రవనంబున దారి తప్పితో!
బంటుతనంబునం బరులు • బాటకు నడ్డము సొచ్చి మొత్తిరో!
బంటులనిన్నుఁ; గాక బల • వత్తరదుష్టమృగాళిఁ జిక్కితో!
యింటికి రావదేమి సుత! • యెక్కడనుంటివొ యింత
కాలమున్?॥



కం॥ అని వైవిధముల నెదలోఁ
బనవుచు నిట మూని కొంత • వడి కిట్లనియెన్
ఘనసచివులార! దీనిని
మనమున యోచించి మంచి • మార్గము సెప్పుఁడీ! ॥ ౪

శా॥ ఆనాఁడే పురి కేగు చుంటి నని య • ట్లన్నట్టినాపుత్రకున్
దా నారీతి నె పంపినాఁడ నను నా • ధన్యాత్ము వియ్యంకునిన్
నే నే మాడిననా దెతప్పనిజనుల్ • నిందింతురశ్రాంతముల్
గానన్ బ్రస్తుతకార్యసాధనమెఱుం • గం జెప్పుఁడీ! కోరెదన్॥

ఆ॥ వె॥ అనుడు మంత్రు లంద • ఱాత్మలోఁ జర్చించి
పలికి రిట్లు కొంత • వడికి లేచి
యయ్య! మీకుమారు • నంపునత్తఱి ధర్మ
పాలుఁ డొకనిఁ దోడు • పంప లేదు ॥

ఆ॥ వె॥ పంపి యున్న నీదు • పట్టివృత్తాంతంబు
సెప్ప కున్నె తనకు? • సేవకుండు
సెప్పి యున్న మనకుఁ • జెప్పి పంపఁడె! వివ
రంబు దూతతో ని • జంబి దమచు ॥

కం॥ 'బాలకుఁ డేఁడీ?' యనుభటు
నాలోకించినపు డాతఁ • డద్భుతచింతా
లోలాత్ముం డౌ కారణ
మాలోపమొ; గాక యింక • నన్యం బవునే!॥

కం॥ కావున నీవియ్యంకున
కీ విషవాడ వంపు కబురు • నీచందమునన్
'బావా! నీజామాతకుఁ

దోసివం దో డెవనిఁ బంపి•తో డెల్పఁ గదే?'॥ ౧౦

ఆ॥ వె॥ అనుచుఁ బలుకుతతికి • నస్తమయం బౌటఁ
గొలువుకూటమునకు • సెల వొసంగి,
పోయి గేహమునకుఁ • బొలఁతులతోఁ జెప్పి
రేయి నెట్లొ గడపి • రేపకడను॥

అయోధ్యాధీశునితోడ నొక కపటవేషి కొండెము సెప్పుట.

ఆ॥ వె॥ సభకు వచ్చి రాజు • స్వాంతమం దేమేమొ
తలఁచుకొంచుఁ బీఠ•తలమునందుఁ
దలను వంచి యుండఁ • బులిమీఁదఁ బుట్రిగాఁ
గపటవేషివరుఁ డొ•కండు వచ్చి॥

కం॥ భూపా! కాంచీనగరము
మాపూర్వులవాస మగుట • మనెద మచటనే;
నాపూర్వజుఁ డొక్కండ
ష్టాపదపురవాసి యయ్యె • శ్వశురునివలనన్ ॥

ఆ వె॥ వానిఁ జూడ వచ్చి • నేను మొన్ననె ధర్మ
పాలుఁ గూర్చి ఘోర•వార్త వింటి;
సతనికూఁతును దమ • సుతున కిచ్చి పరిణ
యంబుఁ జేసె నఁట ని • జంబ కాదె! ॥

ఆ వె॥ పిదప మాకుమారు • వదలి వచ్చితి రంట
వారు మిగులఁ గోరు • కారణమున
నంత నొక్కనాఁడు • కాంతతోఁ గలహించి
కొట్టు చుండినతమ • పట్టిని గని ॥



ఆ వె॥ చెఱను బెట్టె నంట • చెడుగఁడా ధర్మపా
లుండు దానఁ జేసి • లోక మెల్ల
నింద సేయు చుండ • నిలువలే కేడకో
పాఱిపోయెను దమ • పట్టిభార్య,

కం॥ ఈసంగతి నేఁ దత్పుర
వాసులచే వినుటఁ జేసి • వసుధాధీశా!
మీసముఖమునకు వచ్చితి;
వాసిగ మీ కెఱుక సేయు•వాంఛాధికతన్॥

కం॥ అని చెప్పి వాఁడు వెడలఁగ
ననలములో నేయి పోసి•నట్టులఁ గోపం
బినుమడి సెందెను వియ్యం
కునిమీఁద నయోధ్యవిభున•కుం దత్క్షణమే॥ ౧౮

అయోధ్యాధీశుని ద్వితీయ సందేశము.

మ॥ అవురా! యెంతటిదుష్టకష్టమతి వౌ;•యల్లుం జెఱం బెట్టుదే!
పవిసంకాశమదీయఖడ్గహతిఁ ద్వ•త్ఫాలాద్రి భేదింపనే!
భువిపై వ్రక్కలు తిట్టతిట్టలుపడన్•భూతంబు లుప్పొంగఁగన్
రవివంశోద్భవుఁడైన నన్నెఱుఁగవే!•రాజాధమా! యింతకున్

ఉ॥ వింటిరె? మంత్రులార! గుణ•విశ్రుతుఁ డంచు నుతింతు రెవ్వఁడో
తుంటరి ధర్మపాలకుని • దుచ్ఛమనస్కుని మీర లింతకున్
మింట వసింప వానలును • మేదినిఁ గాపుర మాతఁ డున్నచోఁ
బంటలు నుండ వంచెదని•బద్ధిగఁ దోఁచెడుఁ జర్చ సేయఁగన్॥

ఉ॥ కన్నులఁ గప్పి పైచె బహు•గర్వము వానికి నట్లు గానిచోఁ

గన్నియపెన్మిటిన్ జెఱిను • గాఱియ పెట్టునె! ఱాతిగుండెతో
నెన్నఁగ! నెట్టివాఁ డయిన • నిట్టిపనిం బచరించినట్టులన్
విన్నది కద్దె! యింక మన•వీరబలంబులఁ బంపుఁ డాజికిన్॥

చం॥ అనవుడు దీర్ఘదర్శిసచి • వాగ్రణి యిట్లను రాజచంద్రమా
గను మెద! నెన్నికష్టములు • గల్గెడినో యటు సేయుపిమ్మటన్
గనలకుమయ్య! యాగ్రహము • గల్గినమాత్రన వేగిరింప రా
ద నెదరు పెద్దవారు మొద•లారయుచో జయమందు రెప్పుడున్

కం॥ మర్యాదగా నె రెండవ
పర్యాయముగూడ నీదు • బావకు విద్వ
ద్వర్యా! కబురంపుమ! పై
చర్యం జరుపుదము వాని • జా బిటఁ జేరన్ ॥

ఆ॥ వె॥ అన నయోధ్యరాజు • హర్షించె నదిన్యాయ
మార్గ మంచు నెంచి • మానసమునఁ
దద్విధమునఁ బంపెఁ • దత్క్షణంబున నె; వా ౨౮
ర్తాహరుం గనకపు • రంబు నేర ॥

కపటదూత వృత్తాంతము.

తే॥ గీ॥ అంత మనుపటిశత్రువ • దంతయు విని
హేమనగరేశ్వరునికడ • కేగు చున్న
దూత కుత్కోచధన మిచ్చి • తుష్టిపఱిచి
వానిఁ బోవల దని సెప్పి • తానె పోయె॥

తే॥ గీ॥ అనుచు సంశయాళుఁ డను ““నో•యనఘతిలక!
వానికి నయోధ్యవిభునకు • వైర మేల



వచ్చె నెఱిఁగింపుమా!” యని • ప్రశ్న చేయఁ
బరవిదుం డిట్లు విను మంచుఁ • బలుకఁ దొడఁగె॥

ఉ॥ జీతము పూర్తిగా నిడక • సేవకులం దయమాలి యేపవల్
రాతిరిఁ గొల్వునన్విడక • క్రౌర్యముతో నలయించునట్టి యా
భూతలనాయకుండతని•పూర్వముహింసయొనర్చెనంట; తా
దూతగనుండనంతబహు•దుఃఖముతోఁ బనిమాని వైరియై॥

తే॥ గీ॥ ఆని సాధింప వెర వేమి • గాన లేక
తుదకు నీరీతి వంచింపఁ • దొడఁగె వాఁడు
బలవిహీనారియు జయింపఁ • దలఁపఁడె! భువి
సమయము న్వేచి యుండెడి • సర్పముగతి॥ ౨౯

కపటదూత ధర్మపాలునితోఁ బ్రసంగించుట.

ఉ॥ పిమ్మట ధర్మపాలనృపు•వీటఁ జొరంబడి రాజుగారిగే
హమ్మిచటంచుఁ జారతతి•నల్లన వేఁడుచుఁ బోయె; సూరిబృం
దమ్ములు నిండి యున్నయుల•ధాత్రిపుగోష్ఠినిఁ జేర; నంతలో
గుమ్మముగాచువారతనిఁ•గూర్చినృపాలునితో వచింపఁగన్॥

కం॥ ‘రా నిండు వాని నీసభ
లోనికి వేగంబ’ యనుచు • లోలాత్ముండై
మానవనాథుం డనవుడుఁ
బో నిచ్చిరి వాని నటకు • బోరన వారల్॥

ఆ॥ వె॥ అంత నిట్టు లనియె • నాకపటాత్ముం డ
యోధ్యనాథ భృత్యుఁ•డో యనంగ;
ధర్మపాలుఁ గాంచి • దండప్రణామంబు

లాచరించి సవిన • యాత్ముఁ డౌచు॥

కం॥ నీవియ్యంకుని పలుకులు
భూవర! వినుమీ! కృపాపరి • పూర్ణాత్ముఁడ వై
నే వచియించెద వానిఁ గఁ
గావున; వాగ్దోష మున్నఁ • గావుము! నన్నున్॥ ౩౭

శా॥ జామాతం జెఱఁబెట్టు మామ లిలలో • సత్యంబుగా లే రొకో
క్షేమ ర్త్యాధములందు నీవొకఁడవే • యెంచంగ గాన్పింతు ఘో
యీమూఢాత్మక! బుద్ధి తెచ్చుకొనుచీ • వి ప్పైన నా పట్టి నీ
జామాతృం డగు నైజమార్గు విడి; ప • శ్చాత్తాపముం
జెందుమా!

శా॥ కూఁతుం గొట్టె నటంచు సాగ్రహుఁడవై • కూ్రిరా!!
చెఱం ద్రోతె! జా
మాతన్ రాజకుమారు నోరిమ దని • ర్మగ్నాత్మ! నీయాత్మ నే
రీతిం దోఁచెనొ! యిద్ది తప్పనఁగ లే • రే! మంత్రులెవ్వారలున్;
ఖ్యాతిన్ తిని బాసి భూమి బ్రతుకం • గా నేల? భూభృత్ఖలా!

ఆ వె॥ కన్నవారి యింటి • కడఁ బెడ్డముం గొట్టి
నట్టి వెంగలియగు • పట్టిఁ బొగడఁ
గొట్టువ జకుఁ దెచ్చు • కోడలి న్మెచ్చను;
నిన్ను మెచ్చ నంత • కన్న మూర్ఖ! ॥

కం॥ తడయక నాసుతుఁ జెఱవిడి
యొడ లోముకొనంగఁ దగు; న • టొవ్వాకొనని చోఁ;
బడసెదవు ఫలము పూర్తిగ;



దడములతో నేను ముట్టి • దండించుతఱిన్ ॥ ౩౯

కం॥ తనువులు నశ్వరములె యై
నను యశ మపయశము మన క • నారత మౌఁ గా
వున మంచిచెడ్డలం గని
చనుమా! నీయంతరాత్మ • సాక్షిగ నెపుడున్ ॥

మ॥ అనిపల్కన్న యమార్గ మేదియిటు నిం • దారోపముం జేయు నే
యని వియ్యంకుని లోనదూఱి పయికి • ట్లాదూఱతతో శాంతితో
ననునిష్కారణ మేల దూఱుటిటుల • న్నం బేను భక్షింపనే!
తన యేశుం జెఱఁబెట్టి! నిట్టి దగుచి • త్రం బేరు గల్పించిరో!

ఆ వె॥ అనుచు మాట తూల • నాడ కుండఁగ ధర్మ
పాలుఁ డంపె నల్ల • బంటువాని;
వీరకాని కడకు • వెనుకటి గతి నైజ
మార్గుఁ డింటి కేగ • మల్లెనంచు ॥

తే॥గీ॥ వాఁడు తనచేతలంచంబు • వడసినట్టి
వానియొద్దకు వెసఁ బోయి • నేను బాధ
సేయుకరణిని మీరాజుఁ • జేరి యనుమ
టంచుఁ బలుకంగ నాబంటు • నాడ కరిగి ॥ ౪౦

అతఁడాధ్యాధీశుఁడు, ధర్మపాలునిపైకి దాడి వెడలుట

కం॥ భూపాలోత్తమ! వినుమా!
నీపనుపున ధర్మపాలు • నిం గని యాతం
డేపునఁ బల్కిన పల్కుల
రూ పెఱిఁగించెద నవత్న • రూపఘ్న! నృపా!॥

క॥ నోరికి వచ్చినకొలఁదిని
గాఱులు పేలెదవె! రాజ్య•గర్వాంధుఁడవై
యోరియయోధ్యాధీశా!
వేరము తగునా! మన కిటు • వియ్యంకులకున్॥

చం॥ కొడుకును ఖైదు సేయువిని•కోపము సెందెద వేల! సీతలన్
గడుపున దాఁచుకొమ్మ; మన•కాన్పిటు లాఱడి దెచ్చెనంచునీ
గడుసరిపోకలున్ విలువఁ•గాంచని వాకులుఁగట్టిపెట్టి నా
యడిదము వ్రేటుదప్పుకొను•మాయికనైననుభూధవాధమా

క॥ ఎంతటినిర్దయుఁడైనను
బంతమునఁ గూఁతుఁ బట్టి • పరిత్యక్తముగాఁ
గొంతుక గోసెదునల్లుని
నెంతయు శిక్షింప నుద్య•మింపఁడె! తలఁపన్॥ ౭౭

క॥ ఁదం డెత్తి వత్తు నీపయి
కుండుమ! ఖండన మొనర్ప • నురుతరధైర్యా
త్ముండ వయి' యంచు నన్నను
చుండెద వద్దాన భయము • నొందెద వనియా!?॥

క॥ దారసుతాదుల కెవ్వరు
దూరముగా నొప్పుకొంద్రొ • దురమున కవ్వా
రే రానగుఁ జుమి తక్కిన
వారలు రా నౌనె! ధర్మ•పాలునిపైకిన్॥

ఆ॥ వె॥ అన నయోధ్యనాథుఁ • డైనయాగ్రహమూర్తి
సార్థకాఖ్యుఁ డౌచు • ఁనాజికేళి



కాయితపడుఁ డెల్లి • యరుగుట నిశ్చయం'
బంచు నాజ్ఞయిచ్చి•నందువలన॥

సీ॥ వీరవారము విఱ్ఱ•వీగి బిట్టార్చెను;
బెబ్బులుల్ బొబ్బలు • పెట్టె ననఁగ
మదకుంభికుంభస్థ•మదధార లొల్కెను;
ఘనధునీవ్రజములు • గ్రాలె ననఁగఁ
దళతళ యనుఖడ్గ•ధారలు వఱలెను;
నదుల విసారముల్ • పొదలె ననఁగఁ
దురగఖురోద్ధూత•ధూళిపై కడరెను;
ధూసరం బయ్యె నా•ద్యుతల మనఁగ

తే॥ గీ॥ గుండ్లు పేలెను; బిడుగులు • గూలె ననఁగఁ
జూప నానందభయములఁ • జోద్య మంద
భూమి గ్రక్కదలెను దిశల్ • భోరుకొనియె
బలములు రథమ్ము లవ్వేళ • బయలుదేఱ॥ ౭౮

క॥ ఘూకములు కూసె నలుగడఁ
గాకంబులు పఱచి యఱచెఁ • గరువలి వీచెన్
భీకరముగ రాణ్మకుటం
బాకస్మికముగను జాఱె • నందఱు బెదరన్॥

తే॥ గీ॥ అట్లు నాల్గురేయింబవ • ళ్లరిగి యరిగి
ముట్టడించిరి కాంచన • పురము నంత;
శాత్రవానీకదుందుభి • స్వానము విని
ధర్మపాలునిదళవాయి ధైర్య • ధనుఁడు॥

ఉ॥ సేనల నన్నిటిం గొలిపి • సిద్ధముగా నట నిల్పెఁ గోటపైఁ
గానఁ; దదీయకాలమునఁ • గాల్చిరి; గొప్పఫిరంగులన్ సప
త్నానరాజి వాడునటుఁలాహవభూమి దొఱంగునట్టులున్
భూనరులెల్ల నుల్లములఁ భూరిభయంబునఁ దల్లడిల్లఁగన్ ॥

విమతశీల శోకించుట

తే॥గీ॥ ఆవిధమ్ముగా నిరువాఁగు • లడరి పోడఁ
నేమొ జయ మొందఁ గల మను • నిశ్చయమున
నపుడు మతశీల లోన ధై • ర్యంబు వీడి
కరముశోకించె నీకిందిఁ • సరణి వినుమ! ॥ ౫౨

తే॥గీ॥ తల్లి! నేఁటి కీ వేగి వ • త్సరము జరిగెఁ
గన్నులకుఁ గట్టినట్టుగఁ • గానిపింతు;
వెప్పు డేఁ గన్ను మూసిన , నప్పు డకట!
నిన్నుఁ జూడనిదే యింక • నిలువఁ జాల ॥

ఆ॥వె॥ ఇంతదాఁక భూమి • నీవజీవంబుతో
నున్న; నన్నుఁ జేర • కుండఁగలవె!
దారి నడుచునపుడు • దస్యులచేతనో
క్రూరసత్వములనో • గూలి యుందు ॥

మ॥ ఇదిగో! వచ్చెద సత్వరమ్మునని పా • శేశం దగం గూడిస
మ్మదముంగూర్చెదనమ్మ! వేమదలని • మ్మా!నన్నుఁగన్న
మ్మయుం
చెదనీకౌనటువేఁడ వద్దనఁగ నో • రేమాత్రమున్ రాకపో
మ్మదెయాశీర్వచనంబుగొమ్మనుచునిఁన్నిష్టంబుతో బంపితిన్



ఉ॥ కానుపు లేక లేక చిర , కాలము శస్త్రసమస్తయాత్రలన్
బూని విహారమున్ నలిపి , భూతమయాత్మక దేవసత్కృపా
దానము నంది గంటి నిను • దగ్ధవిషాదమనస్క నైతి నం
చేనను కొంటిఁ గాని;మది • నీగతినౌనని యెంచఁగూఁతురా

ఉ॥ ఏపది యేండ్లు వర్ధిలితొ; , యిందుశిలా తలసౌధరాజమం
దేవదినాళ్లు సూపితివొ; • యింపగుముద్దుల నాటపాటలీ
పాపవుదృష్టిన్ నిన్ననెడుఁభాగ్యము గాంచుట నన్ను బోంట్లకా
నీవలుకుల్ వినంబడుట , నిస్తులరూపిణి! శ్రీవిలాసినీ! ॥

కం॥ సిరితొలఁగినగతి నీ వటు
లరిగిన దాదిగ విపత్తు , లందితి మమ్మా!
గరమునపఖ్యాతియు బం
ధురణం బొడఁగూడె నమ్మ! • తుద కోకొమ్మా! ॥

కం॥ నీశ్వశురుఁ డేచి మాపురి
నశ్వరముగఁ జేయుచుండె; • నగధీరుండై
శశ్వత్పీడాకరుఁడై
శాశ్వతదుర్యశముఁ జెంద • జంకక యింతన్ ॥ ౫౯

ఆ॥వె॥ సగముకాలుబలము • సమసె సంగరమందుఁ
జదియ నుండెఁ దక్క • నగముగూడ
నింక మేమె! బ్రతుక • నీక్షించుటలు బిడ్డ
యాస లేదు సుమ్మి • యసువులందు ॥

చం॥ పలుకులు వేయు నేల! పరి • పంథిఖరాసివిదారితంబులై
యిలఁబడనుండెమాతలలిఁ • కేవిధిఁజూచినఁ;గానబిడ్డరో!

నలిధృతిఁబూనివీరులయ ♦ నన్యమృతింగనినిన్నుడాసెదన్
దలఁకకుమమ్మ!స్వర్గపురి♦ ధాతృపురిన్మఱియెందునుంటివో॥

ఉగ్రదంష్ట్రతీవ్రదృష్టుల యుద్ధము.

ఆ॥ వె॥ ఇచ్చ టిట్టు లుండ ♦ నచ్చ టయోధ్యరా
డ్యోధవర్యు లైన ♦ యుగ్రదంష్ట్రి
ఖరముఖులును హేమ ♦ పురనాథయోద్ధ లా
తీవ్రదృష్టిసుబల ♦ దీర్ఘభుజులు ॥ ౬౧

ఉ॥ ఒండొరులోలిఁదాఁకిశర ♦ యుద్ధమునంగయిలావుసూపి భ
ర్గుండుదయించెనిండఆస్వ♦రూపముదాలిచియంచునెంచఁగా
భండనమాచరించునెడఁ ♦ బౌరుషశాలితదుగ్రదంష్ట్రియు
గ్రుండయితీవ్రదృష్టిఁగని♦క్రూరశిలీముఖపంక్తినేయుచున్॥

మ॥ పలుఘోరాజులయందుఁజొచ్చిరిపుదు♦ర్వారోద్ధతింబాపిలో
కులు మెచ్చం గెలు పొంది స్వామిఋణమున్ ♦ గోర్కెం
దగం దీర్చి శ
త్రులతానాశలవిత్రుఁడన్ బిరుదుపొం♦దుంగన్ననావంటిశూ
రులతో నా!సమరంబొనర్పుటలు; పే♦రున్మాపెదన్నిల్వుమా॥

శా॥ ఆనాయంబునఁజొచ్చిమిట్టిపడుమ♦త్స్యవ్రాతముంబోలెనీ
వీనాఁడస్మదమోఘబాణతతిలో ♦ నెంతేనియుంజిక్కి ఘుం
టానాదంబుగఁబ్రేలు చేటికిర!ద్వి ♦ ట్సంఘంబులంజేరున
ష్టా!నీడంబము చాలుఁజాలుఁబదరా! ♦ డాఁగంగనీవీటికిన్॥

ఆ॥ వె॥ మగనిఁ గొట్టి మగువ ♦ మొగసాల కెక్కిన
విధము సుమి! మదీయ ♦ విభుని మీప్ర



భుండు యుద్ధమునకు ♦ మూర్ఖుఁడై గదియుట;
గూఁతునుగనిఁ జెఱను ♦ గొంక కుంచి ॥

తే॥ గీ॥ దున్నపోతైన నన్నచో ♦ దూడను వడిఁ
గట్టివేయుఁ డటం చను ♦ నట్టివారె;
గాని మీతేనిదగ్గఱ ♦ గానఁ బడరు;
మంచిచెడ్డల నారయు ♦ మంత్రివరులు ॥ ౬౨

కం॥ అని యటు లుల్లసమాడుచు
నినవిక్రముఁ డతఁడు తేరు ♦ నెల్లెడ నడవన్
దనసారథిఁ బురికొలిపి శ
రనిచయముం బఱపె నెదిరి ♦ రథ్యము లడఁగన్ ॥

ఆ॥ వె॥ అంతఁ దీవ్రదృష్టి ♦ చెంత నున్నమఱొక్క
రథము నెక్కి బాణ ♦ రాజిఁబఱపెఁ;
గినుక మేనుఁ బెంచి ♦ గ్రీష్మమధ్యందినా
దిత్యకిరణతతి య ♦ దే యనంగ ॥

ఆ॥ వె॥ మధ్యమార్గమందె ♦ మార్గణంబులఁ దున్మి
తలఁగ కుండ నుగ్ర♦దంష్ట్రి నిలిచి
వాఁడిశరయుగంబు ♦ వక్షస్థలంబునఁ
గ్రుచ్చఁ దీవ్రదృష్టి ♦ కూలె సొలసి॥

ఆ॥ వె॥ అపుడు ప్రధనభూమి♦యావలికిం గొని
పోయి సర్వవిధుల ♦ మూర్ఛఁ దేర్చఁ
దీవ్రదృష్టి కనులఁ ♦ దెఱచి సూతునిఁ జూచి
తోలు మనఁగ రథముఁ ♦ దోలె నతఁడు ౭౧

కం॥ అప్పుడు కూసము విడిచిన
సప్పముగతి నతఁడు పొలిచి • శాత్రవుఁ గప్పెన్
నివహము గ్రక్కడికోలల
నుప్పరమున దేవగణము • లొగిఁ గొనియాడన్॥

మ॥ మరియర్జున సూతుశిరంబు వ్రేల్మిడిని దుఃస్మార్దన్
ఘనాస్త్రంబునన్
ధరఁగూల్చెన్ రథరథ్యకేతువులనః స్త్రవ్రాతము న్వేయుచున్
బురుహూతాత్మజుఁడైనయర్జునుఁడిలం • బుట్టెంబునర్జన్ముఁడై
శరవిద్యన్ గనుపింప నంచరిజనుల్ • స్వాంతంబులం బెగ్గిలన్॥

ఉభయసేనాసంకుల సమరము.

తే॥ గీ॥ అంత సుగ్రదంష్ట్రి నవశ • తాంగ మెక్కి
యాగ్రహావేశు లై సహా • యపడుఖరము
ఖాదియోధులతోడఁ బై • కడరి రాఁగఁ
దీవ్రదృష్టియుఁ బిలిపించె • దీర్ఘభుజుని॥

ఆ॥ వె॥ దీర్ఘభుజుఁడు మిగుల • ధీరసాహసమూర్తి
గాన నతఁడు లక్ష • శాల్బలంబు
తోడఁ దోడువడెను • దురగదశాలంక్ర
త మగు తేరునందుఁ • దగ వసించి॥ ౭౫

ఉ॥ ఆసమయంబునందనిమె • నాహావభీముఁడుతీవ్రదృష్టి యి
ట్టీసమరావనిన్ విడిచి • యెచ్చటికై నను బొమ్మ! ప్రాణమం
దాసగలాఁడ వేని గుణ • మారయ కుండ మదీయరాజు నీ
వాసరణిన్ సడిన్ సలుప • నౌనె! దురాత్మ! మహామదమ్మునన్॥



కం॥ కోలలు గల వని గీటకు
కోలలు నెత్తిఁ గొలుకునాడు • కోలలు గనవే?
మీఱుచు నోటికోలందిని
గాలులు ప్రేలుటలు గాదు • గద రణమన్నన్॥

ఆ॥ వె॥ వాన గురియ లేని • వారిదంబులు జగా
మెఱుము లఱుము లంది • మిడిసిపడెడు
నట్లె యిచట విజయ • మరిది యాటం జేసి
వదరు చుంటి విట్టు • లదరిపడుచు॥

ఆ॥ వె॥ అనుచు నుగ్రదంష్ట్రి • నాడి వాఁడిశరము
లేయు చున్న తఱిని • నేచి మిపుల
బరవసమునఁ దాఁకె • నిరువాఁగు లిరువాఁగు
లటులఁ గలకలస్వ • నాధికతను॥ ౭౬

తే॥ గీ॥ శాల్బెడిశతఘ్నులపొగలు • కాఱుమొగిళు
లటుల యోధవీరులమహా • ర్భటులు పిడుగు
లటుల నేయునమ్ములు వర్ష • మటుల గాలిలు
నరదములవెలుగులు మించు • లటుల నొప్పె॥

సీ॥ గళితసామజవీర • కరబాహువిసరముల్
మెండైనజలగల • పిండనంగ
దళితరథికయోధ • తతిశిరోజాంత్రముల్
నలి నొప్పుదట్ట మాఁ • నాఁచనంగ
రణశూరవిస్రవ • ద్రక్తప్రవాహముల్
జను లెన్నఁగా లేని • ధునులనంగ

ఖండితద్విరదాళి • కాయనికాయముల్
వఱలెడు కొండల • వరుస లనఁగ

తే॥ గీ॥ దీవ్రనిస్త్రింశచూర్ణముల్ • తిన్నె లనఁగ
భగ్నబాణతతి విసార • వార మనఁగఁ
బలలమేదస్సమూహంబు • పంక మనఁగఁ
గరము నొప్పె; సంగరభూమి • కంధి యనఁగ॥

సీ॥ అంతకు మును శారదాంగన ప్రచ్ఛన్న
వేషంబుతో వీడి • వేదపురిని
ధర్మపాలుపుటభేదనమునకుం బోయి
వీరకాండ్రకుఁ గల్గు • పోరుఁ గాంచి
సుతకయి వగచెడి • సుతశీలనుం జూచి
యెఱుకతగా నామె • యింటి కేగి
దుహితను సుతపతి • సహితగాఁ గాంచెద
వనతికాలంబులో • నతివ వినుమ!

తే॥ గీ॥ అనుచుఁ గథియించి నమ్మించి • యనునయించి
వచ్చి యావదుదంతము • వరుసఁ దెలుపఁ
జిత్తమునఁ గొంతవడిదాఁకఁ • జింత నొంది
నచ్చెలిమనంబునుం గూడఁ • బుచ్చికొనుచు॥ ౮౨

సంధిజాబులు

ఉ॥ ఆసమయంబునందుఁ గబు • రంపఁగ జ్ఞానవతీకుమారి తా
వాసిగలట్టి వేదపురి • పాలునిరీతి రచించి జాబులో
సీసఖి! శారదా! తొరగ • నేగుమ! యుద్ధసమాప్తికై యెదో
వేసము దాల్చినాఁ గభట • వేషముతో నదిపోయి చెచ్చెరన్ ॥



ఆ॥ వె॥ కని యయోధ్యపతికిఁ • గైమోడ్పు లర్పించి
జాబు నీయ నతఁడు • సమ్మదమున
సచివుచేతి కిచ్చి • చదువు మనఁగ నాతఁ
డిటులఁ జదివి తేని • కిం పొనర్చె ॥

ఉ॥ వేదపురీశుఁడన్ మిముల • వేఁడెద నానతులందఁగా నయో
ధ్యాధరణీశ! మీకు విహి • తాత్ముఁడఁ గావున వ్రాయుచుంటి నా
మోదముతోడ మీర లికఁ • బోరుట మానుఁడు మీకుమారునిన్
నాదునివాసమందునిచి • నాఁడను వేగమె తోడితెచ్చెదన్ ॥

ఆ॥ వె॥ అంత హేమపురధ • రాధిపుం దర్శించి
భృత్యవినయగతులఁ • బ్రీతిఁ గొలిపి
లేఖ చేతి కీయ • లీలతోఁ దన్మంత్రి
యంది చదివె నిట్లు • హాయిగాను ॥ ౮౬

శా॥ మీవియ్యంకున క్లిష్టభూధవుఁడనై • మిమ్మం గొల్చెఁ డ
య్యానుహ్వా
ద్భావంబుందగనిల్పి మీరుదురమున్ • వైరంబుగా మానుడీ!
యేవిచ్చే సెదమీకొమార్తనిడఁగా ' నేనింతపర్యంతమున్
నావాసస్థలమందు భ్రాతవలెఁ బ్రాణంబిచ్చి రక్షించితిన్

కం॥ మరియుఁ ద్వదీయపుత్రి యస • మానగుణోత్తరదివ్యరూపమున్
వెరవుగ నచ్చుగుద్దినటు • వేయఁగఁ జేయుఁడు చిత్రకారులన్
ద్వరఁ బిలిపించి; మేడపయి • భాగమునన్ మఱియెవ్వరాపటం

బరుదుగఁ జూచియాత్రిపద • నౌదురొ; వారలఁబట్టినిల్పుఁడీ॥

కం॥ వచ్చెడుబుధవారంబున
వచ్చెద; సభచేయఁ గాన • వసుధాధిప! భూ
భృచ్ఛయములఁ బిలిపింపుమి!
చెచ్చెరఁ జాటంగఁ జేసి • సిద్ధపఱుపుమీ!॥

తే॥ గీ॥ అనుచుఁ జదువంగ ధర్మపా • లాధిపుండు
దద్విధమ్మునఁ జేయంగఁ • దద్ద సమ్మ
తించి వీరకానిని సమ్మ • తింపఁ జేసి
సభకు వలసినజతనముల్ • సలుపఁ దొడఁగె॥ ౯౦

తే॥ గీ॥ పిదప శారదయు మరలి • వెడలి చెలిని
గలిసి తత్సంగతిం దెల్పి • కమ్మ నొకటి
వేదపురనాథునకుఁ గూడ • వెరపుమెయి లి
ఖించి దానిఁ గొంపోయి తా • నీయ నత్ఁడు॥

చం॥ కనకపురీశుఁడర్ణ బ్రీణతి • గైకొనివేదపురాధినాథ! నా
మనవి నొనర్ప వేఁడెద సమంజసబుద్ధిఁ గనంగ రమ్మ! నా
తనయను గూర్చి ధర్మపథ • తర్కసభం జరిపింతు; రేపిట్ట
జనపతి వృద్ధబంధుబుధ • సత్తమకోటియనుజ్ఞ చొప్పునన్॥

ఆ॥ వె॥ అంచుఁ జదివి లోన • నత్యంతసంతోష
సాగరమునఁ దేలి • సఖున కదియె
యుంగఁ బల్కి శుభశ • తాంగంబుపై నెక్కి
బయలుదేఱి పోయె • ధర్మపురికి॥

తే॥ గీ॥ అట్లు సర్వదేశాధిపు • లఖిలసైన్య



భానమాను లై తద్దేశ • పట్టణంబు
సేర జ్ఞానవతియుఁ జేరెఁ • జెలులతోడ
నంత నిండియుండిన తత్స • భాంతరమున॥ ౯౨

పూరుషవేషముతో శారద పలుకుట.

చం॥ పెనిమిటిమాటదాఁటనిప • విత్రచరిత్రయొకర్తె మాపురిన్
దనయునిఁగాంచె నీనడుమ • దత్పతి దేశముమీఁదె కేగినన్
ఘనమతులార! పండితశి • ఖామణులార! ధరేశులార! మం
త్రినిపుణులార!యాబిడప • తివ్రతయందురె?మీరుసెప్పుఁడీ

తే॥ గీ॥ అనుచు శారద యొండు ధ • రాధినాథ
వేష మూని ప్రశ్నింపఁ దద్ద్విబుధజనము
లిట్టులనిరి పతివ్రత • యెట్లగునయ!
పెన్మిటింట లేనపు డామె • బిడ్డను గని॥

కం॥ పాతివ్రత్యం బాబిడ
యేతీరున నిల్పుకొనెనొ • యెఱిఁగించిన-చో
ఖ్యాతిగ దృష్టాంతము నిడి;
ప్రీతిగఁ జేకొందు మామె • స్త్రీమణి యనుచున్॥

ఆ॥ వె॥ అనుడు సంశయాళుఁ • డప్పరవిదుఁ గాంచి
ధీరవర్య! మున్ను • దెలిపినట్టు
పట్టిపటము ధర్మ • పాలుఁడు నిర్మింపఁ
జేసినాఁడె? మేడఁ • జిత్రముగను॥ ౯౩

తే॥ గీ॥ పిదప నేమయ్యెనో దెల్ప • వేఁడితి ననఁ
బరవిదుం డిటు పల్కె నో • బాలక! విను

చిత్రకారుల రావించి • చిత్రపటము
నట్లు రచియింపఁ జేసె నా • యధిపుఁ డంత॥

ఉ॥ జ్ఞానవతీ విశారదలఁ • జాలఁ గలంచిన ఘోరచోరులున్
గానసీమ మూర్ఛపడఁ • గాఁ బచరించినయాకళింగభూ
జానియు వానిపౌరులువి • చారముతోడఁ దదీయరూపమున్
బూనికనిల్పిచూచివగఁ • బొందఁగ; వారలనిల్పి రాభటుల్॥

తే॥ గీ॥ వార లెల్ల రీసభ నున్న • వారు గాన
శారదాంగనోపన్యాస • సరసగతిని
బట్టి యేడనో విన్నట్టి • స్వర మిదంచుఁ
జెప్పఁగొనసాగి రట రూఢి • చేయ లేక॥

శారద నిజవేషము చూపి పలుకుట.

ఆ॥ వె॥ అంత శారదాంబ • యామెరూపముఁ జూపి
శారద నని పల్కి • సభికులఁ గని
ధీరచంద్రులార! • మీరు గోరినభంగిఁ
జెప్పుచుంటి వినుఁడి • చిత్తమిచ్చి॥ ౧౦౩

తే॥ గీ॥ ఈమెయే జ్ఞానవతి సుండి • యాతఁ డామె
పుత్రుఁ డౌఁ జుండి యేఁడాది • బుడుతఁడు సుఁడి
యాతఁ డౌరసనామవి • ఖ్యాతుఁడు సుఁడి;
జనకుఁ డెచ్చోటికో పోవ • జనన మయ్యె॥

కం॥ ఎట్టని సంశయపడకుఁడి!
గుట్టంతయుఁ దెల్పుచుంటిఁ • గోవిదులారా!
తుట్టతుద దాఁక విని యే



వట్టున సందియము గలదొ • ప్రశ్నింపుఁ డయా!

కం॥ జ్ఞానవతీ నిజమార్గుల
కానాఁ డటు పెండ్లి యైన • దనుచు నెఱుఁగరే!
మానవనాథులు మీరలు;
గాన మరల దెలుప బూనఁ • గా నేమిటికిన్! ॥

పంచచామరము

నిషేకకార్య మైనరాత్రి • నిద్రమాని క్రుద్ధుఁ డై
విషంబు ద్రావి విత్తు లుమ్మి • వేయుచున్న నాథునిన్
ఝషాక్షి కారణంబు దెల్ప • సంస్తుతించి వందునన్
మృషోక్తు లాడ నోరు రాక • మెచ్చి యాతఁ డిట్లనెన్

కం॥ నను మాయ చేసి కనుమా!
తనయుని నీవిలఁ బతివ్ర • తామణి వని భూ
జనములు పొగడఁగ నివ్విధి
చనియెద నేనంత దాఁక • సతిరో! వినుమా! ॥ ౧౦౪

చం॥ అన విని దుఃఖితాత్మ యయి • యక్కట యిట్టియసాధ్య కార్యముల్
వనితలఁ జేయుఁడంచనుట! • భర్తలకున్; దగుధర్మమార్గమే!
యని బహునీతులం దెలిపి • యాతఁడు పట్టినపట్టువీడమిన్
మనమునఁ గుందుచుండ నొక • నాఁడది నేఁగనితోఁట లోపలన్

మ॥ చెలిరో! నీముఖకంజమేల కమలెన్ • జెప్పంగదే సత్యమున్!
సలుపన్నాకిను మంతయేని దగుచో • శారీరహృత్కష్టముల్
దలఁపన్ భీతిల వెన్న డిన్ సలుపుదున్ • దథ్యంబు సుమ్మీ యనన్

బలికెందద్విషయంబునెల్లననుఁడా•భావంబులోనమ్మటన్

ఉ॥ అంతనయోధ్యకేగక యొంటూతఁడునై జపథుండు వేదపూ
ర్వాంతునిమిత్రభావమునఁ•గానఁగఁ•బోవఁ దదీయవార్త వే
షాంతర మొంది నే వెడలి • యారసి సత్య మెఱింగివచ్చినా
స్వాంతమెఱుంగఁ దెల్పితిని•భర్తనువంచనఁ జేసికూడఁగన్ ॥

కవిరాజవిరాజితము.

తెలుపఁగ నాసఖి • ధీరయె గానఁ బ•తిం గనుమార్గము•
దెల్పు మనన్
దెలిపితిఁ బూరుష•ధీరునివేషము • దేఁకువఁ దాలిచి•
దిట్టలమై
వెలలి వనాంతర•భీకరదుష్కర•వీధుల దాఁటుచు•వేదపురీ
నిలయునిఁ జేరిన•నీపతి నెట్టులొ • నెయ్యునిఁ గాఁ గొని•
నెగ్గవలెన్।

ఆ॥ వె॥ అనఁగ నామె యట్లు • హర్షించి యారేయి
తగినజతన మొంది • తరలి వచ్చి
శాల మేగ కుండఁ • గదిసె నన్నొకచోట
నంత మేము కాన • నరుగుచుండ॥ ౧౧౩

లయగ్రాహి.

జమ్మనుచు మత్తకచ•యమ్ములు దిశావలిని • గ్రమ్ముకొన
భల్లుకము • లమ్మధువుఁగూడుల్
నమ్మదమునం బడసి • నెమ్మదిఁగఁ గ్రొల్లి విట•పమ్ములను
వీడి యిల • పొమ్మసిలి గూలున్



బమ్మవత్తుధార్త్రి వనిఁ • గుర్రమ్మరిలుజంతునిచ•యమ్ముల
విభీషణర•వమ్ములు చెలంగన్
దమ్ముఁ గని చంపుట నిఁజమ్మనుచు నెంచి హరి•ణమ్ము
లతిభీతిని ర•యమ్ము మెయిఁ బాఱున్॥

మత్తకోకిల.

అట్టిఘోరవనంబునందున • నందినారము పెక్కు లి
క్కట్టులీసభ నున్నచోరులఁ•గాంచి మీరడుగం దగన్
జెట్టుపై వసియించి మమ్ములఁ•జేడె లంచు గ్రహించి వా
రెట్టులేనియు మోసపుచ్చఁగ•నెంచి రేమయిరో! తుదన్॥

కం॥ శ్రీచారుముఖులు మాచెలు
లీచానలు యవనదేశ•నృపదుహితలు వీ
రాచోరులవాతం బడి
మాచే విడి బ్రతికి రచట • మైత్రి పొసఁగుటన్॥ ౧౧౪

మానిని

ఆదటనల్వుర •మాయటవింబడి•యర్ధనిశాసమ•యంబుననా
మోదమున న్వెసఁ • బోయెదు నత్తఱిఁ • బ్రొద్దలప్రాగ్దిశఁ
బుట్టఁగనా
చ్ఛాదనచిత్తవ•శుండుకళిందవ•నుత్కతివుండటఁ సూకరసం •
వాదమున న్నము • వైరులు గాఁ గొని • బాణసముత్కర •
వర్షమునన్

తే॥గీ॥ జ్ఞానవతిని సోలఁగ నేసి • సత్వరంబ
పురికిఁ గొంపోవ నెఱుకపూఁ•బోండ్లవృత్తి

మేము ముప్పురముం బోయి నే • మెలఁకువమెయి
సఖిని దెచ్చితి మనుగుఁడా • జనపతి నిట! ॥ ౧౧౭

మహాస్రగ్ధర

అటుపైని న్నేము వేదా • హ్వయనగరికి సాం • ద్రాటవీ
మధ్యమందున్
బటుబుద్ధి న్బోయి లోకుల్ • భ్రమపడ గణికా • భామినీ
వేషలీలా
నటనల్ చూపించుచుం ద • న్నరపతిసభ కా • నందముం
గూర్పఁ బోఁగా
నట వారుం గోరుట న్నా • ట్యసహితశుభగా • నామృతం
బిచ్చినంతన్ ॥

తే॥గీ॥ మానవేంద్రుండు మెచ్చి స • న్మానముగను
వజ్రవైడూర్యరత్నాది • బహుమతు లిడ
వలదు వల దని నుడివి మా • వాంఛఁ దెలుప
వ్రాసి యిచ్చె లేఖను దీనిఁ • బరఁగఁ గనుఁడి! ॥

ఆ॥ వె॥ పిదప నెల్లర మల • వేదపురమ్మునం
దొక్కచో గుడార • మొనరఁ గట్టి
యందు వాస ముండి • నంత మాజ్ఞానవ
తిని వరించెఁ బతియు • తెలిసికొనమి ॥ ౧౨౦

ఉ॥ ఆమెయుధన్యనైతినని • యాత్మఁదలంచుచుహర్ష మొందివే
శ్యామణి యట్లు నవ్యదర • హాసవిలాసదృగంచితాంకుర
స్తోమముఖాంబుజంబుమెయి • నూనశిలీముఖవేదనాత్మచే
ష్టామధువాక్కులన్ సురతి • సౌఖ్యనివాసనటంచుఁదెల్పఁగన్



క॥ అతఁడు వ్యామోహంబున
నాతిరో! నీ వేమి కోరి • న న్వస నిత్తున్
చేతస్సంభవశరపీ
డాతురుఁడ న్నన్నుఁ గావు • మా! కృపతోడన్

సీ॥ నాఁగ నాచెలి యెల • నగవుమై వినుభూప!
వేరున కే నాట • వెలఁదిఁ గాని
తద్వృత్తిచేత ను • దరపోషణాభిలా
షను గాను ధనము వి • స్తార ముంట
నైనఁ బెద్దలవిద్దె • నభ్యసించుట విధి
కృత మంచు మీరు మా • పతు లటంచు
శాశ్వతానందంబు • సద్యశోధన మంచు
నెంచి కీర్తిస్వము • నెట్టులైనఁ ॥

తే॥గీ॥ గడననేయఁగ వచ్చితిఁ • గడకతోడ
నేఁటికిఁ గద నాపుట్టుక • మేటికోటి
సాటి యయ్యెఁ జొక్కాలిఁ కేల • స్వలిఖిత మగు
పత్రికల నిచ్చు చుండుఁడీ! • పత్ని నాదు ॥ ౧౨౩

తే॥గీ॥ అనఁగ నతఁడు సమ్మతిపడి • యదియ మొదలు
కోరినట్లెల్ల విరచించి • గుఱుతుపొంకె
ముద్దుటుంగరంబుతోడన • ముద్రవేసి
సంతకము చేసి యిచ్చిన • జాబులివిగో ॥

క॥ అని చూపించిన సభికులు
గని చదువఁగ వేఁడికొనిరి • గావున నీతీ
రునఁ జదివి యామె వారల

మనముల రంజించె నిజస • మాఖ్య రహింపన్ ॥

మత్తకోకిల:—

'లాసికామణి! నీవిలాసక • ళావిశేష ము దట్టిదో
మోసపుచ్చెను జాయచేతనె • మోసపోవనిన న్నిటన్;
వాసిగా నినుఁ బోలువారలు • వారకాంతల నుండుచో;
వాసి కెక్కదె! తత్కులంబును • వైదుషీమహిమోన్నతిన్ ॥

ఉత్సాహ:—

సతివి నీవె నాకు నింక • సంతతంబుఁ జూడ స
ద్గతివినీ వెసుమ్మనమ్ముఁ • గదవె! వారకాంతరో!
నుత చరిత్రయైనభార్య • నుడుల వినక చెడితి; నా
పితల నెల్లబందుగులను • వీడి వేఱుఁడింబలెన్ ॥ ౧౨౭

తరల:—

మనకుఁ గల్గినయీతనూజుఁడు • మాననీయుఁడు కాఁగ; వీ
పున రచించెద నాదు వేరిటి • ముద్దుటుంగ్రముర త్నులన్;
జనము లెల్లపు డిందుచే నను • సంస్మరింపఁగ నోసఖీ!
కినుక చెందకసమ్మతింపుము! ఖేద మొందకు మాత్మలోన్ ॥

కం॥ అని చదివి యాకుమారుని
జనపతు లెల్లరుఁ బరీక్ష • సల్పఁగఁ జూపిం
చిన వార లరసి నిజ మం
చని పరిహాసం బొనర్చి • రాతని చెయ్దిన్ ॥

తే॥ గీ॥ మఱియు శారద యిటు లను • మాన్యులార!
పిదప నేమాఱు వేసంబు • వేసికొని యు



యోధ్య కేతెంచి గాంచ భృత్యుం డొకండు
తత్పురీశుండు పెట్టుబాధలకు జడిసి॥ ౧౩౦

ఆ॥ వె॥ కొలువు మాని యమితశోకాంతరంగుఁడై
యదను వేచి యుండి • తుద కయోధ్య
నాథుఁ డతనినతియు • నందనురాకకై
యెదురు చూచు చుండు • టెల్ల నెఱిఁగి॥

ఆ॥ వె॥ ధర్మపురికిఁ బోవఁ • బయన మా సందేశ
హరునిఁ గాంచి లంచ • మతని కిచ్చి
తానె పోయి లేని • పోని మాటలు సెప్పి
పీరకాంద్ర కెటులో • పోరు గూర్చె॥

కం॥ ఈవృత్తాంతం బంతయు
నే విని వెసఁ బోయి చెలికి • నెఱిగించిన నా
ధీవినుత వేఁడుకొనె న
న్నేవిధమున నైన మాన్ప • నిరువురిపోరున్॥ ౧౩౩

ఉ॥ అంతట నామె వేదనగ • రాధిపునిం బలె వ్రాసి యుత్తరా
లెంతయు విశ్వసింప నతఁ • డిచ్చినముద్రరచించి యీయ న
త్యంతధృతిం దదీయవసు • ధాధిపుచారునిరీతిఁ బోయి భూ
కాంతులఁ గాంచి యిచ్చితిని • గమ్మల రెంటిని వారివారికిన్॥

కం॥ ఆయుంగరమాభూపుం
డాయువతి కొసంగ లే దఁయా! బుధులారా!
శ్రీయుతనై జపథుఁడై తాఁ
జేయించె మదీయసఖికిఁ • జేత స్ఫులరన్॥

కం॥ చూడుం డాయీయుంగ్రమ్ముఁ
బాడిఁగ నాయుత్తరములఁ • బరికింపుఁడు నే
నాడినమాట ల వెట్టివో
రూఢిఁగ మీ రెఱుఁగ నగుఁ బూరుషమణులారా!॥

కం॥ ఆప్పైనిశు త్రిపురేశ్వరుఁ
డీపురికిం జేరు వెరపు • నీక్షించి తగన్
భూపాలోత్తంసుం డీ
త్స్మాపునివలె వ్రాసి యిడితి • జా బాతనికిన్॥ ౧౩౭

కం॥ ఆజాబున నృపునంతక
మేఁ జేసితిఁ దెచ్చి చూడుఁడీ నేరుపుమై
భూజానీందుల్లు సకళా
భ్రాజిష్ణులు మంత్రివరులు • పరతంత్రజ్ఞుల్॥

తే॥గీ॥ ఇం కొకటి సెప్ప మఱచితి • నేమి టన్న
నపుడు నుతశీలకూఁతుపై • నాశ వీడి
యసువులం గోలుపోవఁ బ్రి • యత్నపడఁగ
నెఱుకసానిగ నే నామె • యింటి కేగి॥

తే॥గీ॥ కొలఁదికాలంబులో నీవు • కూఁతుఁ గాంతు
వామె సుఖముండె మగనితో • నరుగుదెంచుఁ
గాన సాహసకృత్యముల్ • మాను మమ్మ!
యనుచుఁ బల్కితి నడుగుఁడీ! • యామె నిపుడు॥

తే॥గీ॥ ఇంక నేఁజెప్ప వలసిన • దేమి లేదు
గావున విను డోపికతోడఁ • గడపటినుడి



నేనుఁ దెల్పినవృత్తాంత • మెల్ల నరసి
నిజహృదాశయ మీయుఁడీ! • నిపుణమతులు॥

సభవారి యభిప్రాయములు.

ఆ॥వె॥ అనుచుఁ బలికి యామె • వెనుక నున్న చెలుల
తోడఁ గూడె నంత • దొంగలదొర
కొలువుకూటమందుఁ • గూర్చున్న ప్రాజ్ఞుల
కెఱిఁగి పలుకఁ జొచ్చె • నెలమి నిట్లు॥ ౧౪౨

శా॥ నాచాతుర్యపుటింద్రజాలమహిమల్ • నాదంభచేష్టావళుల్
నాచౌర్యాద్భుతకృత్యవేషనటనల్ • నానేర్పు మన్నా యెఁనీ
వాచాభూమల ధీబలంబు మెయిసత్త్వావీణ్యమాయాళిచే
నీచానల్ సుఁడిమాధనాంగనలఁ గొంచే తెంచిరా రాతిరిన్!

చం॥ అనుడుఁ గళింగనాథుఁడను • నయ్యెడ లేచి వినుండి! సభ్యులీ
వనిత వచించినట్టు నను • భంగ మొనర్చిరి వీరు మువ్వురా
కనకలతాంగి జ్ఞానవతి • కౌశలయుద్ధము సేయ మెచ్చితిన్
వినతు లొనర్తు వీరలవి • వేకపటూర్జితబుద్ధిశక్తికిన్॥

తే॥గీ॥ అంత యవనదేశాధిపుం • డమితహర్ష
పూర్ణచేతస్కుఁడై లేచి • మొక్కి సభకు
దుష్టచోరాపహృత లైరి • దుహిత లకట!
యనుచు వగచుమాపూర్వభా • గ్యంబుచేత॥

తే॥ గీ॥ వీర లాదారినే పోయి • విపినమందుఁ
జోరు లుండెడియింటనే • చొచ్చి నాదు

కూఁతులం గాంచి స్నేహంబు ♦ గోరి వారిఁ
గాచి తెచ్చుటకంటె భా•గ్యమ్ము గలదె!॥ ౧౪౬

ఆ॥ వె॥ ధనము పోయి మరల ♦ ధనికి లభించినఁ
బ్రాప్తనష్టపుత్రి • పౌరునిగతి
సంతసింపఁ బోఁడు • సర్వంసహాస్థలి
నెంతచిత్ర మహహ! • స్వాంతవృత్తి॥

కం॥ వీరలకరుణకు మెచ్చెద
వీరలధైర్యాన్వితమతి • వినుతించెద నీ
చారుచరిత్రలు నాడుకొ
మారితలం బ్రోచుటను న•మస్కృతు లిడుదున్।

కం॥ అని యుపవిష్టుం డవుటం
గని వేదపురీశుఁ డనియె • గళమెత్తి యిటుల్
ఘనులార! వీరు గణికలె
యని మనమున నమ్మినాఁడ • నవివేకమునన్॥ ౧౪౯

చం॥ ఎఱుఁగక యెగ్గు చేసితి క్ష•మింపరె! జ్ఞానవతీవిశారదా
శరరుహనేత్రలార! రతి•సన్నిభసుందరగాత్రలార! శ్రీ
కరగుణశక్తులార! పర•గర్వవినాశనయుక్తులార! భా
సురచిరకీర్తులార! నుత•సూనృతవర్తనలార! వేఁడెదన్॥

ఉ॥ జ్ఞానవతీ! త్వదీయమతి•సారమెఱింగితి; నీదుకాంతుఁడున్
నానెఱసంగ డీఁడు నగు•నైజపథుండు వచించినప్పుడే;
యైనను గాల మేఁగువఱ • కబ్జదళాక్షుఁడుఁగూడ నన్యథా
పూనఁగ లేఁడు; గావఁడఱిఁ • బుచ్చితినాకడనిల్పినీపతిన్॥



ఆ॥ వె॥ తోడితెచ్చినాఁడఁ • దొయ్యలి! వానిని
గూడి మనుమ! సత మ•కుంఠితముగ,
మోటుపట్టుఁ బట్టె ♦ మొఱకుఁడు విభుఁ డంచుఁ
దగ్గ కుండఁ దివిరి ♦ నెగ్గి తీవు॥

కం॥ 'పురుషులు వనితలమనముల
నరయుటకై యాజ్ఞ లిడుదు • రతికఠినముగా
వెఱచుట దగ' దని మదిలోఁ
బరికింపక యింతపనికిఁ • బ్రారంభింతే!॥ ౧౫౩

తే॥ గీ॥ అనుడు ధర్మపాలపురోహి•తాగ్రగణ్యుఁ
డిట్లు వల్కె సభాసదు ♦ లెల్లరు విన
నిజసతి పతివ్రతాత్వస•న్నియమ మింతఁ
దప్పఁ ద'ప్పని చెప్పనా•గొప్పవారు॥

ఆ॥ వె॥ తాముఁ గూడ నేక•దారవ్రతం బూని
సంచరించుచున్న ♦ సరియె గాని;
నైజమార్గుఁ బోలె ♦ నాతి కాజ్ఞాపించి
కోమలాంగి నొకతెఁ ♦ గూడ నగునె!॥

ఆ॥ వె॥ కాదు కాదుతనదు ♦ కాంతతోఁ బొందిన
యతని దూఱఁ గూడ • దందు రేమొ;
మొదటఁ దెలిసికొనియె ♦ గదియుచో మీమాట;
గానియెడల నదియుఁ • గానిమాట॥ ౧౫౬

ఉ॥ ఆతనిమోటుపట్టునకు ♦ నాపె సుశీలయు, శారదాప్రియో
పేతయు యుద్ధపాండితిని • విద్దెనుబుద్దినిబెద్ద గావుటన్;

పీతభయాంతరంగి యయి • వెల్లి మహాపదలందు మున్నియున్
నూతనశోభ గాంచినద • నూనజయంబును బొంది యన్నిటన్

తే॥ గీ॥ అన నయోధ్యనాథుం డిటు • లనియెఁ దాను
భటునిఁ బెట్టినయానాఁటి • పాట్ల నాత్మ
నెంచి మిపులఁ బశ్చాత్తాప • వృత్తి నొంది
వీరకానికి సభకును • వినతు లొసఁగి॥

తే॥ గీ॥ తెలియక మునుముం దొనరించి • దెలిసికొనియు
వెనుక ననుభవ మొందుట • విధి నరులకు
ననెడుచందంబు గాదె! భృ • త్యాధమునకుఁ
జెఱుపు మఱి జేసి యిప్పుడేఁ • జింత గనుట॥

తే॥ గీ॥ ఔర! యెంతకుట్ర నొనర్చె • నసద యొకఁడు
తన్మాత్రలేశుల మామాకె • సాహసమున;
సమయముం జూచి మదసాము • జయుగమునకుఁ
బోరుఁ గల్పించినట్టి జం • బుకము రీతి॥ ౧౬౦

కం॥ కోపము నిలుపకు మదిలో
భూపాలకచంద్ర! బావ! • బుధజనభావా!
నీపట్టిగుణవిశేషము
నీపుణ్యచరిత్ర మింత • నేఁ గన కనికిన్॥

కం॥ వచ్చితి వృథగా మిము శ్రీమ
పుచ్చితి మీనేనకొంత • పొరిపుచ్చితి నే
నచ్చెరు వందితి నానుతు
పిచ్చికి; నీకూఁతుమతికిఁ • బ్రీతిం గంటిన్॥



కం॥ అని వచియించుచు నుండగ
మనమునఁ దనవీరకాని • మనము కరఁగఁగాఁ
జని కరయుగళముఁ బట్టెను;
జను లీగతిని పౌరపాట్లు • నవరించుకొనన్ ॥ ౧౬౩

ఉ॥ అంతట ధర్మపాలుఁడు ర • యమ్మున లేచి వచించె నీగతి
న్వింతయె! స్వాంతవత్తులకు • నెంజిలియుం బరితోష
మొందుటల్
శాంతముతోడఁ జూడమన • నంగరమూలము భాగధేయమే
యెంతయు నౌను; గాని మన • యెవ్వరితప్పిద మింత లేదుసూ!॥

ఆ॥ వె॥ అయిన దేమొ యయ్యొ! • నయ్యయయోధ్యభూ
విభుఁడ! నాదుమనవి • వినుమ! యింక
జరిగినకథ నింత • జ్ఞప్తిని నిలుపక
బంధుమైత్రినిల్పు • భావమలర ॥ ౧౬౫

తే॥ గీ॥ అట్లు సాంత్వవచస్సుల • నాడికొనుచు
వార లుభయులు గలిసిరి • ప్రమదమునను
గానుఁ గాడినమనుజుఁడే • కడకు వేఱు
గాని; నుపులు నూనె య ఔనె! • గాంచ భువిని ॥

కథాసమాప్తిక్రమము

తే॥ గీ॥ సభ్యులు నుపన్యసించిరి • జ్ఞానవతిధృ
తిమతికిని యుక్తిగతికి న • తిముద మంది;
శారదాంగనచెల్మికిఁ • జాలమెచ్చి
యట్టివారలఁ బొగడుట • యబ్రమౌనె! ॥

తే॥గీ॥ ఆతనికి భవ్యవేదవు • రాధిపుండు
నాసుశీలకు నాశార • దాంగనయును
జెలులు గాకున్న నేమౌనో • సెప్పఁ గలమె!
చెలులు గలవారికోరికల్ • చేకుఱుఁ గద! ॥

తే॥గీ॥ ధర్మపాలుండు వచ్చిన • ధరణిపతుల
హితుల శ్రితకృతిభూసుర • తతుల నెల్లఁ
గాంచి మీరుమదర్థంబు • గడఁదిశ్రమల
నందినారలు బహుదూర • మరుగుదెంచి ॥

తే॥గీ॥ మీశుభోన్నతబుద్ధికి • మెచ్చినాఁడ
మెచ్చి శతనమస్కారంబు • లిచ్చినాఁడ
నిచ్చికోర్కి నింకొండు చె • ల్లింతు రంచు
నిచ్చ టది గూడ వాక్కునివ్వఁ • జొచ్చినాఁడ ౧౭౦

కం॥ ఈదిన మందఱు మీ రా
మోదమున న్నిలిచి యతిథి • భోజనసత్కా
రాదరణాదులు వడయం
గా దయచేయుం డటంచుఁ • గడుఁ బ్రార్థింపన్ ॥

కం॥ వారలు నందుల కొడఁబడి
యారేయచ టుండి యుదయ • మౌ చుండంగన్
బోరనఁ దమతమపురములఁ
జేరంగాఁ బోయి రతని • చేఁ బూజితులై ॥

కం॥ వియ్యంకుం డడుగుటచేఁ
జయ్యన నాధర్మపాల • జనవిభుఁడు సుతన్



నెయ్యమున సారెచీరల
నయ్యారే! యనఁగఁ బంపె • నాసమయమునన్ ॥

సీ॥ వినుతశీలయు నామె • వెంట సవతు లేద్వ
రును సఖులును బౌర • వనిత లెల్ల
జ్ఞానవతీదేవి • సాగ నంపుచు నిట్లు
విలపింపఁ దొడఁగిరి • విడువలేక
యన్నులమిన్న! నీ • విన్నాళ్లుఁ బరదేశ
ముల బాధ లెన్నెన్నొ • పొరసియుంటి
మఱి మీఁదఁ గొన్నాళ్లు • మాకన్నులకు నెంతొ
పాడువ సేయుచు • నుండెద వని

తే॥ గీ॥ దలఁచినారము; గాని యి • త్తఱిని శ్వశుర
పురికి నేగెద వం చెద • నెఱుఁగమైతి
మక్క టక్కట! యం చెక్కు • డార్తి గనిరి
బాలికలఁ గన్నవారి కీ • పాట్లె గాదె! ॥ ౧౭౪

సీ॥ అటు కొంతదవ్వు తా • మరిగి వీడుకొలిపి
మరలి వచ్చుచుఁ దారిఁ • దిరిగి చూచి
పోవు చున్నట్టియా • పూఁబోఁడి కరణమా
గోతురంగమహాంగ • కుంజరములు
శృంగారశకటశ • తాంగరాజంబులు
దానదాసీజన • తతులు సఖులు
పెంపుడుపక్షులు • విద్వత్పురోహితా
మాత్యగాయకదివ్య • నృత్యజనులు

తే॥ గీ॥ మణిగణవిభూషణాపూర్ణ • మందసములు
వరుసఁగా నెన్నియో సారె • వస్తువు లగ
పడుటచేఁ జెప్పుకొనుచు నా • పడఁతు లెల్లఁ
గడకు నెదియుఁ గనక దుఃఖ • పడుచుఁ జనిరి॥

తే॥ నీ వటుల్ సంశయాళుఁడా! • నీరజాక
రంబుదగ్గఱ విన్నవా • ర్తావిశేష
మిదియె యనుచుఁ బరవిదుండు • ముదముతోడఁ
దెలుప నాసంశయాత్ముండుఁ • బలికె నిట్లు॥

చం॥ అనఘవరేణ్య! దోషరహి • తాత్ముఁడ నైతి నిదత్కథాసుధన్
దనివిఁగ నాని మీవలన • ధర్మవిధిజ్ఞుఁడ నైతిఁ గొంతదాఁ
క నిఁక భవత్సుబోధనను • గానగుఁ బూర్ణకళావిశేషుఁడన్
గనుక; దయామయేంద్ర! త్రిజ • గన్నుత! తత్త్వము
బోధ సేయవే

తే॥గీ॥ అనియు శుశ్రూష గావించు • నామహాను
భావుకడఁ గొంతకాలంబు • వఱకు నుండి
జ్ఞానవిద్యామహాత్ముఁడై • సమ్ముదమునఁ
జేరె నింటినిఁ దనయొజ్జ • సెలవొసంగ॥ ౧౭౮

కం॥ కావున సోమరిపోతుల
భావమ్మున రోసి పితలు • బయటికిఁ దోలన్
వావిరి దేశాటనమున
ధీవినుతు లవుదు రటంచి • దే బోధించున్॥

కం॥ దీనిం జదివిన స్త్రీలకు



మానవతీధర్మ మెల్ల • మదికిం దెలియున్
జ్ఞానవతీసతికిం బలె
మానసఖేదంబు లన్ని • మానుగఁ బాయున్॥

లలితపదవృత్తము

పరమకృపాకర • పాపవిదూరా
నిరుపమసద్గుణ • నీరదవర్ణా
కరివరదాయక • కల్పితలోకా
స్మరహరమిత్రప్ర • శస్తచరిత్రా॥ ౧౮౧

సుగంధి

చింతితార్థదాయకావి • శృంఖలోగ్రసాయకా
కంతుజన్మకారణాజ • గద్విపన్నివారణా
శాంతరూపరాజితావి • శాలకీర్తిభూషితా
దాంతవర్తనాతపోని • ధానసంతతావనా॥

స్రగ్విణి

భూపసంప్రార్థితా • భోగిరాజార్చితా
రూపరేఖాంచితా • రోగదూరాచ్యుతా
పాపవిధ్వంసకా • భవ్యపీతాంశుకా
గోపికారక్షకా • క్రూరదైత్యాంతకా॥

## —:గద్యము:—

ఇది శ్రీమత్సరస్వతీ నిర్హేతుకజాయమానకటాక్ష వీక్ష
ణపవిత్ర మధ్వమతహారితసగోత్ర చిల్లరిగె వంశ
పయఃపాథోధిరాకాసుధాకర నరసింహ
రాయార్య ద్వితీయపుత్ర సకల
బుధజన మిత్ర యోగా
నందకవి ప్రణీతంబైన
జ్ఞానవతీ
ప్రబంధమండలి
చతుర్థాశ్వాసము.
సంపూర్ణము.



# శుద్ధపత్రిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 5- | 7- | చేత | చేఁత |
| 6- | 14- | మంచు | మైత్రి |
| 8- | 4- | సగ్ర | నగ్ర |
| ,,- | 7- | ధే | థే |
| 12- | 24- | చెంత | చెంతఁ |
| 13- | 11- | ఐగ్ధ | ఐర్ధ |
| 16- | 18- | లక్ష్మి | లక్ష్మీ |
| ,,- | 23- | భంచి | భవించి |
| 21- | 12- | వనతా | వనమాతా |
| ,,- | 13- | కపు | కము |
| 22- | 23- | ముఁన్ | మున్ [(త్రి) |
| 23- | 20- | మద్గు | మడుగు (సర్వ |
| 26- | 9- | బాధు | వాఘు సర్వత్ర |
| 27- | 1- | దిక్కృరి | దిక్కృతి |
| 31- | 14- | కండ్లు | కనుల్ |
| 32- | 10- | దాయె | డాయె |
| ,,- | 14- | విభుడు | విభుఁడు |
| 33- | 5- | భర్త | భర్తృ |
| 36 | 12- | జరికిం | ఖరికిం |
| 39- | 8- | నరి | సరి |
| ,,- | 12- | జసు | జను |
| 40- | 10- | ప్శి | ప్సి |
| 41- | 17- | దుఁబు | దుపు |
| 44- | 2- | నున్న | యున్న |
| ,,- | 4- | విడచి | విడిచి |
| ,,- | 17- | వెసు | వెను |
| 46- | 13- | తులి | తుల |
| ,,- | ,,- | నయి | నని |
| 48- | 12- | పథి | గతి |
| 49- | 21- | ఊఱ | ఊర |
| ,,- | 23- | రపు | రము |
| 51- | 1- | చేతు | సేతు |
| 55- | 17- | నటులఁ | నటుల |
| ,,- | 21- | దోప | దోఁప |
| 56- | 8- | పిరికి | పిఱికి |
| 58- | 13- | దుఁడు | దుండు |
| 61- | 22- | చైత్రశ | చైత్రశ్వ |
| 63- | 14- | పపరు | పకరు |
| 64- | 1- | చెను | చెగ |
| ,,- | 2- | ఘనపద | గనతిల |
| ,,- | 23- | నఁగ్ర | నగ్ర |
| 65- | 15- | తముసే | తమయే |
| ,,- | 20- | కను | కయ |
| 66 | 18- | రమణత | రయమున |
| 67- | 2- | గానుఁ | గాను |
| ,,- | 10- | రాగ | రాఁగ |
| 68- | 13- | కండ్లఁ | పోయి |
| 69- | 13- | గోఁ,నూఁ | గో, నూ |
| 71- | 2- | నాధి | వ్యాధి |
| 72- | 13- | స్థి | స్థి |
| ,,- | 16- | అసే | అఁజే |
| ,,- | 24- | బజే | బుఁజే |

77- 17- విసరు విసురు
79- 2- తులు తులం
,,- 3- డంగజాడు నట్టేరి లినచం యుంజం
,,- 10- ముక్కాల ముక్కాల
81- 6- జాసి జాశి
83- 2- తుండు తుండ
,,- 13- షింప ష్టింప
,,- 20- కొదువ కొదవ
87- 8- సుమీ సుడీ
99- 15- నడ్డి వింసు
100- 10- లెల్లనడ్డి లాలకించి
,,- 15- లద్దు గోరు
,,- 16- లాండురు లాండోరు
101- 5,8- నిసిత నిశిత
,,- 9- దడే దండే
102- 5- లించిన లించెడు
103- 6- తోడూ తోంగూ
,,- 13- రాజమిథు నంపు సతీపతులకు
105- 1- నర్థ నర్థ
,,- 2- సత్త సత్త
106- 16- చూలి చూలు
107- 1- పసి బసి
,,- 2- హింం హిం
,,- 7- త్తెర త్తెఱ
109- 7- పర్త వర్త
,,- 9- లార్థ లార్థ
,,- 21- ంజెన్మి టియ భర్తృవ్యాద
,,- 23- వవు వపు

111- 1- పొంపి పొల్లయిపో రివో
112- 3- గ్రోలు గ్రాలు
113- 1- ణ్ర్వ ణ్రప
115- 6- సేర్చెం సేర్చె
117- 5- కూతు కూంతు
,, 21- మతి మణి
118- 10- నాండుః నాండు
,, 19- న్నట్టుల న్నట్టులం
119- 8- నచి సచి
,, ,, సలుగ సలుక
123- 1- పీట పీంట
124- 1- జంది బంది
,, 10- లగం లంగం
,, 18- ఎడుక పడుక
125- 4- మానము మానము
127- 19- కుపె కుంబె
128- 1- పెట్టి పెట్టి
,, 3- మగ్రి మగ్రిం
,, 8- మరు మర
,, 18- జనిరి చనిరి
129- 1- మిథు మిథు
,, 17- లెల్ల వెల్ల
,, 22- పురినిం పురిని
130- 5- తోడం తోడ
132- 1- అందతి అందఱ
,,- 17- నడి సడి
,,- 23- దాప దాంప
,,- ,,- సెపుడి సెపుండి
133- 16- శారవు వెరవు శారదవెరవు



,,- 20- తిం తీం
135- 18- యెసం యొసం
,,- 23- యర్థ యర్థ
136- 20- మోదం మోదం
138- 10- పురికో పురికో
,,- ,,- మీాఱ మీాటి
,,- 11- రదు రద
,,- 21- దుడ్లు దుడ్లు
139- 9- ద్భాప ద్భాభ
,,- 16: పాంధు పాంథు
141- 8- నీడ నీడం
144- 18- శయ్యాబ శయ్యాంబ
146- 3- పిదప పిదపం
147- 15- యంద్రం యంద్రు
,,- ,,- బుద్ధి బుద్ధి
,,- 18- డే డీ
148- 4- నబొ నంబొ
,,- 5- వదన ఐచన
149- 5- గొన కొన
,,- 23- ఖట్గ ఖడ్గ
150- 15- రారెద రారెంద
151- 13- దర దఱ
154- 11- సెతిం సెతిం
156- 12- గ్గరి గ్గతి
,,- 17- లింద లింగ
,,- 19- మీాద మాద
,,- 21- తించె తిచె
157- 3- స్ఫు స్ఫు
,,- ,,- యగ యంగ
158- 8- కొలది కొలంది
,,- 14- ఓడు ఓండు

,,- ,,- బని పని
159- 2- నిందు నిండు
160- 5- నంగ సంగ
162- 10- సైజ సైజ
,,- 22- నతి సతి
163- 12- యెం యుం
165- 3- మారు మాఱు
166- 2- గనవిన గనలిన
,,- 6;10 అం అం
169- 8- నభ సభ
170- 6- తోం తో
,,- 11- తూగు తూంగు
171- 16- గా; గాం
172- 3- చ్యుత చ్యుతం
,,- 4- వ్వర శ్వర
,,- ,,- వాత్మ వ్యాత్మ
,,- 21- నొండ్ల నొండ్ల
,,- 22- నొకండ్లు నొకండ్లు
173- 1- నజే నంజే
,,- 5- స్వన స్వన
,,- 20- మెంక మెంత
174- 12- గావె గాదె
,,- 14- దలపు దలంపు
,,- 22- సేడు సెడు
175- 1- సతిరతి సతితోం
,,- 2- కలితుండం గలయిక
,,- 10- యిటు యిట్లు
176 5- పరగు పరంగు
,,- 8- మవ మన
,,- 21- చిన చిన
177- 13- మైత్రబా మైత్రంబా

| పుట- పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|
| ,,- 17- | బహుథా | బహుధా |
| 179- 3- | విచ్చి | వచ్చి |
| ,,- 7- | మసవి | మనవి |
| ,,- 17- | లెనగు | లెసఁగు |
| 180- 9- | నత్తర | నత్తరు |
| ,,- ,,- | ప్తిమె | ప్తిమెఁ |
| ,,- 11- | వాడ | వాఁడ |
| 182- 12- | యయ్యా | యయ్యో |
| 183- 5- | సావుత్ర | నావుత్ర |
| ,,- 11- | థర్మ | ధర్మ |
| ,,- 19- | లోతా | లోలా |
| 184- 5- | ధ్యాథీ | ధ్యాధీ |
| ,,- 9- | మిద | మీఁద |
| ,,- 19- | మాకు | మీకు |
| 185- 16- | గగ | గఁగ |
| ,,- 17- | ద్భవు | ద్భవుఁ |
| 185- 21- | యగా- | యఁగా |
| 186- 6- | గ్రిహా- | గ్రహ |
| 187- 6- | దుఃఖు- | దుఃఖ |
| ,,- 14- | గోష్టి- | గోష్ఠి |
| 188- 7- | గగా- | గఁగా |
| ,,- 16- | బెడ్ల- | బెండ్ల |
| 190- 2- | ర్వాంథు- | ర్వాంధు |
| 191- 9- | ద్ధూత- | ద్ధూత |
| 192- 1- | సిద్థ- | సిద్ధ |
| ,,- 22- | తోబ- | తోఁబ |
| 193- 3- | దగ్ధ- | దగ్ధ |
| ,,- 5- | నగ్ధి- | వగ్ధి |
| 194- 8- | దాకి | దాఁకి |
| 197- 15. | లగ్రా- | లఁగ్రా |
| 198- 2:- | వురి- | పురి |
| 199- 17- | నడీ- | నుఁడీ |
| ,,- 20- | కం॥- | చం॥ |
| 203- 5- | రల- | రలఁ |
| ,,- ,,- | పబూ- | పఁబూ |
| 205- 18- | లింద- | లింగ |
| 206- 19- | బతియూ- | బతియొ |
| 208- 4- | !పోపని- | పోవని! |
| 210- 15- | పొవ- | పోవ |
| ,,- 22- | వినుడో- | వినుఁడో |
| 211- 1 | నేను- | నేను |
| 218- 17- | టిని- | ంకి |

కథాసంగ్రహములోని మూడవపేజీయందలి పందొమ్మిదవ పంక్తిలో "సొప్పుచుండిరి." అనుతరువాత "వారికడ యవనదేశ రాజతనయ లిరువురు చిక్కుపడి యుండిరి." అని చదువుకోవలయును.



1. ఇందు సంవత్సరమునకు 600 పేజీలకు మించనిమూఁడు, నాల్గు గ్రంథములం బ్రచురింతుము.

2. విచిత్రమగు కథాసందర్భమును (Plot), మనోహరమగు శైలియు, ఆ యాపాత్రములకుం దగిన స్వభావ నిర్మాణమును (Characterisation) కల్గి ముద్దులుగులుకు నవలలు; కల్పనాచమత్కృతియు, మృదుమధుర శైలియుఁ గల్గి యెంతయు రంజింపఁజేయు కావ్యములును; రసవంతములై, ప్రదర్శనయోగ్యము లగుచుఁ దనరారు నాటకములును; మఱికొన్ని యుపయోగకరములకు వచనగ్రంథములును; ఇందుఁ బ్రకటింపఁబడును.

3. మాశాశ్వతపుఁ జందాదారులకు గ్రంథములను మిగులచౌకగా నీయఁదలచితిమి. క్రౌనుసైజు నూఱుపుటలకు రు 0-4-0 చొ॥ నను డెమీసైజు నూఱుపుటలకు రు 0-6-0 చొ॥ నను మాత్రమే వెల నిశ్చయింపఁబడినది. పోష్టు ఖర్చులు కొనువారివే, ఇతరులకు ధరలు హెచ్చుగా నుండును.

4. చందాదారులు చందా ముందుగా నీయనక్కఱలేదు. గ్రంథ మచ్చుపడి వి. పి. గా, పంపఁబడినపిమ్మట, సదరు సొమ్ము చెల్లించి పుచ్చుకొనవలయును. మాచందా దారులకు హనుమన్నక్షత్రమాల యుచితముగాఁ బంపఁబడును.

5. చందాదారు లగుటకు రు 0-4-0 ప్రవేశపురుసుము చెల్లింపవలయును. అది మొదటిగ్రంథములో రాఁబట్టుకొనఁబడును. చందాదారులు మేము ప్రచురించుగ్రంథముల నన్నింటిని గొనవలయును. మాకు బదుగురు చందాదారులం జేర్చినవారికి మా గ్రంథమాలలోని 3 పుస్తకము లుచితముగఁ బంపఁబడును.

మేనేజరు ఆంధ్రవాణీ రత్నమాల,

అంగలూరు కృష్ణాజిల్లా.

